ఆర్ష విజ్ఞానపరిషత్తు

# చీఁకటిలో జ్యోతి



(టాల్‌స్టాయ్)

4883 RO




గణపతిశాస్త్రి

వెల : 2.50

# వినతి

ఈ " చీకటిలో జ్యోతి " అన్నది " The Light shines in the darkness " అను టాల్‌స్టాయి నాటకమునకు తెనుఁగు. ఈ నాటకములోని విషయమించుమించు టాల్‌స్టాయిజీవిత మెయనిఅందురు.

టాల్‌స్టాయి మానవుఁడై పుట్టి పశుత్వము నుండి దాటి తన మానవత్వమును నిలబెట్టుకొన్నాఁడు. పిదప జీవితమును సత్యమును మననము చేసికొని మహర్షి యైపోయినాడు. ఎవ రేమతములో పుట్టినను అన్ని మతముల మూలసూత్రము లొకటిగాన మతముల మతకర్తల పేర్లు వెట్టినను ఆపేరు విడిచి ఆ విషయము నందలి ఆ భావములు అందఱు గ్రహించి నేర్చుకొన వలసినవే. పశు పక్షుల వలెనే మానవుఁడు ఏమాత్రము ఆస్తి, ధనము లేకుండనె పుట్టినను నేఁటి ఆస్తులు ధనములు మొదలగునవి వంశ పరంపరగా వచ్చునట్లు మన మేర్పరచుకొన్న శాసనములే చేసినవి. పశు పక్షులకు జ్ఞానము లేక పోయినను మానవుల కున్నంత వ్యత్యాసములు, కలహాములు, రోగములు కష్టములు వానిలో కనిపింపవు. మనుష్యుఁడు తనకున్న జ్ఞానముచే పశు పక్షుల కంటె ఉత్తమముగా జీవించవలసిన వాఁడైనను దేవుఁడుగా పెరగవలసిన వాఁడైనను పశు పక్షులకంటె తక్కువస్థితిలో పెరుగు చున్నాఁడు. గొప్ప జ్ఞానులును ఆచరించి చూపి చెప్పి కవులును ఎన్ని చెప్పినను తమ మామూలు జీవితమును మానవుఁడు వీడ లేకున్నాఁడు. అట్టి మామూలు మానవులతో ఏర్పాటయిన ప్రభుత్వమును అట్లే యున్నది.

మానవుఁడు తాను మనుష్యుఁడై పుట్టినందుకు మానవుఁడయి జ్ఞానము పొంది స్వార్థపరుఁడు గాకుండ నుండి దైవనిర్మితములు,

స్వభావసిద్ధములు నగు దయ త్యాగముభక్తి మొదలగు యుత్తమ గుణ ములను విడిచిపెట్టి తన్నుతనవారిని అధోగతికితీసికొని పోవుచున్నాఁడు.

ఎంత ఎక్కువ ధనము సంపాదించుకొన్న అంత పాపి యనుకొనుటకు బదులు ఎంత ధన్నమున్న అంత ఆగర్భ శ్రీమంతుఁడు భాగ్యవంతుఁడు అదృష్ట వంతుఁడు అను పేర్లు స్వార్థపరులచే పెట్టించుకొని తాను పెట్టుకొని కులుకుచున్నాఁడు. "తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః" దేవత లిచ్చిన భోగములను ఇవ్వక తానొక్కఁడు తినువాఁడు దొంగ యనియు, భుంజతే తేత్వఘం పాపాః యే పచంత్యాత్మ కారణాత్' ఎవరైతే తమకోసము మాత్రమె వండుకొందురో వారు పాపమునె తినుచున్నారు అని భగవద్గీత చెప్పుచున్నది. సూది బెజ్జములో ఒంటె యైనను దూరఁగలదు గాని ధనికుఁడు స్వర్గ రాజ్యములో ప్రవేశింపలేఁడు అని బైబిలు చెప్పుచున్నది. ఇట్లే అన్నిమతములు అధికధనము సంపాదించుట పాపమని ఘోషించుచున్నను వానిని వినువారులేరు. వారు వినినను వినకపోయినను అధికధనము పాపమయినపుడు దానివల్ల ఈజన్మలో తరువాతి జన్మలలో కష్టములనుభవింపక తప్పదు. కాన ఇది తప్పు అని మహాత్ములు చెప్పి నడచి చూపుదురు. శాస్త్రాల ద్వారా కావ్యాల ద్వారా నాటకాల ద్వారా చెప్పుదురు. వారు చెప్పనట్లు వినక పోయినచో మనము అధోగతి పాలగుట తప్పదు. అందుచే ఈసంగతి బాగుగా గ్రహించుకొని మనము స్వార్థము విడిచి అందఱను ఆత్మ సోదరులుగా తలఁచి వారి కష్టములను మన కష్టములుగాఁ దలఁచి వారిని ఉద్ధరించుట ద్వారా మనలను ఉద్ధరించుకొని ఆనందము పొందుదము గాక.

ఇట్లు,

చర్ల గణపతిశాస్త్రి

# ఈ నాటకములో వచ్చు పాత్రలు

నికోలసు అయివనోవిచ్ సరయాంతసవ్ – కథానాయకుఁడు.

మేరీ సరయాంతసవ్ – నికోలసు భార్య

ల్యూబా
మిసీ – నికోలసు కుమార్తెలు.

కాతియా – నికోలసు చిన్నికూతురు

స్ట్యూపా – నికోలసు పెద్దకొడుకు.

వానియా – నికోలసు చిన్నకొడుకు.

అలెగ్జాండర్ మాయికాలోవిచ్ – ల్యూబాకుఁ గాఁబోవుభర్త

మిట్రోఫను – వానియా గురువు.

అలెగ్జాంద్రా లేక అలీనా – మేరీ పెద్దయవ్వగారు.

పీటర్ సెమీనోవిచ్ – అలెగ్జాంద్రా భర్త.

లిసా – వారి కూఁతురు.

రాజకుమారిచేరమశనోవ్న – ఒక ధనికురాలు.

బోరిసు – ఆమె కొడుకు.

టానియా – ఆమె కూఁతురు.

వాసిలీ – నికోలసు పురోహితుఁడు.

అయివన్ – ఒక రైతు.

– ఆయివాణా భార్య

మలాశ్క – రైతు కూఁతురు.

పిట్రోవిచ్ — ఒక పేద త్రాగుబోతు.

జిరైసియము — ఫాదిరీ

పీటర్ — రైతు.

వడ్రంగి, పోలీసు సూపరింటెండెంటు, పోలీసు ఇన్స్పెక్టరు, ద్వార పాలకుడు, పెద్ద డాక్టరు, చిన్న డాక్టరు, రోగులు, రైతులు, స్త్రీలు, నటకులు, యువతులు, సైనికులు, గుమాస్తా, గవర్నమెంటు ఉద్యోగులు.



# చీకటిలో జ్యోతి

## ప్రథమాంకము

### ( మొదటి దృశ్యము )

[ మేడలోని వరండా దాని కెదురుగా క్రికెట్ ఆడు స్థలము, టెన్నిస్ కోర్టు, పచ్చిక బయలు. పిల్లలు క్రికెట్ ఆడుచుందురు. వరండాలోని బల్లమీద టీపాత్ర, కాఫీపాత్ర యుండును మేరీ నలుబ దేండ్ల వయస్సుగల సుందరి. ఆమె సోదరి అలెగ్జాండ్రా. నలుబదిఅయి దేండ్లది. మూర్ఖురాలు. పెంకిపట్టు గలది. ఆమె భర్త పీటర్. ఒక మొద్దు మనుష్యుడు. వీరందఱు కాఫీ త్రాగుచుందురు. పీటర్ సిగరెట్ కాల్చుచుండును.]

అలెగ్జాండ్రా : నీవు నా చెల్లెలివి నికోలసు నీ మగడు. అయిపోయి నాడుకాని, లేకపోయిన ఇవన్నియు నేను గూడా వినోదముగా చూచుచు, ప్రోత్సాహ పరచుచుండెడి దాననే. నీ మగడు పట్టి కుంతలాగున పాడుచేయుచుండగా నేను మాత్రము ఊరుకోలేను. నా యుద్దేశ్యమును నీ మగనితో చెప్పివేయు దును.

మేరీ : నాకు కొంచెము కూడా బాధ కలుగుటలేదు. ఇది నేను మాత్రము చూచికొనలేనూ ? కాని యిదియంత యవసరమని యనుకోను.

అలె: అవును నీవెందుకనుకొందువు? నేను జెప్పుచున్నాను విను. ఇట్లే ముందుకూడా సాగిన మీరందఱు ముష్టివారై పోవుదురు.

పీటర్ : చూతము. ఇంత రాబడియుండగానే ముష్టివారై పోవుదురా?

అలె: ఆ! అయిపోరూ ? దయయుంచి మీరు మా మాటల కడ్డు రాకుడు. పురుషులేమి చేయుటకైనను దగినవారే. మీవంటి వారికి వాడు బాగుగనే చెప్పగలడు.

పీ : ఉస్! అబ్బా! నాకేమియు తెలియుటలేదు. నేను చెప్పునది....

అలె: అసలు మీరు చెప్పునదేమిటో మీకు తెలిసినగదా. తెలివితక్కువ పని చేయువానిని ఎట్లు ఆపవలెనో మీ పురుషులకు తెలియనే తెలియదు. నేనే కనుక మీ స్థానములోనున్న ఇటువంటి వ్యాపారములను ఎప్పుడైనను జరగనిత్తునా ? వానిని ఒక్కమాటుగా ఆపివేయనూ ? చివరకు వీనిని ఎవరు గౌరవింతురు ? భార్యయున్నది. పిల్లలున్నారు. ఇల్లు వాకిలి యున్నవి అను మాటయైనను లేదే. ఎవరు ఏది కోరినా దానినెల్ల పట్టుకొనిపోనిచ్చుటయే. చివరకు మీగతి ఏమగునో తెలియునా ?

పీ : (మేరితో) అయితే మేరీ! నాకు కొంచెము చెప్పు. ఈ గందరగోళమంతయు నేమిటి ? స్వాతంత్ర్యము, జిల్లా సభలు,

రాజ్యాంగ పద్ధతి, పాఠశాలలు, గ్రంథాలయములు, సామ్య వాదము, సమ్మెలు మొదలగున సంగతులన్నియు నెరుగుదును కాని యిదంతయునేమి? నాకు జెప్పు.

మే : ఐతే నిన్ననేగదా వారు మీకు బోధపరచినారు!

పీ : అవును. నాకు తెలియనే లేదని యొప్పుకొనవలెను. బైబిల్ సంగతి, కొండమీద ఏసుక్రీస్తు చేసిన యుపదేశము సంగతి ఆయన చెప్పినారు. గుళ్లు అవసరమే లేదన్నారు. అయితే పూజలు చేయుట యెట్లు?

మే : అవును. ఇదే గాదు మరి దురదృష్టము. అవన్నియు నశించి పోవలెనని యాయన యందురు అయితే వానికిబదులు లోకాని కేమీ చూపింపరు.

పీ : అసలు ఇది ఎట్లు ప్రారంభమైనది?

మే : క్రిందటి సంవత్సరము వారి చెల్లెలు చనిపోయినప్పటి నుండి ఇదంతయు నారంభమైనది. చెల్లెలన్న ఆయన కెంతో ప్రేమ. చెల్లెలి చావు వారికెంతో బాధ కలిగించినది. అప్పటినుండి విచారించుచు నిత్యము చావును గూర్చియే ప్రసంగించు చుండెడి వారు. వారికి జబ్బు చేసినట్లు మీరెరుగరు కాబోలు! జబ్బు నయమైన తర్వాత బ్రొత్తిగా మారిపోయినారు.

అలె: నన్ను జూచుటకు ఫాల్గుణ మాసములో మాస్కో వచ్చినప్పటికి బాగుగానే యున్నాడు. వేళాకోళాలు కూడా జేయు చుండెడివాడు.

మే : అవును. కాని యింతలో వారిలో ఏదో మార్పు జరిగినది.

పీ : ఎటువంటి మార్పు ?

మే : ఆయనకు కుటుంబములోని సంగతి యేమియు నొంటబట్టదు. వారు పట్టుకొన్న కుందేటికి మూడే కాళ్ళు. ఎవరు చెప్పినను వినరు కొన్ని దినముల వరకు తరచు బైబిల్ చదువుచు రాత్రి నిద్రపోవు వారు కాదు. రాత్రియందే లేచి చదువుచూ ఏవో వ్రాసి గుర్తు పెట్టుకొనెడివారు. అది మొదలు ఫాదరీలను సాధువులను, ఫకీరులను గలసికొని మతమునుగూర్చి ప్రసంగించు చుండెడివారు.

అలె: అయితే మరి వ్రతములు, ఉపవాసములు చేయుచుండెడి వారా ?

మే : మా పెళ్ళి అయినదగ్గర నుండి అనగా ఇరవై యేళ్ళ క్రితము నుండి నేటి వరకు వారెప్పుడును వ్రతములు, ఉపవాసములు చేయలేదు. కాని వారిలో మార్పు జరుగుటకు ముందు ఒక మారు గుడిలోనికి బోయి మంత్రోపదేశము పొందినారు. దాని తర్వాతనే మంత్రము జపింప నక్కరలేదు. గుడిలోనికి వెళ్ళ నక్కరలేదు. అని నిశ్చయించుకున్నారు.

అలె: ఊహూ! అట్లానా? అయితే అతడు ఒకమాట మీద నిలబడ డన్నమాట.

మే : అవును. ఒక నెలక్రితమురాక గుడిలోనికి వెళ్ళుటకు ఏమియు అభ్యంతరము పెట్టువారు కాదు. కాని ఆ తర్వాత హఠాత్తుగ ఇవన్నియు అనవసరమైనవని నిశ్చయించుకొన్నారు చాలా బాగున్నది. ఇటువంటి వారితో నుండుట యెట్లు?

అలె: అతనితో నిదివరకే మాటాడితిని. మరలమాటాడుదను.

పీ : బాగున్నది. కాని యీ వ్యవహారమంత ముఖ్యమైనదికాదు.

అలె: ముఖ్యమైనది కాదూ! మీకు గాకపోవచ్చు. అసలు మీ పురుషులకు మతమనునది యొకటి లేనేలేదు.

పీ : మేరీ! ఈ మాటొకటి విను చెప్పుచున్నాను. ఇది యేమంత పెద్ద విషయముగాదు. గుడులే అక్కరలేకపోయినా మరి బైబిలెందుకు?

మే : ఎందుకా! మన మందరము బైబిల్‌ను ఏసుప్రభువు కొండమీద చేసిన యుపదేశమును అనుసరించి మన జీవితము గడుపుటకు మనకున్నదంతయు ఇతరులకిచ్చివేయుటకును.

పీ : అయితే సరే! యున్నదంతయు ఇచ్చివేయుదము. మరి మనము జీవితము గడుపుట యెట్లు?

అలె: మరి మనము, నౌకరులు చెయ్యిచెయ్యి కలుపుకొని తిరుగవలెనని పర్వతముమీద క్రీస్తు చేసిన యుపదేశములో అతనికెక్కడ కనిపించినది దానితో "నమ్రులైనవారు ధన్యులు" అని

యున్నది కాని చెయ్యిచెయ్యి కలిపి తిరగవలెనని యెక్కడను లేదే !

మే : అవును. నిజమే. ప్రతిరోజు అలవాటు ప్రకారము ఆయన వెళ్ళి పోవుచుందురు. సరిగా అపుడే సంగీతము, అపుడే దుస్తులు వేసుకొనుట, అపుడే స్కూలు. ఇవన్నియు నేనొక్కతెను చేయగలనా?

పి : ఇప్పుడు అతడు పట్టణములోనికి ఎందుకు వెళ్ళెను?

మే : వారు నాతో ఏమియు చెప్పలేదుగాని మా తోటలో చెట్లు ఎవరో కొట్టుకొని పోవుచున్నారట. వాటి వాకబు కోసము వెళ్ళినారని యనుకొందును.

పి : ఆ దేవదారు వృక్షములున్న తోటనుండియా ?

మే : అవును. బహుశా ఆ మనుష్యులను ఖయిదులో వేసియే యుందురు మరి వారా చెట్లఖరీదు ఇయ్యవలసి యుందురు. ఈనాడు కోర్టులో విచారణయగు నన్నారు. ఇందుకే వారు వెళ్లినారనుకొందును.

అలె: అతడు వెళ్లి వారిని క్షమించును. ఇంక వారికిదే సందు. ప్రతి రోజు వారు తోటనుండి కొట్టి తీసుకొనిపోవుచునే యుందురు.

మే : అవును. ఇదే జరుగుసంగతి. ఇంక మామూలుగా ఏపిల్ చెట్లు కొట్టుకొని పోవుచునే యున్నారు. ఇంక పచ్చని చేలన్నియు

ధ్వంసము చేయుదురు. మరి యాయన యివన్నియు క్షమించు చుందురు,

పి : ఇది చాలా చిత్రమైన సంగతే!

అలె : ఇదిగో నేను చెప్పునది విను. ఇట్లు ఎన్నటికీ జరగనీయకూడదు. ఇట్లే జరగనిచ్చిన అంతయు నాశనమయి పోవును. తల్లికుండు బాధ్యతను బట్టి నీ భాగము నీవు తీసుకో.

మే. నేనేమి చేయగలను ?

అలె· చేయుట కేమున్నది? "ఇట్లు చేయవలను" అని చెప్పివేయుము. నీవు పిల్లలుగల దానవు. ఇదేమి ప్రవర్తన అతనికి.

మే: ఇది మిగుల కష్టమైనదే. నిస్సంశయము. ఇవన్నియు సహించు చున్నాను. ఒకవేళ మరల వెనుకటి వారగుదురేమో యని యాశపెట్టుకొని యున్నాను.

అలె: ఇంటిలో నీవొక్కడవు మాత్రమె లేవు అనియు ఈ విధముగా నెవ్వరును జీవింపలేరనియు అతనికి తెలియునట్లు చెప్పవలెను.

మే: ఇప్పుడాయనకు పిల్లల గొడవ యక్కరలేదు. అన్నియు నేనే చూచుకొనవలసి వచ్చుచున్నది. పెద్దపిల్లల సంగతి యిట్లుండగా నా యొడిలో ఒక చంటిపిల్లవాడుకూడా ఉన్నాడు. మగపిల్లలున్నారు, ఆడపిల్లలున్నారు, వీరందరి బాగోగులు నేనే చూచుకొనవలెను. వారి చదువుసంగతికూడా నేనే చూడ వలయును. మొదట మాత్రము ఆయనకు పిల్లలమీద ప్రేమ

యుండెడిది. పిల్లలను జాగ్రత్తగా కనిపెట్టుకొని కూర్చుండెడి వారు. కాని వారిప్పుడు పిల్లలగొడవ యక్కర లేనట్లున్నది. 'వానియా' బాగుగా చదువుటలేదు. పరీక్ష ప్యాసు కాడేమో అని నేననగా "అట్లన్నచో స్కూలు మాన్పించుటయే మంచిది" అని యన్నారు.

పీ : మాన్పించి వారికేమి చేయమనను !

మే: ఎమున్నది! మనము చేసినదెల్ల చెడ్డదని, తప్పని చెప్పుచుందురే కాని, మంచిదేమో చేయవలసినదేమో చెప్పనే చెప్పరు.

పీ : అవును మరి చెప్పకపోయిన నెట్లు? ఇది చెడ్డవిషయమే.

అలె : ఇందులో చెడ్డదేమున్నది అన్నియు చేడ్డపనులు స్వయముగానె పనిచేయకపోవుట ఇదంతా మీకు మామూలేగా !

మే: స్త్ర్యోపాకు విశ్వవిద్యాలయములో చదువు పూర్తియయినది. వానిని ఏదో యుద్యోగములో ప్రవేశపెట్టవలెను. కాని ఆయన యీ విషయములో ఏమియు మాటాడరు. వానికి సైనిక శాఖలో జేరవలయునని యున్నది. కాని మా పిల్లలతండ్రికది యిష్టము లేదు. పోనీ యాళ్వికదళములో ప్రవేశింపవలెనను కున్నాడు. వారి తండ్రి కదికూడా గిట్టలేదు, అయితే మరి నాగలి దున్నుకోనా!" అని వాడు తండ్రి నడిగెను. అందు కాయన ఏమి! నాగలి ఎందుకు దున్నుకోరాదు. గవర్నమెంటు ఉద్యోగముకంటె అది వేయిరెట్లు మంచిది. చేయవలసినది

కూడ" అని యన్నారు. పాపము వాఁడేమి చేయును ? నా దగ్గరకు వచ్చి నా సలహా అడుగుచున్నాఁడు నేనే యిదంతయు నిశ్చయము చేయవలసి యున్నది కాని మరి అధికారాలన్నియు వారిచేతిలోనే యున్నవిగదా !

అలె : అన్ని సంగతులు ఉన్నదున్నట్లు సరిగా చెప్పివేయుము.

మే : అవును. తప్పక యివన్నియు ఆయనతో చెప్పవలయును.

అలె : "ఈ విధముగా నయితే వ్యవహారము సాగదు. నేను నాపని చేసుకొనుచున్నాను. నీవు నీ కర్తవ్యము నెరవేర్చుకో." అని స్పష్టముగా చెప్పు. మరి దీని మీద అతఁడు రాజీపడకపోయిన అన్ని అధికారాలు నీకొప్పగింపవలసినదే.

మే ; కాని యిది యేమాత్రము హర్షింపఁదగిన విషయముగాదు.

అలె : నీవు చెప్పకపోయినను నేనతనితో సంగతులన్నియు చెప్పివేయుదును!

[కంగారుపడుచు యువకుఁడయిన పురోహితుఁడొకఁడు ప్రవేశించును. చేతిలో నొక పుస్తకమున్నది. అందఱితో చెయ్యిచెయ్యి కలుపుచున్నాఁడు.]

పురోహితుఁడు : నేను నికోలసుగారిని కలిసికొనుటకు వచ్చితిని. వారికొక పుస్తకము ఇవ్వవలసియున్నది.

మే : వారు నగరములోనికి వెళ్ళినారు. ఈపాటికి వచ్చుచుందురు.!

అలె : అదేమి పుస్తకమండి?

పు : రేనన్కవి వ్రాసిన క్రీస్తు చరిత్ర.

పీ : ఆఁ ఏమి యీ అన్యాయము. మీబోంట్లుకూడా ఎటువంటి పుస్తకములు చదువుచున్నారు!

పు : (కొంచెము కంగారుపడి సిగరెట్టు* అంటించుచున్నాడు) నికోలసు బాబుగారు. చదువుమని యీ పుస్తకమిచ్చినారు.

అలె : (తిరస్కారముతో) ఇచ్చినాఁడా? అయితే మీరుకూడా నికోలసుతోను 'రేనను'తోను ఏకీభవింతురా ఏమి ?

పు ; కాదమ్మా! నిజముగా నే నేకీభవించువాఁడనయినచో దేవాలయమునకు సేవకుఁడనుగా నుండకయే పోదును!

అలె : మీరు దేవాలయమునకు నిజమైన సేవకులైతే నికోలసును మంచిమార్గములోనికి ఎందుకు తీసుకోనిరారు ?

పు : ప్రతి మనుష్యునికి ఒక ప్రత్యేకమైన యాశయముండుట వాస్తవము. నికోలసు బాబుగారి యాశయములలో, చాలభాగము సత్యము లేకపోలేదు. కాని వారు ఒక్క దేవాలయము విషయములో మాత్రము భ్రాంతి పడుచున్నారు.

---

* మన దేశములో పురోహితులు పొడుము పీల్చుట తప్పుగా సంఘములో గణింపఁబడినట్లె, అక్కడ సిగరెట్లు కాల్చుట రష్యాలో తప్పుగా గణింపరు,

అలె : ఏమిటి ! నికోలసుగారి యాశయములలో ఉన్న సత్యము ? సరే బాగున్నది. మనకున్న ధనమంతయు ఇతరులకిచ్చి ఇంటిలో వారిని సంన్యాసులను జేయవలెననియే కాదూ పర్వతముమీఁద క్రీస్తు చేసిన యుపదేశములోని సంగతి.

పు : నిజమునకు దేవాలయము 'సాంఘిక జీవనను విధికృత్య' మని తెలుపుచున్నది. పూజ్యులయిన మత గురువులు ఆశీర్వదించినారు కూడ. కాని మహాత్ముల యాదర్శ జీవితము 'ఈ సంసార లాభములను భౌతికైశ్వర్యములను త్యాగముచేసి వేయవలెనని తెలుపుచున్నది.

అలె : నిస్సందేహముగా సాధువులును సత్పురుషులును ఇట్లేచేసినారు. కాని మనవంటి సామాన్యులు సాధారణమైన కర్మలనే చేయవలెనని యనుకొందును. అదేనిజమైన క్రైస్తవుల కలంకారము.

పురో : "వీఁడిట్లు చేయవలెను. వాఁడట్లు చేయవలెను." అనియెవఁడు చెప్పఁగలఁడు.

అలె : తమకు వివాహమైనదా ?

పురో: అయినదమ్మా ?

అలె : తమకుఁ బిల్లలా ?

పురో: ఇద్దరు.

అలె : అయితే మీలాభములు, ఐశ్వర్యములు ఎందుకు త్యాగము చేయలేదు. మఱి యెందుకిట్లు సిగరెట్టు కాలుచుచుఁ దిరుగుచున్నారు.

పురో: ఇది నా దౌర్భాగ్యమే. నిజము చెప్పవలసి వచ్చినచో నేను చేయుపని తప్పే.

అలె : అవును. నాకుఁ దెలిసినది. మీరతనిని దారిలోనికిఁ దీసికొని వచ్చుటకు బదులు స్వయముగా మీరే యతని యభిప్రాయము లను సమర్థించుచున్నారు. కాని యిది మంచిది కాదని చెప్పు చున్నాను.

దాది: (ప్రవేశించి) అబ్బాయిగారు ఏడ్చుచున్నారు. మీకు వినఁబడ లేదూ ? బాబుగారిని గొంచెము చూడుఁడు.

మేరీ: నడు. ఇదిగో వచ్చుచున్నాను. (లేచి వెళ్ళుచున్నది)

అలె : నా చెల్లెలిని జూచినఁజాల దుఃఖము కలుగుచున్నది. పాపము దీనురాలికెంత కష్టము వచ్చినది. ఏడుగురు పిల్లలు. వారిలో ఒకఁడు చంటిబిడ్డ. వాఁడనిన గారాబము. అవును. తెలియు చున్నదిలెండు. వాని మెదడులో ఏదో పిచ్చి ప్రవేశించినది. (తలముట్టుకొనుచుఁ బురోహితునితో) సరే, ఏదీ కొంచెము చెప్పుఁడు. తమబోఁటివారు కనుకొన్న క్రొత్త మతమేమిటి?

పురో: నిజముగా నాకేమియుఁ దెలియదు.

అలె : అయ్యో లేనిపోనివి కల్పించకుఁడు. నేనేమి అడుగుచుంటినో మీరు బాగుగా ఎఱుఁగుదురు.

పురో· అట్లయిన నాకాజ్ఞ యీయుఁడు మఱి.

అలె : అయినవానితోను గానివానితోను చెయ్యి చెయ్యి కలుపుమని యాజ్ఞాపించునది. చెట్లన్ని కొట్టుకొనిపోవుచుండఁగా ఊరు కొమ్మని చెప్పునది, కల్లు త్రాగుటకు డబ్బిచ్చి ఇల్లు గుల్ల చేయించునది, కూడ ఒక మతమేనా యని యడుగుచున్నాను.

పురో: ఈ సంగతి నే నెఱుఁగను.

అలె : ఇదే క్రైస్తవ ధర్మమని యతఁడనును. తమరు సనాతనమైన గ్రీక్కులగుడికిఁ బురోహితులు గనుక నిజముగా క్రైస్తవ ధర్మము దోపిడి తననును ప్రోత్సహించునదో కాదో మీరు తెలిసికొని యితరులకుఁ జెప్పవలెను.

పురో: కాని నేను.

అలె : అట్లు కానిచో ఎందుకు పురోహితులైనారు? ఈ బారెఁడు గడ్డమెందుకు? ఈ పొడుగుపాటి గౌనెందుకు?

పురో: కాని మమ్మెవరును అడుగలేదు.

అలె : నిజముగా అడగలేదూ? నే నడుగుచున్నాను. ఎందుకో తెలియునా? "నిన్నడిగినదెల్లి నిచ్చివేయుము" అని బైబిలులో నున్నదని యతఁడనును. కాని యదియే యుద్దేశముతోఁ జెప్పఁబడినది.

పు : దీని యాశయము స్పష్టముగానే యున్నదని నే ననుకొను చున్నాను.

అతె : నేనట్లు అనుకొనుటలేదు. ప్రతి మనుష్యునికిఁగూడ భగవంతుఁడు ఒక్కొక్క స్థానము ఏర్పఱచెనని మన గురువులు బోధించి నారు.

పు : బహుశా అట్లే కాని.

అతె : ఈ వ్యవహారమంతయు నేను విన్నదానికి సరిపోవుచునే యున్నది. తమరు అతని పక్షమున వహించుట యనుచితము. సాపుగా నా మనస్సులోనున్నది మీ ముఖము ముందు చెప్పి వేయుచున్నాను. ఎవరైనఁ జిన్న బడి పంతులు "ముక్కు మొహాము" తెలియనికుఱ్ఱవాఁడు అతని వెనుక తాళము వేసిన వేయనీ కాని తమరు పురోహితు లను ధ్యానమైన లేక యతనిని సమర్థించుట బాగున్నదా? తమపైని ఎంత బాధ్యత యున్నదో తెలియునా?

పు : నేను ఆ విషయములోఁ బ్రయత్నించుచున్నాను.

అతె : అతఁడు గుడికి వెళ్ళక మంత్ర తంత్రములలో విశ్వాసముంచక యున్నపుడు ఇంక అది ఎటువంటి మతము? మీరు అతనిని దారిలోనికిఁదీసికొని రాకపోవుట సరిగదు. పైఁగా మీరు కూడ అతని వెంటఁబడి 'రైనను' పుస్తకములు చదువుచు బైబిలుకు మీ యిష్టము వచ్చినట్లు అర్థాలు తీయుట బాగున్నదా?

పు : (ఆవేశముతో) నేను మీకు జవాబు చెప్పలేను. నిజముగా నేను కంగారుపడ్డాను ఇప్పుడేమియు నేను జెప్పను

అలె : నేను పీఠాధిపతిని గావలసినది. చెప్పుదును. "రేనను" కవి పుస్తకములు చదువుట యేమిటో సిగరెట్టులు కాల్చుట యేమిటో మీ కందఱకు నా సంగతి చూపించియుందును.

పీ : ఈశ్వరుని ముఖముచూచి కొంచెమోపిక పట్టుము. ఇందులో నీకేమి యధికారమున్నది.

అలె : (భర్తవైపు తిరిగి) దయయుంచి తమరు నాకు నేర్ప నవసరము లేదు, (పురోహితునితో) మీరు మాకుఁ బూజ్యులైన పురోహితులు. మీరాగ్రహము చూపరని నా నమ్మకము. ఉన్నదున్నట్లు మాటాడుట తప్పా? నేను కోపమును మనస్సులో నుంచుకొనుట చెడ్డదికాదూ?

పు : నేను నా యభిప్రాయములను తగినట్లు ప్రకటించ లేక పోయినచో క్షమింపుఁడు. (అనిష్టముగా అగును).

[నిశ్శబ్దముగా ల్యూబాయును లిసాయును ప్రవేశింతురు. ల్యూబా మేరీ కూఁతురు. ఇరువది యేండ్లది. చుఱుకైనది. అందమైనదికూడ లిసా అలెగ్జాండ్రా కూతుఁరు. వయస్సులో ల్యూబాకంటెఁ గొంచెము పెద్దది. వారి తలమీదఁ జేబురుమాలు కట్టియుండును. వారిచేతిలోఁ జిన్న పూసల సజ్జలు. ఇద్దరు వచ్చియందఱకు నమస్కరింతురు.]

ల్యూ: అమ్మ ఎక్కడున్నది?

అలె : ఇప్పుడే పిల్లవాని దగ్గరకు వెళ్ళినది,

పీ : చూడుడు చాలమంచి యందమైన పువ్వులు తీసికొనిరావలెను. ఈ యుదయము తోటమాలి భార్యతురు మంచి పువ్వులు తెచ్చికొన్నది ఎండ యెక్కువగానున్నది లేనిచో నేను మీతో గూడవచ్చియుందును.

లి : రండు నాన్నగారు మీరుకూడ రండు.

అలె : మంచిది వెళ్ళుచున్నాను. ముందు సిగరెట్టు తెచ్చుకొని వెళ్లుదును. (వెళ్లును)

అలె : పిల్లలందరు ఎక్కడ నున్నారు?

ల్యూ: మాష్టర్ గారు నాయనగారితో పట్టణములోనికి వెళ్ళినారు. అందువల్ల స్ట్యూఫా సైకిలెక్కి స్టేషనుకు వెళ్ళెను. చిన్నపిల్లలు క్రికెట్ ఆడుకొనుచున్నారు. వానియా వెలుపలి వరండాలో కుక్కలతో ఆడుకొనుచున్నాడు.

అలె: సరే అయితే స్ట్యూఫా ఏమైనను నిశ్చయించుకొనెనా!

ల్యూ: ఆఁ. వాఁడు అశ్వికదళములో చేరుటకు స్వయముగా దరఖాస్తు ఇయ్యవలెనని వెళ్లెను. నిన్న నాయనగారితో దెబ్బలాడినాఁడు.

అలె: పాపము వాఁడు చాలా కష్టములో నున్నాఁడు, మనుష్యుని యోర్పునకు కూడా కొంత హద్దున్నది. ఇప్పుడు వానికికూడ నిర్ణయించుకొను శక్తివచ్చినది. జీవనము ఎట్లు గడుచునో చూడవలెనా? యక్కరలేదా? అతఁడేమోమరి భూమి దున్నుకొనుమని చెప్పును.

లూ్యా: నాన్నగారిట్లు అనలేదు. ఆయన....

అలె: మరేమియు పోనిలేదు. స్ట్యూఫా ఇప్పుడు తన జీవితములో ఓనమాలు మొదలుపెట్టవలసి యున్నది. వాని యిష్టమున కడ్డములు గలుగుచున్నవి (ముందువైపుచూచి) ఇదిగో వాఁడిట్లే వచ్చుచున్నాడు.

[పురోహితుఁడు ఒక ప్రక్కకు దొలఁగి పుస్తకముచదువ మొదలిడుచున్నాఁడు. సైకిలుమీద వరండావైపుగా స్ట్యూఫా వచ్చుచున్నాఁడు.]

అలె: నీవు చాలా పెద్దవాడవైనావు. ఇప్పుడు నీ సంగతే మాటాడుకొనుచున్నాము. సరే నీవుకూడా వచ్చితివి. నీవు మీ నాన్నతో దెబ్బలాడితివని లూ్యాజా యన్నది.

స్ట్యూ: అబ్బే, మఱి యేమియు లేదు, అటువంటిదేమియు జరుగలేదు. ఆయన వారి యుద్దేశ్యము చెప్పినారు. నేను నా యుద్దేశ్యము చెప్పితిని. అభిప్రాయ భేదమున్నచో తప్పేమున్నది. మీకు తెలియదు కనుక నా– లూ్యాజా దీనినిసరిగా తెలిసికొనలేనిదని. అన్ని సంగతులు దానికే కావలెను.

అలె: సరే మంచిదె. కాని నీవేమి చేయ నిశ్చయించితివి ?

స్ట్యూ: తండ్రిగారేమి నిశ్చయింతురో తెలియుటలేదుగాని, నేను మాత్రము ఆశ్వికదళములో చేర నిశ్చయించుకొంటినని చెప్పుటకు భయముగా నున్నది. మన ఇంటిలో ఏ విషయము తలపెట్టినను పెద్దయడ్డే వచ్చుచున్నది. కాని ఇది ముఖ్యమైనది

గాదు ఇప్పుడు నా చదువు పూర్తియైనది. కనుకనిప్పుడే ఏదో యొక పనిలో చేరవలసియున్నది. సైనికశాఖలోను, మద్య విక్రయశాఖలోను చేరుట అహితము నీచమును. కనుక నేను ఆశ్విక దళములో చేరుచుంటిని. అందులో నా మిత్రులుగూడా ఉన్నారు.

అలె: బాగుగనే యున్నది. కాని మీ తండ్రిగారు ఇది ఎందులకంగీకరింపలేదు?

స్ట్యూ: పెద్దమ్మా! దానిని చర్చించుటవలన లాభమేమి? వారొక స్థిరమైన యుద్దేశ్యములో పడియున్నారు. వారికి వారి మాట తక్క మిగిలినవేమియు నచ్చవు. సైనికోద్యోగము అన్నిటికన్న నీచమైనదని వారి యాశయము. కనుకనే వారు నాకు ధన మీయరు.

లిసా: స్ట్యూఫా! అట్లుకాదు. వారట్లు అనలేదు. ఆ సమయములో నేనక్కడనే యున్నాను. నీకు జ్ఞాపకములేదూ! నీవు సర్వీసు నుండి తప్పించుకొనలేనప్పుడు వారి కవసరమువచ్చి పిలిచినప్పుడే వెళ్ళవచ్చును. కాని నీయంతట నీవు అటువంటి సర్వీసును ఏలుకొని పిలువులేకుండానే వెళ్ళి చేరుట మంచిది కాదని ఆయన యన్నారు.

స్ట్యూ: నేను నౌకరి చేయుటకై పోవుచున్నాను. ఏమి వారు మాత్రం వెళ్ళుట లేదూ! స్వయముగా ఆయన సేనలోనే యున్నారు గదా!

లి : కాని ధనమీయ నని చెప్పలేదే ! వారి యుద్దేశ్యము లకు విరుద్ధమైన పనిలో జోక్యము కలుగఁ జేసికొనవని యన్నారు.

స్ట్యా: ఇందులో ఆలోచన, విశ్వాసము వీని సంగతి లేనేలేదే! ఎవరైనను సేవ చేయుదునన్న నింకఁగావలసినదేమున్నది ?

లి : నేను విన్నది చెప్పితిని.

స్ట్యా: మీ రెప్పుడును తండ్రిగారిని సమర్థించుచుందురని నే నెఱుఁగుదును. పెద్దమ్మా ! లిసా ఎప్పుడును ప్రతి మాటలోను తండ్రిగారి పక్షమే అనునది మీకుఁ దెలియదూ .

లి : ఏది నిజమో !

అలె: తెలివిమాలిన ప్రతి పనిలోను లిసా సిద్ధమగునని నాకుఁ దెలియదూ! పనికిమాలినదాని గాలి సోకిన సరి. దానిని దూరము నుండియే పసికట్టును.

[ఎట్టకమీజు తొడుగుకొని యొక చేతిలో ఔలిగ్రాము పట్టుకొని వానియా పరుగెత్తుకొని వచ్చెను. వానియా వెనుక కుక్కలుకూడా వచ్చును.]

వా: (ల్యూబాతో) చెప్పుమటే ఎవరు వచ్చుచున్నారో!

ల్యూ: చెప్పిన లాభమేమి? ఇట్లిమ్ము- ఔలిగ్రాము నా కిమ్ము.
[ఔలిగ్రాము తీసుకొనుటకు వానియావైపు చేయి చాపును. వాఁడు ఈయఁడు ]

వా: ఇయ్యను. పంపినవారెవరో కూడఁజెప్పను. ఇది యొకరి దగ్గిర నుండి వచ్చినది. నీకు ఎవరనిన సిగ్గో!

ల్యూ: ఛా! ఎక్కడినుండి ఆ టెలిగ్రాము?

వా: ఆఁ! అదిగో! సిగ్గుపడుచున్నావు. పెద్దమ్మా అది సిగ్గుపడుచున్నది చూడు. ఏమి సిగ్గుపడుటలేదూ!

ల్యూ: చాలునులే భడవా! ఎవరు పంపినారో చెప్పవేమి? పెద్దమ్మా ఆ టెలిగ్రాము ఎక్కడినుండి?

అలె: రాజకుమారి చేరమనోవ్న దగ్గరనుండి.

ల్యూ: ఊహూఁ.

వా: అదిగోఁజూడు. ఏమి అట్లు సిగ్గుపడుదువు?

ల్యూ: పెద్దమ్మా! చూతము, ఇటు రమ్ము. (పుచ్చుకొని చదువుచున్నది) "మేము ముగ్గురము మేలుబండిమీఁద వచ్చుచున్నాము. చేరమళనోవ్నతో ముగ్గురనగా ఆమెయు, బోరిసుటూనియా అని కాబోలు–మంచిది. చాలా సంతోషకరమయిన సంగతి.

వా: ఆఁ. అదిగో నేను చెప్పలేదూ! నీకు సంతోషము గలుగునని. స్ట్యూఫా! చూచితివా ఆమెకెంత సిగ్గువచ్చుచున్నదో!

స్ట్యూ: ఇంకఁజాలు లే. మాటిమాటికి బాధపెట్టుట మంచిదికాదు.

వా: నీవు టూనిసూను ప్రేమించుటలేదూ? నీరు లాటరీ వేసికొని

నచో బాగుండును. లేకపోయిన వాని చెల్లెలిని నీవు నీ చెల్లెలిని వాఁడు పెండ్లి చేసుకొనుట యెట్లు?*

స్ట్యా: నోరుమూసుకో. అట్టే ప్రేలకు ఎన్నిసార్లు చెప్పవలెను.

లి : వారు మెయిలులోనే వచ్చుచున్నచో మఱికొంచెము సేపటిలోనే వచ్చెదరన్నమాట.

ల్యూ: అయితే మనమూ పూలుకోయుటకు వెళ్ళవలెనేమో!
(పీటర్ సిగరెట్లు పట్టుకొని వచ్చెను.)

ల్యూ: పెద్దనాన్నగారూ! మేమిప్పుడు వెళ్ళము.

పీ : ఏమి ?

ల్యూ: చేరమళనోవ్సగారు వచ్చుచున్నారు. మంచిది – మనము అంతవఱకు టెన్నిసు ఆడుకొందము. ఏమి స్ట్యాఫా, నీవు కూడా ఆడుదువా ?

స్ట్యా: ఆఁ. సిద్ధముగా నున్నాను.

ల్యూ: వానియా – నేను ఒకవైపు. మఱి నీవు లిసా రెండవవైపు. ఏమి ఒప్పుకొందువా? బంతి పట్టుకొని వచ్చెదను. పిల్లలనుగూడ తీసుకొని వచ్చెదను. (వెళ్లుచున్నది)

పీ : అయితే చివరకు నే నిక్కడనే పడియుండవలసి వచ్చినదే!

పు : (వెళ్ళఁదలంచుచు) మీకు నా నమస్కారములు–శెలవు.

---

* రష్యాలో అప్పుడు వాని చెల్లెలినివీఁడు, వీని చెల్లెలిని వాఁడు ఇద్దఱు వివాహము చేసికొనుట నిషేధింపఁబడినది.

అలె: ఉండుఁడు. కూరుచుండుఁడు నేనింకను మాటాడుద మనుకొను చున్నాను, నికోలసుకూడా ఈపాటికి వచ్చుచునేయుండును.

పు : (కూరుచుండి సిగరెట్టు అంటించును) బహుశా వారింకను ఆలస్యముగా వచ్చెదరేమో!

అలె: అదిగో చూడుఁడు, ఎవరో వచ్చుచున్నారు. నికోలసే అనుకొందును.

పీ : వారు చేరమళనోవ్సుగారి కుటుంబములోనివారేమో!

అలె: అవునవును. తన మేనత్తతో రోములోనుండు చేరమళనోవ్సుగారు ఈమెయే.

పీ : అవును. మేము రోములో పాడుకొనుచు నుండెడివారము. ఆమె బాగుగా పాడఁగలదు. ఆమెకిద్దఱు పిల్లలుగదా!

అలె: అవును, ఆ ఇద్దఱుపిల్లలుకూడా వచ్చుచున్నారు.

పీ : మీ చెల్లెలి కుటుంబముతో వారికింత దగ్గఱ సంబంధమున్నదని నాకుఁదెలియదు.

అలె: దగ్గర సంబంధము మాత్రము లేదుకాని క్రిందటి సంవత్సరము ఇతర దేశములలోఁ గొంత కాలము కలిసియున్నారు. చేరమళనోవ్సుగారు ల్యూబాను తన కొడుకునకు ఎన్నుకొనినది. వాఁడు తెలివైనవాఁడు. ఆమెకుఁ దెలియును. ఇంత కట్నము ఇంకెక్కడ దొరకును?

: కాని చేరమళనోవ్సుగారికి ధనలోపమేమున్నది?

అలె : ఆ. లోపము లేదు. ఇది పూర్వపుమాట. జమీందారు గారింకను జీవించియే యున్నారు. అయితే యున్నదంతయుఁ బాడుచేసివైచిరి. ఆయన త్రాగుఁబోతు. ఉన్నదంతయు కుక్కలకే యయిపోయినది అప్పుడు ఈమె చక్రవర్తిగారి దగ్గర దరఖాస్తు పెట్టుకొన్నది. 'నా భర్తను వదలిపెట్టు చున్నాను. ఇటులైన ఏదైనను కాస్త మిగిలినది నా కిప్పింపుడు' అని. జమీందారు పిల్లలను మాత్రము బాగుగాఁ తయారుచేసెనని యొప్పుకొనక తప్పదు. పిల్ల బాగుగాఁ బాడును. పిల్లవాఁడు అందమైనవాఁడు. అభివృద్ధికి వచ్చువాఁడు. విశ్వవిద్యాలయములోఁ జదువు పూర్తి చేసినాఁడు. కాని యిప్పుడు మేరీకి సంతోషముగా నుండదనుకొందును. ఇప్పుడు అళ్ళుల్లు వచ్చుట కొంచెము కష్టముగా నుండును. ఇదిగో నికోలసుకూడ వచ్చినాఁడు.

[నికోలసు ప్రవేశించును]

నికో : అయితే వదినా! నీ వెట్లున్నావు ? పీటరుగారూ! మీరు కులాసాగా నున్నారా! (పురోహితునిజూచి) ఓహో వాసిలీ గారా ?

[అందఱతోడఁ కరస్పర్శ గావించును.]

అలె : దీనిలో ఇంకను కాఫీ యున్నది. ఏమి ఒక గ్లాసు పోయుదునా? కొంచెము చల్లఁబడినది. అయితే ఏమిలే. వెచ్చ పెట్టింతము.

నికో : వద్దు. అవసరము లేదు. ఏదో కొంచెము ఫలహారమైనది. మేరీఏదీ ?

అలె : పిల్లవానికిఁ బాలిచ్చుటకు వెళ్ళినది.

నికో : వాఁడు కులాసాగా నున్నాఁడా ?

అలె : ఆ. ఉన్నాఁడు. మీ పని పూర్తియయినదా ?

నికో : ఆ. అయినది. ఏదీ పోనీ కొంచెము కాఫీగాని టీగాని యీయుఁడు. (పురోహితునితో) పుస్తకము తీసికొని వచ్చినారా ? దానిని మీరు చదివినారా ? దానిలో మీ సంగతే ఆలోచించుచున్నాను.

[ఒక నౌకరు ప్రవేశించి యందఱకు నమస్కరించును. నికోలసు వానితోఁ గరస్పర్శ గావించును.* అలెగ్జాండ్రా భర్తకుఁ గనుసన్న చేయును.]

అలె : ఈ టీపాత్ర కొంచెము వెచ్చచేయుము.

నికో : అవసరము లేదు. వెచ్చచేయ నక్కరలేదు. అట్లే త్రాగుదును.

[మిసీ తండ్రినిజూచి ఆటమాని పరుగెత్తుకొని వచ్చి తండ్రి మెడను పెనవేసుకొనుచున్నది.]

మిసీ : నాన్నగారూ ! మాతోఁగూడ రండు.

నికో : (వీపును దట్టుచు) ఇప్పుడే వచ్చెదను. నేను కొంచెము కాఫీ పుచ్చుకొనవద్దుమఱి. మీరు ఆడుచుండుఁడు.

---

*నికోలసు తనయభిప్రాయము ననుసరించి సర్వమానవ సౌభ్రాతృత్వము చూపుట కట్లు చేసెను.

[మిసెస్ వెళ్ళిపోవును. [illegible] అప్ర
ముతో కాఫీ త్రాగుచుండును.]

అలె : అవునుగాని, వారికి శిక్ష యయినదా ?

నికో : ఆ. అయినది వారు తమ తప్పు ఒప్పుకొన్నారు. పురో హితుని తో తమకు "దేవుని" ఆశయములు పూర్తిగా నచ్చినవని యనుకొనెను.

అలె : మరి మీకుఁ దీర్పు నచ్చలేదా ?

నికో : (విసుగుతో) విన్పందేహముగా నాకది యిష్టములేదు. (పురో హితునితో) మీ యెదుటనున్న ముఖ్య సమస్య క్రీస్తు దేవుఁడా కాదా అనుదానిని గురించిగాని, క్రీస్తు చరిత్రను గురించి గాని కాదు. దేవాలయము గురించి.

అలె : అయితే మరేమయినది ? వారు తమ తప్పు అంగీకరించినారు. సరే! మీరు అది మంచిది కాదన్నారు. మరివారు కట్టు దొంగి లింపకుండనే పట్టుకొని పోయినారా ?

నికో : (పురోహితుని వంకనుండి కష్టముగా అలెగ్జాండ్రావైపు తిరిగి) వదినా ! నీ విటువంటి ఎత్తిపొడుపు మాటలతో నన్నెందుకు బాధపెట్టుదువు ?

అలె : అబ్బే! లేదే!

నికో : వారు కట్టుపట్టుకొని పోవుచుండఁగా నూరకొనుట యెందు కనిగదా నిజముగా నీ యభిప్రాయము . . .

అలె: బహుశా వారికీ టీపాత్రకూడఁ గావలసి వచ్చుననుకొందును.

నికో : లోకులందఱు 'నాది' అని చెప్పుకొను నా యడవినుండి ఏవో పది చెట్లు కొట్టినంత మాత్రమునకు ఆ రైతులను ఖయిదులోఁ బడవేసి వారి జీవితములను నాశనముచేయుట కంగీకరింపని సంగతే గదా మీరు తెలుసుకొనవలసినది!

అలె: మనుష్యులందరునూ ఇటులే యనుచుందురు.

పి : ఇదిగో మరల ఆ వివాదమే మొదలుపెట్టినావు!

నికో : అసలు ఆ యడవి నాది కాదు. పోనీ కొంతవరకు ఆ యడవి నాదే యని యొప్పుకొందము. అట్లయిన మన దగ్గర మూఁడు వేల యకరముల యడవి యున్నది. ఒక్కొక్క యకరములో నూటయేబది చెట్లు ఉండును అన్నియు గలిపి నాలుగు లక్షల యాబదివేల చెట్లుండునుగదా! అన్ని చెట్లలో కేవలము పదిచెట్లు కొట్టినారు. ఇంత చిన్నపనికి ఒక దీనుఁడైన వానిని, వాని కుటుంబమును జాలియైన లేకుండ ఖయిదులో వేయించుట ఎంత ఎటువంటి పనియో చూడుము. నేను జేసినది యుచితము గాదా? నిజముగా ఇదెవరైన నంగీకరింతురా?

మ్యా : మీరా పదిచెట్లు కాపాడుకొననిచో మిగిలినవన్నియుఁగూడఁ బోవునుగదా?

నికో : మీ పెద్దమ్మకు జవాబు చెప్పుటకు మాత్రము ఇట్లు అన్నాను కాని, నిజమాలోచించిన నాకా యడవిమీఁద నెట్టి యధికార మును లేదు. భూమి ప్రతి మనుష్యునిది కూడ. అది యెవని

సొంత యాస్తియుఁగాదు. మన మీ యడవికై ఎప్పుడు ఏమా
త్రము శ్రమపడలేదు.

స్ట్యూ: కాని మీరు సంపాదించిన ధనముతో ఆ యడవిని గాపాడు
చున్నారుగదా ?

నికో: నేనా? లేదు ధనము సంపాదింపను లేదు. నా యంతట నేను
ఈ యడవిని గాపాడుటయు లేదు. ఇంకొకరి తల బ్రద్దలుకొట్టి
లాగుకొని తాను చేయుచెడ్డపనులకు సిగ్గుపడని మనుష్యులకు
ఇటువంటి విషయములు నచ్చజెప్పుట శక్యము కానీ....

స్ట్యూ: కానీ యిక్కడ నెవ్వరు ఎవరినీగొట్టి లాగుకొనుటలేదే!

నికో: మనుజులు స్వయముగాఁ దామే పనిచేయరు. ఇతరులచే సేవలు
చేయించుకొనుటకు సిగ్గుపడరు. "మీరు చేయుపని చాల లజ్జా
కరమైన"దని వారినొప్పించుట చాల కష్టము మఱి నీవు కళా
శాలల్లో అర్థశాస్త్రమును జదివితివిగదా. మేము ఏ స్థితిలో
మా జీవితములను గడుపుచుంటిమో అది సరియైన దవునో,
కాదో స్థాపించి చూపవలసిన భారము నీ యందున్నది. అర్థ
శాస్త్రమునకు ప్రయోజనమిదేగదా !

స్ట్యూ: కాని దీనికి విరుద్ధముగా సైన్సు అన్ని యనుమానములను
బోగొట్టుచున్నది.

నికో: మంచిది. నాకీ సంగతులన్నియు అనవసరము. నేనే గనుక ఆ
రైతు స్థితిలో నున్నచో నేనును అదే చేసియుందును. ఒక వేళ
ఖయిదులోఁ బడవేసిన యేమియు చేయలేక నిరాశతో నుండి

యుందును. నాయందు ఇతరులు ఎట్లు ప్రవర్తింపవలెనని కోరు దునో యటులే యితరులయందు నేను ప్రవర్తింపవలెనని కోరు చున్నాను. ఇందువల్ల వానికి శిక్షపడుట కిష్టపడను. కానివానిని రక్షించుటకుఁ జేయగలిగినది చేసెదను.

పీ : ఇట్లయిన ఎవ్వరును దేనిని జాగ్రత్త పెట్టుకోలేరు.

ఆలె :. అట్లయిన ఇంక పనిచేయుట ఎందుకు ? దొంగతనము చేయుటే ఎంతో లాభకారి యన్నమాట.

(ఇద్దరు ఒక్కమాటు మాటాడుదురు)

సూ్యా: మీరు ఎవరి ప్రశ్నలకు జవాబు చెప్పుటలేదు. మనుష్యునికి ధన సంపాదన వల్ల లాభముపొందుట కధికారమున్నదని నేననుకొను చున్నాను.

నికో : (నవ్వి) మీలో ఎవరికి జవాబు చెప్పవలెనో తెలియుట లేదు. (పీటర్ తో) ఆఁ అవును నిజమే. ఎవఁడును ఏ వస్తువును తన దగ్గర దాచుకొనఁగూడదు.

అలె: ఏ వస్తువు తన దగ్గర దాచుకొనఁగూడదూ? అయితే ఎవఁడును బట్టలు – ఆఖరుకు అన్నపుముద్దకూడ తన దగ్గరనుంచుకొనఁ గూడదన్నమాట. సరే యున్నదంతయు ఇతరులకిచ్చి వేయు దుము. అప్పుడు మనుష్యుల జీవితము అసంభవమయిపోవునే!

నికో : మరి మిప్పుడు గడుపుచున్న జీవితమువంటి జీవితము మాత్రమే యసంభవమగును.

స్ట్యా: మఱియొక విధముగాఁ జెప్పవలెనన్నఁ జచ్చిపోవుటయే దానికిఁ బ్రయోజనమగును. అయితే ఈ బోధ జీవితమునకుఁ బనికిరా దన్నమాట.

నికో: కాదు. అట్లుకాదు. "మనుష్యుఁడైనవాఁ డెట్లు జీవింపవలెను" అను సంగతిని దెలిసికొనుటకే మన చదువులు. అవును మనుష్యుఁడు ప్రతి వస్తువును ఇచ్చివేయ వలెను. ఏమియు నుప యోగించుకొనకుండఁ, జూడనైనఁ జూడకుండఁ బడియున్న నా యడవి యొక్కటి మాత్రమేగాదు. మనము కట్టుకొన్న బట్టలు చివరకు మన యన్నముకూడ నిచ్చివేయవలెను.

అలె: ఏమిటి? మరి పిల్లలదికూడనా?

నికో: ఆ! పిల్లలదికూడ. మఱి కేవలము తిండిమటుకే కాదు మన జీవితమునుగూడ నర్పింపవలెను ఇదే క్రీస్తు దేవుని బోధ తమ యావచ్ఛక్తిఁ బరులకొఱకుఁ దమ్ము సమర్పించుటకు సంపూర్ణముగా ఆత్మార్పణము చేయుటకు మనము యత్నింపవలెను.

స్ట్యా: అనఁగా మనము చావఁ బ్రయత్నింపవలెనన్నమాట.

నికో: అవును నీవు నీ ప్రాణమును మిత్రుల కర్పించినచో నీకును, నీ మిత్రులకును అదెంత మంచి కార్యమగును. కాని యసలు మనుష్యుఁడు ఆత్మస్వరూపుఁడు మాత్రమే కాఁడు. భౌతిక స్వరూపుఁడు కూడ క్రొవ్వు మాంసములతో నిర్మింపఁబడిన యీ శరీరము తన నిమిత్తమై జీవింపవలెనని నిర్బంధపెట్టుచున్నట్లే యాత్మకూడ ఈశ్వరుని కొఱకు

పరోపకారమయ జీవితము గడపుటకొరకు జీవింపుమని యతని నిర్బంధపెట్టుచున్నది. మన జీవనము శాశ్వతమైనది మాత్రమే కాదు. పశుప్రవృత్తికిని మధ్య ఇటునటు నూగులాడుచున్నది కావున అది ఈశ్వరుని సన్నిధానమునకు ఎందాక వెళ్ళగలిగినంత యెక్కువ మంచిది. కాని మన ప్రవృత్తివల్ల శరీరమును రక్షించుకొనుచుఁ దప్పులు చేసికొనుట మాత్రముగాదు.

స్ట్యా: అట్లే యయిన మధ్య మార్గమున నూగులాడుచుఁ గూర్చుండుట యేల? అదే మంచిదైననాఁడు వస్తువులన్నియు నిచ్చివేసి యేల చనిపోరాదు?

నికో. అటుల చేసినచో నెంత బాగుండును. ఆచరించి చూడు – నీకే తెలియును. పైఁగా నిది ఇతరులకు. నీకును ఎంత శ్రేయస్కరముగా నుండునో!

అలె: ఇది స్పష్టముగాను లేదు. సరిగాను లేదు. మితిమీఱి పోయినది.

నికో: ఇంక నింతకంటె నేమియుఁ జేయలేను. మరి యిది వాదములచేఁ దేలునది కాదు. ఇప్పటికీమాత్రము చాలు.

స్ట్యా: అవును. ఈ విషయము నా తలలోనికిఁ గూడ నెక్కుటలేదు. (వెళ్ళిపోవును.)

నికో: (పురోహితునివైపు తిరిగి) చెప్పుఁడు. ఆ పుస్తకమును గూర్చి మీ కెటువంటి యుద్దేశము కలిగినది?

పు: (ఉత్తేజనముతో) ఏమని చెప్పుదును. వినుఁడు. పుస్తకములోని కథాభాగము చాల బాగుగనే వ్రాయఁబడినది. కాని దానివల్ల నిశ్చయజ్ఞానము గలుగదు. ఇంతకును అది పూర్తిగా నమ్మఁగగిన

విషయముగాదు. పైఁగా దానికి సరిపోయిన సామగ్రికూడ లేదు. క్రీస్తు దేవుఁడా, మనుష్యుఁడా అను సంగతి యట్లుంచుఁడు, అది యెప్పటికిని ఈ యితిహాసమువల్లఁ దేలికగఁ దేలునది గాదు. దాని కభేద్యమైన ప్రమాణమొకటే యున్నది.

[ఈ మాటల మధ్య మొదట స్త్రీలు, తరువాత పీటర్ అక్కడి నుండి వెడలిపోదురు.]

నికో : తమ యభిప్రాయము గుడిని గురించియా ?

పు : అవును. నిస్సంశయముగా గుడిని గురించే, మరి యది నాకొక్కనికే కాదు. సాధువులు, సన్యాసులు మొదలగు విశ్వసింపదగిన వారికిఁ గూడఁ బ్రమాణముగా నున్నది.

నికో : ఇందులో సందేహము లేదు. ఏ మాత్రము భ్రాంతి లేకుండా విశ్వసించు మనుష్యులున్నచోఁ జాల బాగుగనుండియే యుండును. వాంఛనీయము కూడ. కాని మనకు వాంఛనీయమైనంత మాత్రమున అటువంటి మనుష్యులు సిద్ధముగ నున్నారను సంగతి స్థిరపడదు.

పు : అయితే అటువంటివారు ఉండవలెనని కోరుట, అట్టివారున్నందు వల్ల నుపయోగము, ఇవి వాని యాస్తిక్యములోఁ బ్రమాణము లని నేననుకొనుచున్నాను. మనుష్యుఁడు నశించి, భ్రష్టుఁడయి పోవలయునని ప్రభువైన యేసుక్రీస్తు ప్రపంచములోఁ దన ధర్మశాస్త్రమును బ్రకటించియుండఁడు. పైఁగా తన సత్యమును రక్షించుటకు, ఆ మనుష్యుఁడు నశించి, భ్రష్టుఁడై పోకుండఁ జేయుటకు ఎవనినో యొక రక్షకునిఁ దప్పక యవతరింపఁజేసి యుండును.

నికో : మం చిది. తెలిసినది. కాని యిప్పటివఱకు సత్యమును నిలఁబెట్టుకొనుటకు ప్రయత్నించితిమి. మరి యిప్పుడో ఆ సత్యమును రక్షించిన వాని యస్తిత్వము నూహించి స్థిరపరచుటకు యత్నించుచున్నాము. బహుశా మున్ముందు దాని ప్రాముఖ్యము మనము స్థాపింపవలసియుండును.

పు : నిజమడిగినచో ఇందుకు విశ్వాసము మిక్కిలి యావశ్యకమైనది.

నికో : విశ్వాసమా? అవును. నిస్సందేహముగా విశ్వాసమే మిగుల నావశ్యకమైనది. విశ్వాసమే లేనిచో నేపనియు జరగదు. అయితే ఇతరులుచెప్పు మాటలమీదగాక, స్వయముగాఁజూచి బాగుగా నాలోచించి విమర్శించి మనకున్న హేతుజ్ఞానముతో నిశ్చయము చేసికొన్న దానిమీదనే మనము విశ్వాసముంచవలసినది. మనము విశ్వాసముంచవలసినది యీశ్వరునియందు, సత్యమునందు, నశ్వరముకాని శాశ్వత జీవనమందు

పు : హేతుజ్ఞానము మోసగించవచ్చును. ప్రతివాని మెదడు ఒక విధముగానుండును.

నికో : (ఆవేశముతో) ఇదే పాషండమతము. దైవదూషణ. సత్యమును దెలిసికొనుటకు మనకు ఈ పవిత్ర సాధనము నొక్కదానినే యీశ్వరుఁడు ప్రసాదించియున్నాఁడు. మఱి మనందఱును గూడ ఒక సూత్రములోనే బంధించుట కిది యొక్కటే సాధనము. మఱి మనమో దానిని విశ్వసించుట లేదు,

పు : సరేకాని దాని నిర్ణయములలోనే యన్యోన్య విరోధమున్నపుడు దానిమీఁద విశ్వాసముంచుట యెట్లు.

నికో : విరోధమెక్కడ ? "రెండు రెండు గలిసి నాల్గు" అను దానిలోఁ గూడ విరోధ మున్నదా ? ఇతరులు మనయెడల నెట్లు ప్రవర్తింపఁగూడదని కోరుచున్నామో అట్లే మనముగూడ వారియెడలఁ బ్రవర్తింపరాదను దానిలోఁగూడ విరోధమున్నదా? ప్రతి యొక కార్యమునకును ఒక కారణముండి తీరునను విషయములోఁగూడ నెవరికైనను విరోధము గనిపించునా ? మన హేతుజ్ఞానమునకు సరిగాఁదోఁచుట వల్లనే యిటువంటి సత్యములను మనమందఱము అంగీకరించుచున్నాము. కాని దేవుఁడు సినై పర్వతముమీఁద మోజేసుకు కనిపించెనని. బుద్ధ భగవానుఁడు సూర్యకిరణములలోఁగలిసి యాకాశములో లీనమయ్యెనని. మహాత్ములవారు ఆకాశముపై కెగిరి పోయిరని. ఏసు ప్రభువు సమాధినుండి లేచి యాకాశములో లీనమై పోయెనని ఇటువంటి విషయములలో మనకు అభిప్రాయ భేదములున్నవి యంతే.

వు : కాదు మాలో అభిప్రాయభేదములు లేవు. సత్యములోను, ధర్మములోను విశ్వాసమున్న వారందఱును ఏకగ్రీవముగా ఏసుక్రీస్తునందును ఈశ్వరునియందును విశ్వాసమును గనఁబఱచుచున్నారు.

నికో : లేదు. ఈ విషయము మీయందఱిలోఁగూడ నైకమత్యము లేదు. అందఱు మార్గములు వేఱు వేఱుగానే యున్నవి. బౌద్ధ సంన్యాసుల మాటలకంటె నెక్కువగా మీ మాటలలో నెందుకు విశ్వాస ముంచవలయును ? ఇందు కేనా మీ మతములో నేను నమ్మించినది.

[టెన్నిసు ఆడుచున్నవారు జగడమాడు చుందురు.]

(తెరలో) అవును, నాటౌటు.

వా : నేను దానిని జూచినాను.

[ఈ మాటల మధ్య నౌకరులువచ్చి మేజా బల్లపైని కాఫీ, టీ ఉంచుచున్నారు.]

నికో : గుళ్లు మనుష్యులందఱను గలుపుచున్నవని తమరు చెప్పుచున్నారు కాని గుళ్ళ నిమిత్తమై ఎన్నెన్ని యుద్ధాలు జరుగుచున్నవో మీరెఱంగరూ! "ఒక కోడి తనపిల్లలను ఎట్లు ఒక చోటకుఁజేర్చుచున్నదో యట్లే మిమ్ములను నేనెన్ని సారులు ఏకము చేయుటకుఁ బ్రయత్నింపలేదు."

పు : ఇదే యేసుక్రీస్తు బోధించిన మొదటిసంగతి. అతఁడు మాత్రము అందఱను ఒకటిగాఁజేసెను.

నికో : అవును. నేనిది యొప్పుకొనుచున్నాను. ఏసు ప్రభువు అందఱను ఏకము చేసినాఁడు. మఱి మనమో పరస్పరము ద్వేష బీజములను నాటితిమి. మనము వారి యుపదేశములను దలక్రిందులుగ అర్థము చేసికొనుటయే యిందుకుఁగల కారణము. ఏసుక్రీస్తు గుళ్లు గోపురాలు నాశనము చేసెను.

పు : ఏమి, అతఁడు ఒకచోట "వెల్లుఁడు చర్చితో చెప్పుఁడు" అని యిట్లు చెప్పలేదా?

నికో : ఇక్కడ మనము చేయవలసినది శబ్ద విమర్శగాదు. ఇంతే గాకుండ ఈమాటల యుద్దేశము నేఁడు మనము చెప్పుకొను చరిచ

లనువానిని గుఱించి కాదు. ఉపదేశములలోని భావమే మనకుఁ గావలసినది. క్రీస్తు బోధించిన యుపదేశములు విశ్వవ్యాపకము లయి యున్నవి. వానిలో సర్వమతములు ఇమిడి యున్నవి. అతఁడు రహస్యములు, అద్భుతములు అం.గతములు నగు విషయములను గౌరవింపఁడు అతఁడు తన పునరుత్థానమును అంగీకరింపఁడు. ఏసుక్రీస్తు తాను దేవుఁడని నమ్మఁడు. మీలో మీకుఁ బరస్వరము ద్వేష బీజములను మంత్రములు తంత్రములు మొదలగు వానినిగూర్చి యాతఁడు ప్రచారము చేయలేదు.

పు : నిజము చెప్పవలసి వచ్చినచోఁ దమరు క్రీస్తు బోధలకు మీ యిష్టము వచ్చినట్లు అర్థము చేయుచున్నారని నేననుకొను చున్నాను: ఏసు ప్రభుని యుపదేశ మునకుఁ బునాది. నిజ ముగా నతని దేవత్వము మీఁదను, ఏసుప్రభువు పునరుత్థానము మీఁదను ఆధారపడియున్నది.

నికో: అవును. ఈ దేవాలయముల సంగతి అంతయు భయంకర విష యమే. సంపూర్ణమైన, యఖండమైన: యచంచలమైన సత్యము వారి యధికారములోనే యున్నదని యీ మనుష్యు లుద్ఘోషిం చుచు, లోకులలో భేదము గలిగించుచున్నారు చూడుఁడు, 'ఈశ్వరుఁడు ఒక్కఁడే. అతఁడే యీ సమస్త ప్రపంచమునకు ముఖ్యమైన కారణము' అని నేను చెప్పినచోఁ బ్రతిమనుష్యుఁడు నాతో సహకారము చేయును మఱియు నీశ్వరుని పరిభాషలో మనమందఱ మొక్కటే యగుటకుఁగూడఁ గారణమగుచున్నది. కాని ఈశ్వరుఁ డొక్కఁడేయైనను అతఁడు బ్రహ్మయో, అల్లాయో, జిహోవాయో, త్రిమూర్తులో అని చెప్పినచో

లోకములలో భేదభావములు పుట్టును. మనుష్యులు కలయికను. ఐకమత్యమును గోరుచున్నారు కాని కలయికకు ఐకమత్యము నకు నిస్సంశయముగా ముఖ్యసాధనమైన సత్యాన్వేషణమును లోకులు మఱచిపోవుచున్నారు ఇది సూర్యుని బ్రహ్మాండమైన వెలుతురును విడిచిపెట్టి యొక యింటిలోఁ జీకటికొట్టులో దీపము వెలిగించి, ఒకరినొకరు గుర్తుపట్టుటవలె నున్నది,

పురో: కాని సరియైన నిశ్చితమగు మార్గము దొరకనంతవఱకు లోకు లెట్లు సరియైన మార్గమును జేరఁగలరు !

నికో : ఇదే గొప్ప కష్టమైన పని. మనలోఁ బ్రతివాఁడు తన యాత్మను రక్షించుకొనవలసి యున్నది. మఱియు స్వయముగా ఈశ్వరుని కృత్యములను నెఱవేర్పవలసి యుండఁగాఁ బరులను బోధించుచు బోధలు చేయుచుఁ గాలక్షేపము చేయుచున్నాము. మన మీ పందొమ్మిదవ శతాబ్దము చివర జనులకు నేర్పునది యేమి ? 'ఈశ్వరుఁడు ఆఱు దినములలోఁ బ్రపంచమును బుట్టించెను... తిరిగి యొక తుఫాను వచ్చినది. అప్పుడు అన్ని జీవులను ఒక పడవలోఁ గూర్చుండఁబెట్టి రక్షించెను' అనియేగదా! ఇట్టి భయంకరమైన యసంగతములయిన విషయములను ప్రాత నిబంధన గ్రంథమునుండి నేర్పుచున్నారు 'ఏసుక్రీస్తు అందఱకు నీటితో బాప్తిస్తము నిచ్చెను' అని చెప్పుచుఁ బాపాత్ములను నిరాకరించునేమో యను భ్రమతో నిండియున్న సిద్ధాంతముల విషయమును ఆ మోక్షమునకును, పాపమునుండి తప్పించు కొనుటకు నావశ్యకములని యసంభవములు, అసంగతములు నగు విషయములు చెప్పి, విశ్వాసము పుట్టించుచున్నారు. అతఁడు

ఎగిరిపోయి స్వర్గములో దేవుని కుడివైపున గూర్చుండెనని వాస్తవము కాని సంగతులు వారికి బోధింపఁబడుచున్నవి. దానికి మనమందఱము అలవాటుపడపోతిమి కాని నిజము చెప్పవలసి వచ్చినచో నిది యెంత భయంకరమైన సంగతి. మంచి సత్యములైన యుపదేశములను బొందుటకుఁ దగిన, నిర్మలమై నవనవలాడు లేత మెదడు గల బాలుగు "ఈ ప్రపంచ మెటువంటిది? దీని నియమము లేవి?" అని యడిగినచో మనమో సత్యమును. ప్రేమను బహిరంగ పఱచుటకు బదులు యుక్తులతో, నేర్పుతో వివిధములగు అసంగతములు అసంభవములు నగు విషయములను, వాని మెదడులోనికెక్కించి నింపి వేయుచున్నాము, ఏమి యిది భయానక విషయముగాదూ? మనుష్యులు చేయఁగలిగినంత మహాపాపము, మహాపరాధము ఇంతకన్న నింకేమున్నది? మఱి మనము, మన దేవాలయము ను జేయుపని యిదే. ఇంక సెలవు. మీ మనస్సు నొప్పించి నందులకు క్షమింపుఁడు.

పురో: తమరు చెప్పినట్లు హేతుజ్ఞాన దృష్టితోఁ జూచినచో ఏసుబోధలు ఇటువంటివే.

నికో: ఏ దృష్టితోఁ జూచినను సరే యీ సంగతి యింతే!

[కొంతసేపు నిశ్శబ్దము అలెగ్జాండ్రియా ప్రవేశించును పురోహితుఁడు వెళ్ళుటకు లేచి నమస్కరించుచున్నాఁడు.]

అలె: నమస్కారము తమరు నికోలసు మాటలు వినకుఁడు అతఁడు మిమ్ములను దప్పుదారిలోఁ బెట్టఁగలఁడు.

పురో: కాదు ధర్మగ్రంథములను మథించి మేము ఈ విషయమును నిర్ణయింపవలసియున్నది. ఈ విషయము అత్యంతావశ్యకమైన దనుటలో సందేహము లేదు. దీని నిట్లే విడిచిపెట్టుట భావ్యము గాదు (వెళ్లుచున్నాఁడు.)

అలె: నిజముగా నికోలసూ! నీ కతనిమీఁదఁ గొంచెము కూడా ప్రేమ లేదూ, ఆలోచింపఁగా నతఁడు పురోహితుఁడే కాని, యయితే నేమి, యింకను అతఁడుచిన్నవాఁడే గదా. అతనికింకను నిశ్చితమైన, స్థిరమైన యాశయములు లేవు.

నికో: ఏమి అతఁడు తన తప్పులో మొద్దుబాఱిపోయి యుండునట్లు అతనిని వదలిపెట్టుమనెదవా? కాదు నేనట్లు చేయను, ఇంతే గాకుండ నతఁడొక మంచి మర్యాదకల మనుష్యుఁడు.

అలె: కాని నీ మాటఁబట్టి నడచినచో అతని కేగతిపట్టునో తెలియునా?

నికో: నామాటఁ బట్టి నడవవలసిన యవసరమేమియు లేదే. కాని యితఁడు సత్యాన్వేషణము చేసినచో అతనికిని ఇతరులకును గూడా మంచి గలుగును గదా.

అలె: నిజముగా ఈసంగతే మంచిదయిన ప్రతి మనుష్యుఁడును నీమాట గౌరవించియే యుండును కాని యిప్పుడు ఎవ్వరును గౌరవింపరు. ఎక్కడకో వెళ్లుట యెందుకు స్వయముగా నీ భార్యయే నమ్ముటలేదు

నికో: అట్లని మీతో నెవరన్నారు?

అలె: మంచిది. ప్రయత్నించి యామెకు బోధించి చూడు. తన పిల్లలను విడిచి పరాయి వారిని జాగ్రత్తగాఁ జూడవలయునను సంగతిని నేను నీ భార్య చివరకు ఈ ప్రపంచములో నెవ్వరును విశ్వసించలేరు. వెళ్ళి ఈ సంగతి కొంచెము మేరీకి బోధ పఱచు.

నికో: ఆ.ఆ. తప్పక యీసంగతి మేరీ తెలిసికొనఁ గలదు. అలెగ్జాండ్రా క్షమించు. ఒకవేళ ఎవరైన ఆమె మీఁద మత్తుమందు చల్లి భయపెట్టక పోయినఁ దక్క యామె యీ సంగతి తెలిసికొనఁ గలదు. దీని మీఁద విశ్వాసముంచి నేను జెప్పినట్లు నడచును గూడ.

అలె: అఫీము వంటి త్రాగుఁబోతుల కోసము నీ పిల్లలను బిచ్చ గాళ్ళను జేయుటా. ఎన్నటికిని గాదు. నీకు ఇందువల్ల కోపం తెప్పించినదాననయినచో క్షమించు.

నికో: నాకుఁగోపములేదు. పైఁగా మేరీకి జీవిత సంబంధములగు సర్వసంగతులు బోధించుట కవకాశమిచ్చుచు నాకు సవాలు చేసినారు చాలా సంతోషముగా నున్నది. ఇంటికి వచ్చినపుడు ఈ సంగతు లన్నియు దారిపొడుగునను ఆలోచించుకొను చుంటిని. ఇప్పుడే మేరీతో ఈ విషయము మాటాడుదును. ఆమె నా మాటలొప్పుకొనునని మీరే తెలిసికొనఁగలరు, ఆమె స్వభావము మంచిది. బుద్ధిమంతురాలు.

అతె. కాని యీ విషయములో నాకు పూర్తిగా నమ్మకము లేదు,

నికొ: కాని నాకు మాత్రము సందేహము లేదు ఇది నా సొంత కల్పన గాదని నీకును తెలియును. ఇదిమనమందఱము ఎఱిగిన దియును, ఏసుప్రభువు ప్రకటించినదియును.

అతె: మంచిది. ఏసుక్రీస్తు ఈ విషయమే తెలిపెనని నీవు చెప్పు చున్నావు కాని ఆయన తెలిపినది యిదిగాదని నా నమ్మకము.

నికొ: అతఁడు తెలిపినది యిదేకాని మఱియొకటి గాదు.

(టెన్నిసు కోర్టునుండి ధ్వని)

ల్యూ: ఔటు.

వాని: కాదు. నేను చూచితిని.

లిసా: నేను చూచితిని. బంతి సరిగా ఇక్కడనే పడినది.

ల్యూ: ఔటు! ఔటు! ఔటు!

వాని: ఇదియబద్ధము.

ల్యూ: ఇది యబద్ధమా? ఇది బండతనమని జ్ఞాపకముంచుకో.

వాని: నిజము కాని సంగతిని జెప్పుటకూడనా?

నికొ: కొంచెమాగుఁడు. ఎప్పుడో యొకప్పుడు మనమందఱము చనిపోవువారమేగదా. తన "యాజ్ఞ" ప్రకారము నడచుకొన వలయునని యనుకొను భగవంతుని యెదుటకుఁ బోవుదు మను సంగతి యబద్ధముగాదు. గదా.

అలె: మంచిది. సరే.

నికో : అయితే మంచిది. సర్వోత్తమ న్యాయకర్తయైన దేవుఁడు – నా యంతరాత్మ నన్ను చేయుమనిన దానికంటె ఇంకేమి జీవితములోఁ జేయఁగలను? మరి నా యంతరాత్మ, దేవుఁడు ప్రతి మానవుని సమానముగాఁ జూడవలెనని, అందఱను ప్రేమింపవలెనని, అందఱకు సేవచేయవలెనని కోరుచుండెను.

అలె: మఱి నీ పిల్లల విషయములో!

నికో : సహజముగా నా యంతరాత్మ ప్రోత్సహించినదాని నంగీకరించుచు నా పిల్లల విషయములోఁ గూడ నంతే. మన జీవితముల మీఁద మనకేమియు నధికారము లేదు. మనలను ఈ మహా ప్రపంచములోనికిఁ బంపిన ఈశ్వరుని కొక్కనికి మాత్రమే యధికారమున్నదనియు ఆతని కోరిక ప్రకారము నడవవలయునని మనము తెలిసికొనవలెను మఱి యతని యాజ్ఞయేమనగా. .

అలె: నీవు ఈ విషయములో మేకీని ఒప్పించగలవని తలఁచుచున్నావు గాదా ?

నికో : నిస్సందేహముగా.

అలె: ఆమె తన పిల్లలకుఁ జదువుచెప్పించుట మానివేయవలయునని వారిని విడిచివేయవలయు ననియు నీ యుద్దేశమా యేమిటి ? అట్లు ఎన్నటికి జరుగదు.

నికో : "చేయవలసినది యది యొక్కటే" అని యామె మాత్రమే గాదు. నీవుగూడ తెలిసికొందువు.

అలె: కాదు. అల్లైన్నటికిని గాదు.

[మేరీ ప్రవేశించును.]

నికో: మేరీ, ఈ యుదయము నేను నిన్ను లేపకుండఁగనే వెళ్ళితిని.

మే: నేను చాలసేపు నిద్రపోలేదు. ఈ దినమున మీ పనులు సరిగా జరిగినవా?

నికో: ఆ. బాగుగానే జరిగినవి.

మే: ఇదేమిటి. మీ కాఫీ యింత చల్లఁబడి పోయినదేమిటి, ఇట్లే త్రాగుచున్నారేమి? ఆఁ మన మిప్పుడు అతిథులకు స్వాగత మిచ్చుటకు సిద్ధముగా నుండవలెను. రాకుమారి చేరమళనోవ్సు గారు (ఒక ధనికురాలు) కొడుకు కూతుళ్ళతో వచ్చుచున్నా రని మీకు తెలియదూ!

నికో: వారి రాకవలన మీకు సంతోషమయిన, నాకును సంతోషమే.

మే: చేరమళనోవ్సుగారు వారి పిల్లలు అనఁగా నాకెంతో యిష్టము. కాని వారు సమయము కాని సమయము వెదకుకొని వచ్చుచున్నారు.

అలె: (లేచి) మీరు మాటాడుచు నుండుఁడు. ఈలోపుగా నేను వెళ్ళి టెన్నిస్ చూచివచ్చెదను.

[కొంతసేపు నిశ్శబ్దము. పిదప మేరీ, నికోలసు ఇద్దఱు ఒక్క మాటుగా మాటలాడుచున్నారు.]

మే: వారు అసమయములో వచ్చుచున్నారు. మనము కొన్ని సంగతులు మాటాడవలసియున్నది.

నికో: నే నిప్పుడే మీయవ్వతో అదే చెప్పుచున్నాను.

మే: ఏమిటి ?

నికో: నేను కాదు. మొదట నీవే చెప్పుము.

మే: నేను స్ట్యాఫా విషయములో మీతో మాటలాడుదమనుకొనుచున్నాను. ఏదో విధముగా జివరకు నిశ్చయము చేయవలసియున్నది. పాపము వాఁడు విచారించుచు నిరుత్సాహియగుచున్నాఁడు ముందు ముందేమగునో వానికేమియుఁ దెలియుట లేదు వాఁడు నన్ను అడుగుచున్నాఁడు. అయితే నేనేమి నిశ్చయింపఁగలను ?

నికో: నేను జెప్పవలసిన దేమున్నది ? వాఁడే స్వయముగా ఈ విషయమును నిశ్చయించుకొనఁ గలఁడు.

మే: వాఁడు అశ్వదళము లలో స్వయం సేవకుఁడుగాఁ జేరవలయునని కోరుచున్నాఁడు, ఇందుకు వాని కాగితముల మీఁద మీ చేవ్రాలు అవసరమై యున్నది. ఇంతే కాకుండ వాని జీవనము జరుపుటకు ఖర్చుకూడఁ గొంత యవసర మున్నది. అయితే మీరు వానికేమియు నిచ్చుటలేదు. (ఇట్లు చెప్పుచుఁ గొంత యావేశపరురాలగుచున్నది.)

నికో: మేరీ ! భగవంతుని మొగముచూచి కొంచెము ఆవేశము చెందకుము. నేనేమియు ఇచ్చుట లేదు. అడ్డము చెప్పుటయు లేదు.

తన ఇష్టప్రకారము సేనలోఁ జేరుట నా యుద్దేశ్యములో అది యేమాత్రము వివేకము, ఆలోచన లేని మూర్ఖపుఁబని. వాఁడు దాని చెడ్డను దెలిసికొనలేకున్నాఁడు. ఒకవేళ యెవఁడైన దురాశతోఁ జేయఁ దలఁచినచో అది మఱియు నీచమైన సంగతి.

మే: అయితే నేఁడు మీకుఁ బ్రతిసంగతియుఁ జెడ్డదిలాగున వివేకము లేనిదిగను గనుపించుచున్నది. చివరకు వాఁడు ప్రపంచములో నుండవలెనా? అక్కఱలేదా? మీరిట్టే గదా మొన్నటిదాకఁ జీవించితిరి.

నికో: (కొంత యావేశముతో) ఆ. అవును. నాకేమియుఁ దెలియనప్పుడును నా కెవఁడును మంచి సలహా యీయనప్పుడును నే నిట్లే జీవించితిని. ఏది ఎట్లయినను ఇదంతయు నిశ్చయించుకొనుట అతని మీఁదనే యున్నది. నామీఁద నేమియు లేదు.

మే: మీ మీఁద నెందుకు లేదు. మీరేమో వానికి ధనము యీయరాయె.

నికో: నాది కానివస్తువును నే నెట్లీయఁగలను.

మే: మీది కాదూ? మీ యుద్దేశ్య మేమిటో తెలియుట లేదు.

నికో: ఇతరుల కూలి, పరిశ్రమలవల్ల లభించినయాస్తి నాకు సంబంధించినది గాదు దాని మీఁద నాకేమియు నధికారము లేదు. వానికి ధనమిచ్చుటకు ముందు నే నెవరిదగ్గరనయినఁ దీపికొన వలసి వచ్చును ఇట్లు చేయుటకు నాకేవిధమైన హక్కు లేదు. మరి నేనిది చేయను లేను. నా యాత్మ శాసించినట్లు నా శక్తి

కొలంది నా యాస్తిని పర్వాటు చేయుదును రేయింబవళ్ళు శ్రమపడి, కష్టించి పనిచేసిన రైతుల ఫలమును అసంగతమయిన, భ్రష్టతాపూర్ణమైన యనుచితమైన సైనిక కార్యములలో ఖర్చు గుటకు నే నీయలేను. ఏలనీ యా యాస్తిని నా చేతిలో నుండి నీవు తీసుకో. మరియింక దాని భాధ్యత నా మీంద నుండదు.

మే: నేను దానిని దీసికొనవలయునని కోరుట లేదనియుం బైంగా దానిని దీసికొనలేనని కూడ మీరే బాగా ఎఱుంగుదురు. పిల్ల వాళ్ళకుం దిండితిప్పలు పెట్టి పోషించుటయే గాకుండా వారికి నేనే చదువుసంధ్యల సంగతి చూడవలసి వచ్చుచున్నది. ఇది యెంత దారుణము!

నికో: ప్రియురాలా! మేరీ! అసలు సంగతి యిగి కాదు. నీవీ రీతిగా మాటలాడ మొదలుపెట్టినపుడు నేను గూడా సాపు సాపుగా మాటలాడ మొదలుపెట్టితిని: మన మీ విధముగా నుండరాదు. మన మొండొరులము గలిసియున్నాము ఒకచోటనే యున్నాము. మరి యొకరినొకరము అర్థము చేసుకొనుటలేదు. పైంగా నొకరి నొకరము అపార్థము చేసుకొనుచున్నట్లు గూడం గన్పట్టు చున్నది.

మే: నాకుం దెలిసికొనవలెనని యున్నది కాని తెలిసికొనలేక పోతిని. ఈనాండు మీరిట్లు ఎందుకయినారో నాకుం దెలియుట లేదు.

నికో: మంచిది. అవశ్యము ప్రయత్నించి తెలిసికో కాని ఇందుకోసము ఇగి తగిన సమయముకాదు మనకు సరియైన సమయ మెప్పుడు దొరుకునో ఈశ్వరునికే ఎఱుక. నన్నర్థము చేసికొనవలసిన యవ

సరము లేదు. కాని నీవు స్వయముగా నిన్ను అర్థము చేసికొనుము. మన మెందుకు జీవించుచున్నామో ! తెలిసికొనకుండ నిట్లు మనము మన జీవనమును గడుపఁ జాలము

మే: మన మిటులే జీవనము గడుపుచున్నాము. సుఖముగాఁ గూడ నున్నాము. (విసుగుతో) మంచిది. చెప్పుఁడు నేను వినుచున్నాను.

నికో: అవును. ఎందుకు జీవించుచున్నానో యాలోచింపకుండ నేనును ఇటులే జీవించితిని. కాని యొక్కమాటు దారుణమైన యొక గట్టిదెబ్బ తగిలిన సమయము వచ్చినది. కొంచె మాలోచించి చూచినచో మనము ఇతరుల పరిశ్రమ మీఁద జీవించు చున్నామని, ఇతరులచేత నడ్డమయిన చాకిరి మనకోసము చేయించుకొనుచున్నామని, మరి మన పిల్లలుగూడ నిటులే జీవించుట్టి విద్య యొంగు చున్నారని తెలియఁగలను. ఎప్పుడో యొక నాఁటకు ముసలితనము వచ్చును. మృత్యుదేవత కెదురుగా నిలుచుండవలసిన సమయము వచ్చును. అప్పుడు "నేను ప్రపంచములో ఎందుకు జీవించితిని? నావంటి చిన్నచిన్న పాత్రలను బుట్టి చుటకేనా నేను జన్మించినది ?" అని మనస్సులోనికి రాక మానదు. అప్పుడు సమాధాన మేమీయఁ గలము ? ఇంతే కాదు ఇంత జరుగుచున్నప్పటికిని పోనీ మన జీవితములను ఆనందముగానైన గడిపితిమా ? అదియును లేదే. మన యానందుని యంతదానవుగా నున్నపుడు ఎంతటి జీవితశక్తితో నుత్సాహముతో వెల్లివిరిసియుంటివో నీవే యెఱుగుదువు. ఇప్పుడెట్లున్నావో పరిశీలించి చూడు.

మే: అయితే మరి యందఱు ఇట్టి జీవితమునే గడుపుచున్నారే

నికో: మరి వారందఱు దుఃఖవంతులే.

మే: పూర్తిగాఁగాదు

నికో: ఎట్లయినను నేను జాల దుఃఖవంతుఁడను. నిన్ను, నీ బిడ్డలను దుఃఖవంతులను జేసినవాఁడను నేనే యని తెలిసికొంటిని ఈశ్వరుఁడు మనల నిందుకే పుట్టించెనా? యని నేను ప్రశ్నించుకొంటిని. నే నిట్లు ప్రశ్నించుకొన్న మరు నిమిషములోనే "కాదు భగవంతు డిందులకు నన్నుఁ బుట్టింపలేదు" అని యనుభవములోనికిఁ దెచ్చుకొంటిని. "అయితే ఈశ్వరుఁడు మనల నెందుకుఁ బుట్టించెను" అని యప్పుడు ప్రశ్నించుకొంటిని (ఒక నౌకరు ప్రవేశించును.)

మే: (నికోలసు మాట వినకుండ నౌకరుతో) కొంచెము వెచ్చని మీఁగడ తీసికొనిరా.

నికో: 'మనము మనకోసము మాత్రమే జీవింపఁగూడదు' అని బైబిలులో నా ప్రశ్నకు జవాబు దొరికినది. ఈ నౌకరుల సిద్ధాంతము మీఁద ద్రాక్ష తోఁటలోఁ గూరుచుండి పరిశీలించినప్పుడు ఈ విషయము చాల స్పష్టముగాఁ దానంతట నదే బోధపడినది. నీవు తెలిసికొంటివా?

మే: అవును. నౌకరుల సంబంధములోనేనా?

నికో: ఇతర విషయములకంటె నేను జేసిన తప్పులనే యీ దృష్టాంతం ఎక్కువగాఁ జూపించి నట్లయినది. ఆ నౌకరులవలె నేనును ఆ

ద్రాక్షతోఁట నాదే యనియు, ఈ జీవనము కూడా నాదే యనియుఁ దలఁచితిని. అప్పుడు అన్ని వస్తువులు నాకు మహా భయంకరముగాఁ గనిపించినవి కాని "ఈ జీవనము నాదికాదు. పైఁగా ఈశ్వరునిచ్ఛానుసారము ఈ ప్రపంచములోఁ బని చేయుటకుఁ బంపబడితిని" అని ఎప్పుడైతే తెలిసికొంటినో ...

మేరి. కాని యిందువల్ల నేమి లాభము? ఇదంతయు మేమందఱము ఎఱుఁగుదుము.

నికో: ఆ. మన మెట్లున్నామో? ఎట్లుండవలెనో తెలిసికొన్నచో సరి. మన ప్రస్తుత జీవితము దానికిఁ బూర్తిగా విరుద్ధము. మఱి క్షణక్షణమును అతని యాజ్ఞనుల్లంఘించుచున్నాము.

మేరి: అయితే మన మితరుల కెవరికిని హాని గలిగింపనప్పుడు ఇంక నపరాధ మేమున్నది?

నికో: అయితే నిజముగా మన మెవరికిని గష్టము గలిగించుట లేదా? నీ వాదనలో ఫలమేమియు లేదు. మన మితరుల పరిశ్రమ వల్ల లాభము పొందక పోయిన యెడల మఱి యీ భాగ్యమంతయు నెక్కడిది. ఈ పట్టుబట్టలు, ఈ మేడలు, ఈ పిండివంటలు ఎక్కడివి. ఎందుకు మనము....

మేరి: ఆ. దృష్టాంతమిప్పుడు బోధపడినది. కాని యీశ్వరుఁడందఱకు సమానముగానే యిచ్చినాఁడు గదా.

నికో: (కొంతసేపుండి) కాదు. ఇదియిటువంటిదిగాదు. కాని మెరీ! మనుష్యుఁడు ప్రపంచములోనికి గడియగడియకు రాఁడను

విషయము కొంచెము ఆలోచింపునుు. మళ్లి మనము అటువంటి జీవితమును బాడు చేయుట యుచితమేనా? కాదు దానిని మనము ఉత్త మోత్తమముగా నుపయోగింప వలయును.

మేరీ : కాదండీ. నేను మీతో వాదింపలేను పిల్లలను జూచుటకోసము రాత్రి నిద్రకూడ పోవుటలేదు. నేనేయింటిలోని పనులన్నియుం జూచికొనవలసి వచ్చుచున్నది. పైగా మీరు సాయముచేయక పోవుట అట్లుండగా నేను తెలిసికోనైనం దెలిసికోలేని యిటు వంటి క్రొత్తక్రొత్త సంగతులు చెప్పుచున్నారు.

నికో : మెరీ!

మేరీ : ఇదిగో ఆ యతిథులు కూడ వచ్చుచున్నారు.

నికో : కాదు. మొదట మనలో మనము ఒక నిర్ణయములోనికి రావల యును. (ప్రేమతో) ఏమి మనము రాలేమూ?

మేరీ : ఆ. చాలు. మీరు వెనుకటి వలె నిప్పుడు గూడ నుండరాదూ,

నికో ! కాదు. ఇట్లెన్నటకిని గాంజాలను. కాని ఇదిగో నీవిటు విను.

(గంటల చప్పుడు బండ్లు వచ్చు ధ్వని వినంబడును.)

మేరీ : కాదు. ఇప్పుడు గాదు. వారు వచ్చివేసినారు. నేను గలిసి కొనుటకు వెళ్ళవలెను.

(ఇంటి వెనుకటి సందుగుండ వెళ్ళుచున్నది. స్ట్యూపా. ల్యూబా యును ఆమె వెనుక వెనుక వెళ్లుచున్నారు.)

వాని : మేము దీనిని ఈలాగే వదలి పెట్టము. తర్వాత మరల ఆడి గెలుతుము. ఏమి ల్యూబాశా ఇప్పుడు నీకెట్లు ఉన్నది?

ల్యూ: (గట్టిగా) దయదలంచి యీపాటికి నోరు మూయుము.

(అలెగ్జాండ్రాంతన కర్తతోను లిసాత్తోను వరండా వెలుపలికి వచ్చెను. నికోలసు విచారమగ్నుడై యిటునటు పచారు చేయుచుండును.)

అలె: ఏమి. నీబోధలచేత ఆమెను ఒప్పించితివా?

నికో : వదెనా! మాయిద్దరి మధ్య జరిగిన విషయము మిక్కిలి ముఖ్యమైనది. జీవితము, సత్యము, దేవుడు గాక యింకెవరు ఆమెను ఒప్పింపగలరు? ఆమెను వారే యొప్పింతురు. అయితే నేడు, కానిచో రేపు, మఱి రేపును కానిచో ఎల్లుండి. అయితే ఇట్టి సమయములో ఆమెకు వ్యవధి లేకపోవుట చాల విచారకరమైన విషయము ఇప్పుడు వచ్చిన వారెవరు?

పీ : ఆ వచ్చినవారు చేరమళనోవ్న జమీందారిణిగారు, వారిపిల్లలు. ఆమెను నేను గలిసికొని పదునెనిమిదేండ్లయినది. చివరిసారి కలిసికొన్నప్పుడు మేము"

"జాపళీలు కూడ బాడుకొన్నాము.

అలె : (పీటరుతో) దయయుంచి మామాటల మధ్య మీరు అడ్డు రాకండి. నేను నికోలసుతో దెబ్బలాడుదాన నని యనుకొనకుడు, నేను నిజముసంగతి చెప్పుచున్నాను. (నికోలసుతో) నేను నీతోం బరిహాసము లాడుట లేదు. ఎప్పుడైతే మనస్సు విప్పి మేరీ మాటలాడ మొదలు పెట్టినదో అప్పుడు మీరీ సంగతు

అను బోధించి యామెను ఒప్పించుటకుఁ బ్రయత్నించుట చూడఁగా చాల యాశ్చర్యముగా నున్నది.

నికో : మంచిది. ఇదిగో ఆ మనుష్యులు వచ్చుచున్నారు. నేను నా గదిలో నుండెదనని దయయుంచి మెరీతోఁ జెప్పుము.

(నిష్క్రమింతురు.)

(ఇది ప్రథమాంకము)



## ద్వితీయాంకము

### (మొదటి దృశ్యము)

(ఒక పెద్ద భోజనశాల. అందులో నొక మేజాబల్ల. దానిమీఁద కాఫీ, టీ, పాత్రలు. ఆబల్ల దగ్గర మేరీ జమిందారిణి చేరమళనోవ్న, పీటరు కూర్చుండి యుందురు. గోడ దగ్గర నొక పియోనా కూడ నుంచఁబడియున్నది.)

పీ : చేరమళనోవ్న గారూ! ఇన్నాళ్ళకు మనము మరలఁ గలిసికొన్నాము. అప్పుడు మీరు బాగా పాటలు పాడినారుగదా? ఇప్పుడేమైనను బాడుట కుత్సాహమున్నదా?

చేర : నాకేమియు నుత్సాహముగా లేదు. కాని మీ పిల్లలు పాడఁగలరు. కాలము మాఱిపోయినది.

పీ : ఉహూ. అలాగునా. మీ యమ్మాయి బాగుగాఁ బాడఁగలదా. అవును మఱి పిల్ల లెక్కడకు వెళ్ళినారు. ఇప్పటి వఱకు నిద్ర పోవుట లేదుగదా.

మేరీ: వారు నిన్న రాత్రి వెన్నెలలో షికారు వెళ్ళి రాత్రి చాలా సేపటికిఁ దిరిగివచ్చినారు. నేను అప్పుడు పిల్లవానికి పాలిచ్చు చున్నాను, అందువలన వారి చప్పుడు వినిపించినది.

పీ : కాని మాయావిడ ఎప్పుడు వచ్చను. ఆమెకోసము బండి ఏదైనను బంపితివా?

మేరీ : ఆ. బండి తెల్లవారకముందే వెళ్ళినది. బహుశా ఈపాటికి ఆమె వచ్చుచుండునని-యనుకొందుము.

చేర : ఏమి నిజముగా అలెగ్జాండ్రాగారు ఫాదరు జిరైసియముగారిని బిలుచుటకు వెళ్ళిరా?

మేరీ : అవునండి. ఈ సంగతి నిన్న యామెకుఁ దోఁచినది. వెంటనే యామె బయలు దేఱి వెళ్ళినది.

చేర : ఆహా. ఎంత చురుకు. ఇందుకు వారిని జాల యభినందించు చున్నాను.

పీ ఇటువంటి విషయములలో మేము వెనుక పడము. (సిగరెట్టు ( యును) మంచిది. ఇప్పుడు నాకు సెలవీయుఁడు. నేను వెళ్ళి సిగరెట్టు కాల్చుకొనుచు మా కుక్కలతో పార్కులోనికి షికారు వెళ్ళెదను.

(వెళ్ళిపోవును)

చేర : సంగతేమిటో తెలియుట లేదు, ఎంతవఱకు నిజమో కాని మీరు వ్యర్థముగా ఈ విషయములో నింత శ్రద్ధ చూపుచున్నారని నాకుఁ దోఁచుచున్నది. నేను వారి సంగతి ఎఱుఁగుదును. వారి మనఃస్థితి యిప్పుడు బాగుగా మితిమీఱిపోయి యుండును జాగ్రత్తగాఁ దెలిసికొన వలెను. అతఁడు బీదలకేదో యింత యిచ్చినందువల్ల ఏమగును? ఏమి మనకెప్పుడును అవసరమైన దానికంటె ఎక్కువగానే కష్టములుండనే యుండునుగదా.

మేరీ : ఇంతమాత్రమే కాదు. ఆయన ఏమిచేయఁదలఁచు కున్నారో యిప్పుడే మీకుఁ దెలియదు. కేవలము బీదవారికి సాయము చేయుటకే కాదు ఈ సమస్య. ఇదిఒకవిధమైన విప్లవము. అన్ని వస్తువులను సర్వనాశనము చేయుటయే.

చేర : మీ కుటుంబ జీవితములో వ్యర్థముగాఁ జేయి చేసుకొనుట నా కిష్టము లేదు. కాని మీరంగీకరించిన....

మేరీ : ఎంతమాట. నేను మిమ్ములను నావారనియే యనుకొనుచు న్నాను. మీరు పరాయి వారా ఏమి? అందులో ముఖ్యముగా ఇటువంటి సమయములోనా.

చేర : నేను మీకు చెప్పనది ఏమనఁగా మీరు మనస్సువిప్పి స్పష్టంగా ఈ విషయములో మాటలాడవలెను. మఱి మీరు ఒక నిశ్చయములోనికి వచ్చి ఒక హద్దు ఏర్పాటు చేసికొనవలెను.

మేరీ : (ఆవేశముతో) హద్దు ఎక్కడిది. వారేమో యున్నదందయు నిచ్చివేయమని యనుచున్నారు. మఱి నేనీ వయస్సులో వంట పని, వాకిలి పని చేయవలయుననికూడ వారి యుద్దేశము.

చేర : అట్టే యిది జరగునది కాదు. ఇది బొత్తిగా విలక్షణమైన సంగతి.

మే : (జేబు నుండి ఒక జాబు తీయుచు) మనమిప్పు డొంటరిగానే యున్నాము కనుక మీతో అన్ని సంగతులు చెప్పివేయుచున్నాను వారు నిన్న నాకీ యుత్తర మిచ్చినారు నేను జదివి వినిపింతును- వినుడు.

చేర : ఏమిటీ! ఆయన మీతోఁ గూడ ఒక యింటిలోనే యుండియు ఉత్తరము పంపించుటయా? ఎంత యాశ్చర్యము!

మే : కాదు దీనికిఁ గారణము నాకుఁ దెలియును ఆయన మాటాడుచు, మాటాడుచు మిక్కిలి ఆవేశము పొందుచుందురు. వారి యారోగ్య మెట్లుండునో యని నాకు భయము వేయుచుండును.

చేర : ఆయన వ్రాసినదేమిటి ?

మే : చదువుచున్నాను వినుడు (చదువుచున్నది) "నేను మొదట జీవించినట్లు మరల నిప్పుడు కూడ జీవింపవలెననియు ఏదైనఁ గ్రొత్త సంగతి తెలుపుట లేదనియు మాటిమాటికి విసుగుకొనుచున్నావు. మన జీవితములను ఎట్లు గడపవలెనో తెలుపుట లేదని యనుచున్నావు. మన మీ విషయముమీఁద వాదించుచున్న

పుడు ఇద్దఱముకూడ నుత్తేజితులమై పోవుచున్నాము కనుక నీయుత్తరము వ్రాయవలసి వచ్చినది, మన మీరోజు వఱకు గడిపినట్లును, ఇప్పుడు గడుపుచున్నట్లును ముందుగూడ నేను గడపలేనందుకుఁ గల కారణము అనేక పర్యాయములు చెప్పి యున్నాను ఇప్పుడు గడుపుచున్నట్లు ఎందుకుఁ గడపఁ జాలనో ఏసుక్రీస్తు చేసిన యుపదేశముల ప్రకారము ఎందువల్ల జీవితము గడపవలెనో యీ యుత్తరములో వ్రాసి నీకు బోధపఱుపఁ జాలను సత్యముమీఁద విశ్వాసముంచి స్వేచ్ఛగా నాతోఁ గూడ రమ్ము. లేనిచో నా మీఁద సంపూర్ణమైన విశ్వాసముంచి నన్ననుసరింపుము ఈ రెంటిలో నీవేది చేసినను సరే! (చదువుట మాని) నేనిదియుఁ జేయలేను, అదియుఁ జేయలేను. ఆయన యుండవలెనని యనుకొన్న విధముగా నుండుట యవసరమని నేననుకొనను. నేను పిల్లలసంగతి చూడవలసి యున్నది. వారిపై నేను నమ్మకముంచలేను. (తిరిగి చదువుచున్నది.) 'నా యుద్దేశ మిది. మన పండ్లతోఁట, కూరగాయలు పండించుకొను పొలము, నది దగ్గఱ బీడుకాక యింక మూడువేల యకరములలోను, నూట ముప్పదియైదు యకరముల భూమి మన దగ్గర నుంచుకొందము. మనము స్వయముగా శ్రమపడి జీవింపఁ బ్రయత్నింతము. అయితే పిల్లలనుగాని, ఇతరులను పనిచేయమని నిర్బంధింపకుందుముగాక. మన దగ్గర మిగిలిన భూమివల్ల పబఁది పౌనులు సంవత్సరాదాయము రాఁగలదు....

చేర : ఏబఁది పౌనులతోనా ఏడాది జీవితము గడుపుట. అందులో ఏడుగురు పిల్లలతోనా? ఇది జరుగుమాటేనా!

మే: చూపించి, "మనము మన యిల్లంతను ఒక పాఠశాలక్రింద మార్చివేయుదము. మనము రెండు గదులున్న మన తోటలోని చిన్న యింటిలో నుందము." ఇది యాయన యుద్దేశము.

చేర: ఆ. పనిలో ఏవో కొంత విలక్షణత్వమున్నదని నా కిప్పుడు తెలిసినది. సరే. మీరు దీనికేమి జవాబిచ్చినారు!

మే: నేనట్లు చేయలే నని యాయనకుఁ జెప్పితిని. నేనొంటరిదాన నైతే నిశ్చయముగా వారి వెనుకనే వెళ్ళియుందును. కాని దగ్గర పిల్లలున్నారు. వీఁడు ఇంకను పాలు విడువనైన విడువ లేదు. మఱి వీని నన్నిటిని విడిచిపెట్ట లేనని నేను వారితోఁ జెప్పివేసితిని. మరి యేమి, ఈ మాటమీఁద వివాహ సమయములో ఒప్పుకొంటినా? రెండవది నేను పడుచుదానను గాను. పైఁగా నా శరీరములో ఇప్పుడు శక్తి గూడ లేదు. ఆలోచింపుఁడు. ఎట్లు ఈ పిల్లలందఱను పోషించుట?

చేర: విషయము ఇంతవఱకు మీఱిపోవునని కలలోఁగూడ నాలోచింప లేదు.

మే: ఇంకఁ జాలు. సంగతి యిది. ఏమి కాఁదలచి యున్నదో తెలియదు. నిన్న వారు ఒక యూరిలోని రైతులకు శిస్తు క్షమించి వేసినారు. మఱి నాయన భూమికూడ వారి కిచ్చివేయవలయు నని యనుకొనుచున్నారు.

చేర: ఇట్లు జరుగనీయరాదని అనుకొనుచున్నాను మీ పిల్లలనురక్షించు కొనుట మీవిధి. కాని యాయన యాదాయమును సరిగా వినియోగింపలేక పోయినచో దానిని మీకప్పఁజెప్పి వేయవలెను.

మే: కాని యిది మాత్రము నాకిష్టము లేదు.

చేర : మీ పిల్లల కోసము మీరు తీసుకొనక తప్పదు. ఆ యాస్తి యంతయు మీ పేర వ్రాయుట మంచిది.

మే: నాయప్ప అలెగ్జాండ్రా యాయనతో ఇట్లే చెప్పినది. కాని యిట్లు చేయుటకాయన కేమియు నధికారము లేదని యాయన యన్నారు. "దున్నిన వారిదే భూమి గింజలు చల్లిన వారిదే భూమి" అనియు దానిని రైతుల కిచ్చివేయుట మన కర్తవ్య మనియుఁ జెప్పినారు.

చేర : అవును. ఈ విషయము నేననుకొన్న దానికంటె మితిమీఱి పోయినదని యనుకొనుచున్నాను.

మే: మఱి పురోహితుఁడో. అతఁడు కూడ ఆయన పక్షముగానె మాటాడుచున్నాఁడు.

చేర : అవును. నిన్న నేను అదే కనిపెట్టితిని.

మే: ఇందుకోసమె మా యక్క అలెగ్జాండ్రా మాస్కో వెళ్ళినది. ఆమె యీ విషయములో ప్లిడరు సలహా తీసికొన వలెననియు యనుకొనుచున్నది. కాని ముఖ్యముగా మాత్రము అమె జిర్రైసియము ఫాదిరిగారిని దీసికొని వచ్చుటకు వెళ్ళినది. అతఁడైనను తన తెలివిచూపి ఆయనను దారిలోనికిఁ దీసికొని వచ్చునేమో యని.

చేర : ఆ. ఏసుప్రభువు సిద్ధాంతములు మన సాంఘిక జీవనమును నశింపఁజేయుట కనుమతించునని నేననుకొనను.

మే: కాని యాయన జీరై సియము బాబుగారి మాటకూడ నమ్మరు. ఆయన నాతో వాదించు చున్నపుడు మీరున్నచో నేనేమియు జవాబు చెప్పలేనను సంగతి మీకుఁ దెలిసియే యుండును. ఇది మరియు దారుణముగా నున్నది. ఆయన చెప్పునది యంతయుఁ బూర్తిగా సత్యమని నమ్మునట్లు నాకుఁ దోఁచు చున్నది. . . . .

చేర: నాకుఁ దెలియుట లేదు. మఱి యిది మహోపద్రవకరమో. లేనిచో యిదే క్రైస్తవ ధర్మమో.

(దాది ప్రవేశించును)

దా: చిన్నబాబుగారు లేచినారండీ! ఆయన మీ కోసము ఏడ్చుచున్నారు.

మే: ఇప్పుడే వచ్చుచున్నాను (చేరమళనోవ్నతో) నేను ఉత్తేజితురాలనై ఎక్కువ వాదించినచో వారి హృదయమున కావేదన గలుగుచున్నది,

(రెండవ ద్వారమునుండి చేతిలోఁ కాగితములు పట్టుకొని నికోలసు ప్రవేశించును)

నికో: కాదు. ఇది యసంభవము.

మే: ఏమి! ఏమయినది?

నికో: ఏమయినదా! ఏవో కొన్ని పనికిమాలిన దేవదారుచెట్ల కోసం ఆయినమకు ఖయిదుశిక్ష పడుచున్నది.

మే: అది ఎట్లు?

నికో : ఇది చాల చిన్నసంగతి వాఁడు కొన్ని చెట్లు కొట్టెను ఈ నేరము న్యాయాధికారి దగ్గర మోపఁబడినది. న్యాయాధికారి వానికి మూఁడు నెలలు శిక్ష విధించెను అందుకోసము వాని భార్య వచ్చినది.

మే: అయితే, ఇంకేమియుఁ జేయుటకు వీలులేదా!

నికో : లేదు. ఇపుడు మనము ఆ యడవి యుంచుకొనక పోవుట యొకటే మార్గము, నేనేమియు నుంచుకొనను. ఇప్పుడు చేయుట కింకేమున్నది. పాపము దీనునికి ముక్తి ఏ విధముగా నైన దొరుకునేమో వెళ్ళి చూచెదను

(నికోలసు వరండాలోనికి వెళ్ళి బోరిసును. ల్యూబాను గలిసికొనును )

ల్యూ: నాన్నగారూ! నమస్కారమండీ. (నమస్కరించు చున్నది ) ఎక్కడకు వెళ్ళుచున్నారు?

నికో : నేనిప్పుడే యూరిలోనికి వెళ్ళివచ్చితిని. మరల నూరిలోనికి వెళ్లుచున్నాను వారు ఆ యూరిలితో మాడిపోవుచున్న మను ష్యుని ఖైదులోఁ బడ వేయుటకు లాగుకొని పోవుచున్నారు. ఎందుకనఁగా వాఁడు...

ల్యూ: ఊహూ! అయివసునా!

నికో : ఆ, అవును. అయివసునే. (వెళ్ళుచున్నాఁడు. వాని వెనుక మేరీ కూడ వెళ్ళుచున్నది.

ల్యూ: (కాఫీపాత్ర దగ్గరఁ గూరుచుండును) నీకు కాఫీ కావలెనా ? టీ కావలెనా ?

బో : ఏమియు వద్దు.

ల్యూ: ఎప్పుడును ఇది యిట్లే ఉండుచునే యుండును. చివరకు దీనికే మైన అంతము ఉండునా ?

బో : మీ తండ్రిగారి సంగతి నాకేమియు అర్థమగుటలేదు. రైతులు పాపము బీదవారు, అమాయకులు. మరి వారికిఁ దప్పక సాయము చేయవలసినదే. కాని యీ విధముగా దొంగతనము ను ప్రోత్సహించుట యేమి ?

ల్యూ: అయితేమరి యెట్లు ?

బో : మన పనులన్నిటివల్ల వారి సేవకొఱకు మన సమస్త జ్ఞానము ఆచరణలోనికిఁ దీసికొనివచ్చి సాయము చేయవలెనే గాని ఒకని సొంత జీవితము నర్పించిన మాత్రముగాదు.

ల్యూ: ఈ విషయమెంతో యవసర మైనదని తండ్రిగారు చెప్పుచు న్నారు.

బో : నాకర్థమగుట లేదు. ఒక మనుష్యుఁడు తన జీవితము నష్టము చేసుకొనకుండఁగనే లోకులకు సేవచేయఁ గలుగును. ఈ విధ ముగా నేను నా జీవితము నర్పింపవలెనని యనుకొనుచున్నాను. అయితే కేవలము మీరు. .

ల్యూ: నీకేది యిష్టమో నాకు అదే యిష్టము. మరి నాకు దేనిని గురించి కూడ భయము లేదు.

బో : మఱి యీ చెపుల కమలాలు, లోలకులను గురించియూ, ఆ దుస్తులను గురించి ఎట్లు?

ల్యూ: అవి యమ్మివేయవచ్చును. మరి యీ దుస్తులలో మార్పు చేయవచ్చును. షోకుగా నుండుటకూడ నంతమంచిది కాదు.

బో : నేను మీ తండ్రిగారితో ఒకమాఱు మరల మాటాడవలెనని యనుకొనుచున్నాను. నేను వారితోఁ గూడ నూరిలోనికి వెళ్ళి నచో వారి పని పాడగునని నీ ఉద్దేశమా!

ల్యూ: అట్లే కాదు, ఫరవాలేదు వారు నిన్ను మెచ్చుకొనుచున్నారని యనుకొనుచున్నాను నిన్న రాత్రి వారు స్వయముగా విన్నుఁ బిలిచినారు.

బో : (కాఫీ త్రాగి) మంచిది అయితే మరి వెళ్ళెదను.

ల్యూ: మంచిది. వెళ్ళు. మఱి నేను వెళ్ళి లిసాను, టానియాను లేపుదును.

[ తెర పడును ]

## ( రెండవ దృశ్యము )

[ గ్రామములోని వీధి. అయినను బొచ్చుకోటు తొడుగుకొని ఒక గుడిసె దగ్గర పరుండియుండును.

ఆ : మలాశకా!

(ఒక చిన్నపిల్ల ఒక శిశువును ఒడిలో నుంచుకొని తీసుకొని వచ్చును. శిశువు ఏడ్చుచుండును.

ఆ : కొంచెము మంచినీరు తీసికొనిరా.

(మలాశక గుడిసెలోనికి వెళ్ళుచున్నది పిల్లవాని ఏడ్పు వినిపించును. మలాశక ఒక పాత్రలో నీరు తెచ్చును.

ఆ : నీవు పిల్లవానిని ఎందుకుఁ గొట్టుచున్నావు. వానిని ఎప్పుడును ఏడిపించుచునే యుందువు. ఉండు. మీ యమ్మతోఁ జెప్పెదను.

మ : మంచిది సరే. ఆమెతోఁ జెప్పుకో. వాఁడు ఆఁకలితో ఏడ్చుచున్నాఁడు.

ఆ : (నీరు త్రాగును) నీవు వెళ్లి డేమికినను అడిగి కొంచెముపాలు తీసికొనిరా.

మ : నేను వెళ్ళినాను. కాని యక్కడ ఎవరును లేరు ఇంటిలో ఎవరును లేరు.

ఆ : ఉహూ. నేను చచ్చిపోయినచో ఎంత బాగుండును. ఏమి వంట యయినదా ?

మ : ఆ. అయినది. ఇదిగో చూడు. జమీందారుగారు వచ్చుచున్నారు. [నికోలసు ప్రవేశించును.]

నికో : ఏమి, ఇవతలకెందుకు వచ్చితివి ?

ఆ : లోపల చాల యీఁగలు ముసిరి రొదచేయుచున్నవి. చాల వేడిగా నున్నదికూడ.

నికో : అయితే నీ యింటిలో వేడిగా నున్నదన్నమాట.

ఆ : అవును. నా శరీరము వేడివల్లఁ గుమిలిపోవుచున్నది.

నికో : మఱి ఆయివను ఎక్కడ ? ఇంటిలో నున్నాఁడా ?

ఆ : ఇంటిలోనా? అందులో నిప్పుడా? వాఁడు పొలములో ధాన్యము మోయుటకు వెళ్లినాఁడు.

నికో: ఆ మనుష్యులు వానిని జైలలోఁ బెట్టఁ బోవుచున్నారని విన్నానే.

ఆ : అవును. ఆలాగే. పోలీసులు వానికోసము పొలములోనికి వెళ్లినారు.

[గర్భవతియగు నొక స్త్రీ ప్రవేశించును. తలమీఁద ధాన్యపు మోపు, చేతిలోఁ గొడవలి. మలాశకను జూడఁగనే తలమీఁద నొక దెబ్బ కొట్టుచున్నది.]

స్త్రీ : ఏమే పిల్లవానిని ఒంటిగా నెందుకు వదలిపెట్టి వచ్చితివి ? వాఁడు అఱచుచున్నాఁడు వినఁబడుటలేదా ? బాగున్నదిలే ఇటునటు తిరుగుట బాగుగాఁ దెలియును గాఁబోలు.

మ : (ఏడ్చుచు) నే నిప్పుడే బయటనుండి వచ్చితిని. నా ... ను మంచి నీరు కావలెనట.

స్త్రీ : చూచి నీ పని చెప్పెద నుండు ఇప్పుడే (నికోలసును జూచి) బాజయ్యగారికి నమస్కారము లండి. పిల్లలు చాల కష్టములో నున్నారండి. బరువంతయు నా నెత్తిపైఁ బడినదండి. మా యింటిలో ఒక్కఁడే ఏదో కాస్త యవశలనుండి రెండు పైసలు తెచ్చువాఁడున్నాఁడు. వానినిగూడ ఆ మనుష్యులు ఖైదు లోనికిఁ దీసికొని పోవుచున్నారు. ఈ సోమరి యిట్లు పని పాటలు లేక పడియున్నాఁడు.

నికో : ఏమనుచున్నావు. చూఁడు పాపము వీఁ డెంత రోగముతో నున్నాఁడో.

స్త్రీ : సరే. వీఁడు రోగముతో నున్నాఁడు, మఱి నే నెట్లున్నాను, నా కేమియు రోగము లేదా ? పని చేయవలసి వచ్చినప్పుడు ఎక్కడలేని రోగములు వచ్చును. నవ్వుటకు, ఆక్షేపించుటకు, నన్నుఁ జంపుటకు రోగ మేమియు నుండదు. కుక్కలాగునఁ జావనీయండి. నాకేమి.

నికో : ఇటువంటి పలుకరాని మాటలు నీ నోటినుండి ఎట్లు వెలువడు చున్నవి ?

స్త్రీ : ఇది పాపమని తెలియుచున్నది కాని నా మనస్సు నా వశములో నుండుటలేదు. నా యింకొక పిల్లవాడు రేపు పుట్టఁబోవుచున్నాడు. మఱి యిప్పుడే యిద్దఱను సవరింపవలసి వచ్చుచున్నది. మఱి తోక లందఱపంట తెగి వారి యిళ్లలోఁ బడినది. అయితే నేమి మా చేలో ఇఁకను నాల్గవవంతు కోఁతైనను గాలేదు. మఱి నేను ధాన్యపు మోపులు కట్టవలసి యున్నది కాని కట్టలేక పోయితిని పిల్లలను జూచుటకని పని వదలిపెట్టి నేను వచ్చినాను.

నికో : చేను కోయవచ్చునులే. నేను గూలివారిని బెట్టుదును. వారు కోసి మోపులుగూడఁ గట్టిపెట్టుదురులే.

స్త్రీ : మోపులు కట్టుటలో మఱేమియుఁ గష్టములేదు. మంచిది యేదోవిధముగా త్వరగా కోత యైపోయినచో నేనే చేసికొనఁగలను. ఏమండి నికోలసుబాబుగారు మీరు వీనిని గుఱించి ఏమనుకొనుచున్నారు. ఏమి వీఁడు చచ్చిపోవునా యేమి? వీనికి జబ్బుగా నున్నది.

నికో : తెలియదు. కాని రోగముమాత్రము నిజముగా పెద్దది వానిని ఆసుపత్రికిఁ బంపవలెను.

స్త్రీ : ఓయి భగవంతుఁడా! (ఏడ్చుచున్నది) దేవుని మొగముచూచి వీనిని ఎక్కడికిఁ దీసికొని వెళ్లకండి బాబు, ఇక్కడనే చావనీయండి (అఱచుచున్న తన భర్తతో ఏదో చెప్పుచున్నది) ఏమిటి యనుచున్నావు.

ఆ : నేను ఆసుపత్రికి వెళ్లవలెనని యనుకొనుచున్నాను. ఇక్కడ నున్నచోఁ గుక్క కంటెఁ గూడ నీచముగాఁ జూడఁ బడు చున్నాను.

స్త్రీ : ఏమో నాకుఁ దెలియదు. నా మనస్సిపుడు స్థిమితముగా లేదు. సత్తెమ్మా ! అన్నము సిద్ధమైనదా ?

నికో : మీ అన్నములో ఏ యే వస్తువు లుండును ?

స్త్రీ : ఏ వస్తువులా ! వస్తువులుకూడానా ? గంజి అన్నము అందు లోనికి ఊరగాయైన నుండదు. (గాడిపెలోపలకుఁ బోవుచున్నది. ఒక పందిపిల్ల అఱచుచున్నది. లోపల పిల్ల లేడ్చుచున్నారు.)

ఆ : ఓ యీశ్వరుఁడా ! చాలు. ఈపాటికైనను నన్నుఁ జంపివేయ రాదూ ? (బాధతో మూల్గును).

[బోరిసు ప్రవేశించును]

బో : ఏమి నేను జేయఁదగిన సాయమేమైన నున్నదా ?

నికో : ఇక్కడ నెవఁడును ఎవనికిని సాయము చేయలేఁడు. చెడ్డ చాల లోతుగాఁ బాతుకొనిపోయినది. ఏ వస్తువులవల్ల మన జీవితము నకు సుఖము గలుగునో వాని సంగతిని జూచికొని మన మట్టి వైన సాయము చేసికొనఁగలము. ఇదిగో చూడు ఇదియొక కుటుంబము. అయిదుగురు పిల్ల లున్నారు. స్త్రీ గర్భవతి. ఆమె మగఁడు రోగి, గంజినీళ్లు తక్క నింటిలో నేమియు లేదు. ఈ సమయములో ముందుసంవత్సరమునకు సరిపోవు ధాన్యము దొరకునో దొరకవోయను సంగతి యాలోచింపఁ బడుచున్నది.

సహాయము సంభవమగుటలేదు. సరే నేను కూలిపనిచేసి జీవిం తును. అయితే మఱి యింకెవఁడు కూలిపనిచేయుట కిష్టపడును ? త్రాగుడు త్రాగి యున్నదంత దగులబెట్టుట వల్లనో, డబ్బేమి లేకపోవుటవల్లనో యున్న వ్యవసాయము కాస్త వదలిపెట్టినవాఁ డెవడైనను గూలిపనిచేసినఁ జేయును అంతే.

బో : క్షమింపుఁడు. అయితే మఱి యిక్కడ మీ రెందుకున్నారు ?

నికో : నేను మా స్థితిని అర్థముచేసికొనుటకుఁ బ్రయత్నించుచున్నాను. మా తోఁటలో పనిచేయుచు, మన యిండ్లు కట్టుచు, మనము మెక్కునట్లు చేయుచునుండు జనులసంగతి చూచుచున్నాను. (రైతులు కొడవళ్ళు పట్టుకొని, స్త్రీలు త్రాళ్ళు పట్టుకొని వెళ్లుచు నమస్కరించుచున్నారు. నికోలసు ఒక రైతును ఆపి) ఏమి ఏరనులు ! నీవు వీరి ధాన్యము కోసి తెచ్చిపెట్టలేవా ?

ఏర : (తలయూపి) నేను చాల సంతోషముతో ఈపని చేయుదును కాని ఈ సమయములో నేనీపని చేయలేనండి. నే నింతవఱకు స్వయముగా నాచే కోసికొని తెచ్చుకొనలేదు. నే మిప్పుడు పొలము కోసికొనుటకు వెళ్ళుచున్నాము. ఆయివను ఎట్లు న్నాఁడు ?

2వ రై : ఇదిగో చూడండ వీఁడు శిబా, బహుశా వీఁడు ఒప్పుకొనును. ఒరే శిబా ! ధాన్యము కోసి తెచ్చి పెట్టుటకు ఒక మనుష్యుఁడు వీరికిఁ గావలెనటరా.

శిబా : మీరే యీ పనికి వెళ్ళండి బాబు. ఈ సమయములో అయితే ఈ యొక్కరోజు శ్రమపడిన పదాది తిండికి సరిపోవును.

(రైతులు పోవుచున్నారు)

నికో: వీరందఱు నిరుపేదలు. ఆఁకలితో మాడుచున్నారు. వీరికి ఒక ప్రక్క నిండుటకు మాత్రమే తిండి దొరకుచున్నది. వీరిలోఁ గొందఱు రోగులు, కొందఱు ముసలివారు. ఈ ముసలివాఁడు రోగముతో సగము చచ్చిపోయి యున్నాఁడు. ఇట్లున్నను వాఁడు తెల్లవారుఝామున నాలుగు మొదలుకొని రాత్రి పది గంటలవఱకుఁ బనిచేయుచున్నాడు. మఱి మనమో ఇదంతయుఁ జూచుచు శాంతముగాఁ గడుపులోనీళ్ళు కదలకుండ రోజులు గడపుచుఁ బైఁగా మేము క్రైస్తవులమని, ధార్మికులమని యనుకొనుచున్నాము. ఇది న్యాయమేనా? మనము ధార్మిక మనుష్యులమా? ఎంతసిగ్గు. చివరకుఁ బశువులము గూడఁ గాము.

బో: కాని ఇందుకు మన మేమిచేయవలెను?

నికో: ఇటువంటి ద్రోహములో మనము పాల్గొనరాదు. భూమిని మన యధీనములో నుంచుకొనరాదు. ఇతరుల పరిశ్రమవల్ల లాభము పొందుటకూడఁ దగదు. ఈ విషయము లన్నిటికిని సమి ఏర్పాటు చేయవలెనో నే నిప్పుడేమియుఁ జెప్పలేను. అసలు సంగతి యిది. మనజీవిత మేవిధముగాఁ గడచుచున్నదో మన మెప్పుడును ఆలోచింపనైన నాలోచించుటలేదు. నేను ఈశ్వరుని పుత్త్రుఁడననియు, మఱి మన మందఱముకూడ నీశ్వరుని పుత్త్రులమే యనియు ఒకరికొకరము సోదరులమనియు నాపిదపఁ జెప్పుటను గ్రహింపలేదు. కాని ఇప్పుడు మనమంద

అము సమానమైన హక్కుగలవార మనియు. ఈ ప్రపంచ ములో జీవించియుండుటకు అందఱకు నధికార మున్నదనియు నేను అనుభవమువల్లఁ దెలిసికొన్నప్పుడు నా జీవిత మంతయుఁ దలక్రిందయిపోయినది. కాని ఈ సంగతు లన్నిటిని ఇప్పుడు బోధింపలేను. నేఁడు మా ఇంటిలోనివా రున్నట్లే నేనుగూడ బొత్తిగాఁ గన్నులులేనివాఁడనై యుంటిననిమాత్రము ఇప్పుడు చెప్పఁగలను. అయితే ఇప్పుడు నా కన్నులు విడివడినవి. మఱి ఇప్పుడు ఇవన్నియుఁ గన్నులారఁ జూచుచు నూరకొని జీవించి యుండలేను. దీనిసంగతి తరువాతఁ జూతము. ప్రస్తుత మిప్పు డేదోవిధముగా వీరికి సాయము చేయవలెను.

[పోలీసులు, పీటరు, వానిభార్య పిల్లలు ప్రవేశింతురు]

పీ : (నికోలను కాళ్ళు పట్టుకొని) క్షమించండి. దేవుని మొగము చూచి నన్ను క్షమించండి. లేనిచో నేను పూర్తిగా నాశనమై పోవుదును. ఆడదియొక్కతె ధాన్యముకోసికొని ఏ విధముగా నింటిలోనికిఁ దీసికొని రాఁగలదు. చివరకు జామీనుమీఁదనైన నాకు విడుదల ఇప్పింపవలెను.

నికో : నేను దరఖాస్తు పెట్టుచున్నాను. (పోలీసుతో) ఏమి ఇతనిని మీరిప్పుడే విడుదల చేయలేరా ?

పో : పోలీసు స్టేషనుకుఁ దీసికొని రావలయునని మాకు ఆజ్ఞ యయి నది.

నికో : అయితే వెళ్లుఁడు. నేను జేయఁగలిగిన సాయము చేయుదును. ఇదంతయు నేను జేయవలసిన పనియే ఈ విధముగా నెవఁడు జీవింపఁ గలఁడు. (వెళ్ళుచున్నాఁడు.)

[అందరు నిష్క్రమింతురు]

## (మూడవ దృశ్యము)

[ఆ యింటిలోనే వర్షము కురియుచున్నది. ఒక డ్రాయింగు గదిలో పియానా యున్నది టానియా యంతకు మునుపే యొక గీతమును బూర్తిచేసి కూరుచుండెను స్ట్యాఫా పియానా దగ్గర నిలుచున్నాడు. బోరిసు కూరుచుండును. ల్యూబా, లిసా, మిత్రాఫేను. వాసిలీ పురోహితుడు అందఱును గీతమును విని పారవశ్యములోను. ఆనందములోను మునిగియుందురు.]

ల్యూ: అహో! యీ పాట యెంత ప్రేమపూరితమై యున్నది.

స్ట్యూ: నిజముగాఁ జాల బాగుగానున్నది.

లి: అవును. ఎంత బాగున్నది.

స్ట్యూ: అయితే, సంగీతకళలో నీవింత నిపుణరాలవని నాకుఁ దెలియనే తెలియదు. నీ హృదయములలో దివ్యమైన భావములు యక్షయనిధి ఇమిడియున్నవని యనుకొనవలసి వచ్చుచున్నది. ఆ యక్షయనిధి నుండి యేరిన సుందరమగు దివ్యభావము లొక్కొక్కటిగ మృదుమధుర లలిత స్వరముల పల్లకీపయిఁ గూరుచుండి యాకసమువైపునకు విహరించుచున్నవి. అవి జ్యోతిర్మయములై సమస్త ప్రపంచమును గప్పి యానందింపఁ జేయుచు దూరముగా నింకను దూరముగా వినువీధిలో మిలమిల లాడుచు సితారు వెలుఁగులో లీనమై పోవుచున్నవి. చూచు చుండఁగనే యా సితారు ఇంకను ఉజ్జ్వలమై జీవకళలుగాసి కదలుచు మెదలుచు మెఱయుచున్నది.

ల్యూ: సెభాస్ స్ట్ర్యూఫా. నా మనస్సులోని సంగతి సరిగాఁ జెప్పి నాఁడు. నిజముగా టానియా! నీవు జిన్నరివే.

టా: కాని పూర్తిగా నా భావములను వ్యక్తము చేయలేక పోయితి ననుకొనుచున్నాను. ఏదో కొంచె మిప్పటికిని అస్పష్టముగానే యున్నది.

లి: సెభాసు. ఇంతకంటె నింక గొప్పదేమున్నది. సంగీతము చాల యాశ్చర్యమైనది

ల్యూ: త్యాగరాజుగారు, దీక్షితులు జ్ఞాపకము వచ్చుచున్నారు. కాని త్యాగరాజుగారి కీర్తనలు మనసులో బాగుగా నాటుకొనును.

స్ట్యూ: అవును. వానిలో భావములు తొణఁకుచుండును.

టా: మనము వారిని ఒకరితో నొకరిని బోల్చలేము.

ల్యూ: భక్తిగీతములలో మీరాబాయి కూడ అద్వితీయురాలే. ఏమి నీ కేదైనఁబాట జ్ఞాపకమున్నదా?

టా: నీ కెటువంటి కీర్తన యిష్టము. "పలుకవదేమిరా రామ" (అని వాయించుటకు మొదలిడును.)

ల్యూ: గాదు. ఇది కాదు. ఇది చాల బాగుగనే యున్నది. కానీ దానిని అందఱు పాడుచుయుందురు. చూడు – ఈపాట 'రాగ సుధారస పానముచేసి రాజిలవే వోమనసా'.

టా: ఇహో! ఇది యెంత ప్రేమపూరితముగా నున్నది. పాడుచుం డఁగాఁ బాడుచుండగా మనస్సు సంతోషముతో నాట్యమాడు చుండును.

స్ట్యా: (నవ్వుచు) అపూర్వముగా నున్నది. ఆఁ ఆఁ ఏది కొంచెము పాడు చూతము. పోనీ వద్దులే. నీవు అలసిపోయి యుందువు. ఈ ఉదయము చాల యానందముతో గడిపితిమి. ఇందుకు నీకుఁ జాల ధన్యవాదములు

టా: (లేచి కిటికీ నుండి చూచుచున్నది.) వెలుపలఁ గొందఱు రైతులు కనిపెట్టుకొని కూరుచున్నారు.

స్ట్యా: ఇందువల్లనే సంగీతకళకింత గౌరవమున్నది. గానకళవలె నీ విధముగా సుఖదుఃఖములను మరిపింపజేయు వస్తువు మరి యొకటి లేదు.

(కిటికీ దగ్గరకు వెళ్ళి రైతులతో) మీరెవరికోసము వచ్చినారు?

రైతులు: నికోలసుగారి కోసము వచ్చినామండి.

స్ట్యా: వారు ఇంటిలో లేరు. మీరు కొంచెముసేపు ఆగండి.

టా. మరి గానకళయన నేమిటో తెలియని బోరిసుని ఇప్పటికిఁగూడఁ బెండ్లాడవలెనని యనుకొనుచున్నావా?

స్ట్యా: ఆ లేదు ఎప్పటికిని లేదు.

టా: సంగీతమా! కాదు కాదు. అదన్న నాకు యిష్టమే. పోనీ యది యన్న నాకు అనిష్టముగాదు. అని యనుకొనుఁడు. పాడుటకన్న వినుట నాకెక్కువ యిష్టము అందులో విన్యాసము మున్నది. అంతేకాని యింతటి కృత్రిమత్వమును బుట్టించెడి యాడంబర ముండదు.

టా: కాని యీ రాగము బాగుగా లేదా?

బో : ముఖ్యమైన సంగతి యిది ఇది యంత యావశ్యకమైనదిగాదు. వేలకొలంది మనుష్యులు గొప్ప కష్టములతో మునిగి తమ దినములు గడుపుచుండగా లోకులు గానవిద్యను ఇంత యావశ్యకముగాందలంచు చుండుట చూడఁగా నాకుఁ జాల దుఃఖము గలుగుచున్నది.

[అందఱు మేజాబల్ల మీఁద నలంకరింపఁ బడిన మిఠాయి తిను చుందురు.]

లి : మిత్రులు కలిసికొనుట, మిఠాయి తయారగుట యెంత కులాసా సంగతి.

బో : ఈ పని నాది కాదు తల్లి గారిది,

టా: అది పూర్తిగా నిజముకూడ.

ల్యా: సంగీతము యొక్క గొప్పతన మిందులో నున్నది, అది మన హృదయము మీఁద మత్తు మందులాగునఁ దన ప్రభావము చూపును కొంత సేపటివఱకు మనము ఈ స్థూలప్రపంచపు వాస్తవికత్వమును మఱచిపోవునట్లు. మనలను దన వశముచేసి కొని ప్రాపంచిక సుఖదుఃఖముల నుండి దూరముగా ఇంకను దూరముగా తీసికొనిపోవును. ఇంతకుముందు ప్రతి వస్తువు నీరసముగాను, నిరుత్సాహముగను దోఁచినది. కాని యిప్పుడీ సంగీతము అన్నిటిలోను జీవము పోసినట్లున్నది.

లి : నీకు గీతములేమైన వచ్చునా ?

టా: ఇదిగో . . . (వాయించుచున్నది.)

[నికోలసు ప్రవేశించును. బోరిసు, స్ట్యూఫా, లిసా, మిత్రా ఫేజా, వాసిలీలతోఁ జేయిచేయి కలుపును.]

నికో : మీయమ్మ యెక్కడనున్నది ?

స్ట్యూ: ఆమె పిల్లలగదిలో నున్నదేమో !

(స్ట్యూఫా నౌకరుని పిలుచుచున్నాఁడు.)

స్ట్యూ: అహా నీవా! అని నన్నారూ: టానియా ఎంత బాగుగా పాడుచూ వాయించుచున్నదో! మరి మీరెక్కడ నున్నారు!

నికో : ఊరిలో. (సేవకుడు ప్రవేశించును.)

స్ట్యూ: ఇంకొక టీ కప్పు తీసికొనిరా.

నికో : (సేవకునికి నమస్కరించి వానితోఁ జేయి కలుపుచున్నాఁడు) నమస్కారము.

[సేవకుఁడు కంగారుపడుచు వెళ్ళును. నికోలసు కూడ వెళు చున్నాఁడు,]

స్ట్యూ: ఓరి ' యభాగ్యుడా ! వాఁడెంత కంగారుపడెను. తండ్రిగారి సంగతులు నాకేమియుఁ దెలియుట లేదు. ఇందువల్ల మన మేమైన నపరాధము చేసితిమేమోయని తోఁచుచున్నది.

(నికోలసు తిరిగి ప్రవేశించును.)

నికో : నేను నా మనస్సులోని విషయము చెప్పకుండ నా గదిలోనికి. బోవుచుంటిని. (టానియాతో) నీవుమా కతిథివి. నా మాటలు నీకు అసహ్యముగ నున్నచో క్షమింపుము. నే నవి చెప్పకుండ నుండలేను. మేరీ ! టానియా బాగుగా, బాడుచు వాయించు చున్నదని నీ వన్నావు కాదూ ? సరే, మీరు పదుగు రెనమం డుగురు క్రొత్త పడుచుదనములో నున్నారు. ఆరోగ్యవంతు లైన స్త్రీలు పురుషులు మీరు. పది గంటలవఱకు నిద్రపోవుచుం బడియున్నారు. సరే, లేచినారు. లేచి యింత తిన్నారు. టీ, కాఫీలుకూడ నయినవి. మరల నిప్పుడుకూడ అదే పని. మీ రందఱు కలిసి యిక్కడ ఆడుచుం బాడుచు సంగీతచర్చలు చేయుచున్నారు.. మఱియక్కడనో. నేనిప్పు డక్కడనుండియే వచ్చుచున్నాను. లోకులందఱు తెల్లవాఱకముందే మూఁడు గంటలకు లేచి పనిచేసికొనుచున్నారు. రాత్రియంతయు గుఱ్ఱ ములను మేపుటతో వారికి నిద్రకూడఁ గలుగుటలేదు. ముసలి వారు, యువకులు, రోగులు, దుర్బలులు, పిల్లలకుఁ బాలిచ్చు తల్లులు, గర్భవతులు అందఱు తమతమ శక్తికి మించి పాటు పడుచున్నారు. అది యంతయు నెందుకు ? మనము వారి పరి శ్రమలవల్ల లాభముపొంది కేరింతలు కొట్టుకొనుట కొఱకు. ఇంతేకాదు. ఇప్పుడే వారిలో ఒక మనుష్యుఁడు – తన కుటుం బమును తా నొక్కఁడే పాటుపడి పోషించు మనుష్యుఁడు మన యడవియని చెప్పుకొనుదానిలోనే ఒక లక్షవవంతు చెట్లు కొట్టు కొని పోయెనని ఖైదులో వేయఁబడుచున్నాఁడు. మఱిమన మో స్నానముచేసి, దుస్తు లలంకరించుకొని పడకగదులలో మనము పాడు చేసిన మురికి నీటిని సేవకులచే బాగు చేయించుచు, హాయిగాఁ గూరుచుండి "కబీరు గీతములు గొప్పవా ? మీరా

శాయి గీతములు గొప్పవా ?" అని వాదించుకొను చున్నాము. మిమ్ము దాటి వెళ్ళినపిదప నా మనస్సులోఁగలిగిన బాధ యిదే. కనుక దానిని నేను జెప్పితిని. ఇట్లు జీవితము గడపుట యుచితమో కాదో మీ రందఱు కొంచె మాలోచింపుఁడు. (ఆవేశముతో నిలుచుండును).

ట్యా : మఱి యీ సంగతులమీఁద శ్రద్ధయుంచిన ఇంక మనము జీవించుటయే దుర్భర మగును.

స్ట్యా : ఏమి కొందఱు మనుష్యులు దరిద్రులుగా నున్నారని మనము పాడుకొనుట, చరిచించుకొనుట యెందుకు మానవలయునో నా కర్థమగుట లేదు. రెండింటిలోను అన్యోన్య విరోధము మాత్రము లేదు. ఎవఁడైనను....

నికో : (కోపముతో) హృదయము లేనివానికి. రాతిగుండె గలవానికి ........

స్ట్యా : మంచిది. నే నింక మాటాడను.

టాని : ఇది చాల దారుణమైన సమస్యయే. నేఁడు మనము బాగు చేయవలసిన సమస్య యిది. దానినుండి మనము భయపడ రాదు. పైఁగా ఈ చిక్కును విడదీయుటకుఁ బ్రయత్నము చేయవలయును.

నికో : ఎప్పుడో యొకప్పుడు తగిన సమయము వచ్చినప్పుడు ఈ సమస్య విడిపోవునని మాటాడక కిక్కురుమనకుండఁ గూరుచుండి యీ సంగతి నిరీక్షించుచు నుండలేము ఈ రోజు కానిచో

రేపయినను ప్రతి మనుష్యుఁడు చనిపోవలసినవాఁడే ఏదో యొక దినమున నీశ్వరుని యెదుట నందఱును తమ పనులకు జవాబు చెప్పవలసియుండును. ఇటువంటిస్థితిలో ఈ విషయము లన్నిటిని జూచుచు నా యాత్మ ప్రేరణను, దాని యాహ్వానమును అణఁచివైచి మౌనముతో నూరక యానందములతోను గేరింతలలోను ఇట్లు నా జీవితమును గడుపుచు నుండలేను.

బో : నిజము ఈ కష్టమును దొలఁగించుట కొకటే మార్గమున్నది. అది యిది. మనమీ యానందాది విషయములలో నేమాత్రము సౌఖ్యము కలుగఁ జేసికొనరాదు.

నికో : కాని యిది మీకుఁ దోఁచినచో నన్ను క్షమింతురుగాక. నేను చెప్పకుండ నుండలేకపోతిని (వెళ్ళిపోవును).

స్ట్రా : ఇందులో సౌఖ్యము కలుగఁ జేసికొనఁ గూడదూ? అయితే మన సమస్త జీవితము ఈ విషయములతోనే బంధింపఁ బడియున్నదే.

బో : ఇందుకొఱకే "అన్నిటికి ముందు మన మేమాత్రము ఆస్తి యుంచుకొనక, యితరులచే సేవ చేయించుకొన కుండునట్లు మన జీవితమును మార్చివేసి స్వయముగా నితరులకు సేవచేయవలెను." అని వారు చెప్పుచున్నారు.

టాని : మంచిది. నీవుకూడ నికోలసుగారి వలెనే మాటాడుట మొదలు పెట్టితివే.

బో : ఆ అవును. ఊరిలోనికి వెళ్ళి నాకళ్ళతోఁ జూచినమీఁదట మొట్టమొదటిసారి యీ సంగతి తెలిసికొంటిని. పాపము బీద

రైతులయొక్క, గర్భదరిద్రులైన కూలివారియొక్క కష్టము లకును మన విలాసములకును, భోగములకును సంబంధ మెక్కడ ? మన మొక్కసారి తళతళలాడు కళ్ళజోడును దీసి వేసి సహృదయత్వముతోఁ గనులు దెఱచి హీనమైన, నిస్సహా యమైన, నిర్జీవమైన వారి దుస్థితినిజూచి మన సిగ్గులేని, జాలి లేని విషయాసక్తిమీఁద ఒక్కమాఱు దృష్టినుంచి యీ సంగతి తెలిసికొనినఁ జాలును.

మి : కాని మన జీవితమును ఈ విధముగా నాశనము చేసికొనుట వారి కష్టములను బోఁగొట్టుట కుపాయము మాత్రముగాదు.

స్ట్యూ : కాని మేము భూమికి ఆకాశమునకు నున్నంత దూరములో నున్నాము. ఒకరికోస మింకొకరి జీవితము పాడుచేయరాదని మిత్రాఫేనుగారి మతము. ఈ విషయములో నా మతము వారి మతముతోఁ గలియుట చాల చిత్రముగ నున్నది.

బో : ఇది సహజమే. మీరిద్దఱు సుఖముగా మీ జీవితములను గడపఁ దలఁచుకొనుచున్నారు. కనుక మీరు దీనిని గోరుచున్నారు. (స్ట్యూపాతో) ఇందువల్ల నీవు ప్రస్తుతస్థితినే యంటిపెట్టుకొని యుండఁ దలఁచుచున్నావు. మిత్రాఫేను గారో క్రొత్తదారి త్రొక్కుచున్నారు.

[ల్యూబా, టానియా తమలో గుసగుస లాడుచున్నారు. టానియా పియానాదగ్గరకు వెళ్ళి యొక గీతము పాడుచున్నది. నిశ్శబ్దము]

స్మిత్ : చాల బాగుగ నున్నది. సెబాసు! ఇదే యన్ని విషయములను విడఁదీయుచున్నది.

బో : దీనివల్ల ఏ చిక్కు విడుటలేదు. పైఁగా నిది గాని నింకకు అస్పష్టముచేసి యనిశ్చితముగనే వదలివేయుచున్నది.

[టానియా పాడుచున్నది. మేరీ. చేరమళనోవ్న నిశ్శబ్దముగా వచ్చి కూర్చుండి పాట వినుచుందురు. పాట ముగియకముందే వెలువల బండిగంటల చప్పుడు వినఁబడును]

ల్యూ : పెద్దమ్మగారు వచ్చినారు. (ఆమెను గలిసికొనుటకు వెళ్ళును).

[పాట సాగుచున్నది. అలెగ్జాండ్ర ప్రవేశించును. ఆమెతోఁ గూడ మెడలోని క్రాసుతో ఫాదరీ జిరైసియము, ఒక గవర్నమెంటు ఉద్యోగి, ప్లీడరు వత్తురు. అందఱు లేచి నిలఁబడుచున్నారు]

జి : మీ పాట కానీయుఁడు. ఇది చాల బాగున్నది.

[చేరమళనోవ్న, వాసిలీ, ఆశీర్వాదము పొందుటకై యతని దగ్గరకుఁ బోవుదురు]

అలె : నేను చెప్పినట్లే చేసితిని. ఫాదరు జిరైసియముగారిని ప్రార్థించి యిక్కడకుఁ దీసికొని వచ్చితిని. బాగున్నది. నా పని పూర్తియైనది. ఇదిగో ఈ యుద్యోగికూడ సిద్ధముగనే యున్నాఁడు. అతఁడు కాగితములన్నియుఁ దయారుచేసెను. కేవలము సంతకము మాత్రము తరువాయి.

మేరీ : మీరు కొంచెము ఫలహారము పుచ్చుకొనుఁడు.

[ఉద్యోగి కాగితములను బల్లమీఁద నుంచి వెలుపలకుఁ బోవు
చున్నాఁడు.]

మేరీ : నేను ఫాదర్ జిరైసియముగారికిఁ గృతజ్ఞురాలను.

జీ : సంతోషించితిని. పెద్ద నేను చేయునది యేమి. నేను సంజీవయొక
చోటకు వెళ్ళవలసి యున్నది. అయినను క్రైస్తవులగుట
వలన నేను మాత్రిని గలిసికొనుట నా కర్తవ్యమని తలఁచితిని.

[అలెగ్జాండ్ర యా యువకులతో గుసగుసలాడుచున్నది. వారు
ఒకరి నొకరి అభిప్రాయ మొకరు గ్రహించి, బోరిసుగాక మిగిలినవా
రందఱు వసారాలోనికి వెళ్ళిపోవుచున్నారు. వాసిలీ కూడ
వెళ్ళఁదలఁచుచున్నాఁడు.]

జీ : వద్దు. మీరు పురోహితులు, ధర్మోపదేశకులు గావున మీరిక్కడ
నుండవచ్చును. మీరు లాభము పొందఁగలరు. దాని నితరుల
కీయఁగలరు. కాని మేరీగారికి ఏమైన నభ్యంతరము ఉండదు
గదా.

మే: వాసిలీగారిని మా కుటుంబములోని వారిగనే తలఁచుచున్నాను.
నేనీ విషయములో ఒకమాఱు వారి సలహానుగూడఁ దీసికొ
న్నాను. అయితే వారు వయస్సులో చిన్నదగుటచేత వారిమాటకు
ప్రామాణ్యము ఉండదు.

జీరై : అవును. అది సహజమే.

అలె: (దగ్గరకు వచ్చి) జీరైసియముగారూ! మీరు నా దృష్టిలో
నికోలసును మంచి దారిలోనికిఁ దీసికొనిరాఁ గలిగిన మనుష్యు

లుగా నున్నారు. అతఁడు చాలా తెలివైనవాఁడు, కాని యిట్టి వంటి తెలివివల్ల హానికలుగునని మీరెఱుఁగనే యెఱుఁగుదురు గదా. అతఁడొక వింతమైన భ్రాంతిలోఁ బడియున్నాఁడు. "ఏ మనుష్యుఁడును తన యాస్తిని ఉంచుకొనరాదని క్రైస్తవ ధర్మము చెప్పుచున్నదని యతని యుద్దేశము. కాని యిదియెట్లు సంభవించును ?

జిరై: ఇది మతేమియుఁగాదు 'గొప్పవాఁడు' అని యనిపించుకొనవలెనను కోరిక, ఆత్మశ్లాఘ, అహంభావము తక్క మతేమియుఁ గావు. చర్చి బిషప్పులు ఈ విషయమునకు సంతృప్తికరముగా ఖండితమైన జవాబు చెప్పియున్నారు. కాని ఇందతయు వారిలో నెట్లు ప్రవేశించినదో !

మే: అయ్యో! బాబుగారు ఏమి చెప్పుదును. మా వివాహమైననాటికివి యేమియు లేవు. మేము మొదటి యిరవదియేండ్లవఱకు సుఖముగానే యున్నాము. తర్వాత వారి మనస్సులో ఏవో కొన్ని యాలోచనలు ప్రతిఫలింప మొదలుపెట్టినవి. అయితే వారి చెల్లెలి ప్రభావమునను బడియుండవచ్చును. లేదా పుస్తకముల ప్రభావమునఁ బడియుండవలెను. ఎట్లయినను వారి మనస్సు తారుమారై పోయినది వారు బైబిల్ చదువ మొదలుపెట్టిరి. అంతే - సరాసరిగా వారిలో ధర్మాంకురము బయలుదేఱినది. వారు తమ జీవితమును మిక్కిలి ధార్మికముగాఁ జేయ మొదలు పెట్టిరి. చర్చికి రాకపోకలు సాగించి సాధువులతోను, సత్పురుషులతోను ధర్మప్రసంగాలు చేయ మొదలుపెట్టిరి. తరువాత సరిగా వారు ఇదంతయు మార్చివేసిరి. తమ పనిని స్వయముగా

చేతులతోడనే చేసికొనుచు నౌకరులను తన పని చేయవలదని నిషేదించినారు. తమ యైశ్వర్యమంత విడిచిపెట్టునంత వఱకు వారిస్థితి వచ్చినది నిన్న వారు ఒక యడవి యిచ్చివేసినారు. చెట్లు భూమి రెండు కూడ. ఇదంతయుఁ జూచి నా యాత్మ కంపించిపోవుచున్నది. నాకు ఏడుగురు పిల్లలు. దయయుంచి వారికి ఏదైనను బోధింపుఁడు. వారు మీతోఁ గలిసికొనెదరేమో వెళ్ళి యడుగుదును. (నిష్క్రమించును)

జీరై: నేఁడు చాల మంది యిట్లే పాడయిపోవుచున్నారు. మఱి యీ జమీందారీ యంతయు నెవరిది, వానిదా? వాని భార్యదా?

చేర: ఇది వానిదే. ఇది యామెదే యయినచో నింక బాధయేమి?

జీరై: మఱి వాని యుద్యోగమో?

చేర: మఱేమియుఁ బెద్ద పదవి కాదు. అశ్వదళమునకు కెప్టెను. అని యనుకొందును. ఒకప్పుడు సేనలోఁ గూడ నుండెను.

జీరై: ఇప్పుడు చాలా మంది యిట్లే మోసపడి పోవుచున్నారు. మాపార్కలో ఒక స్త్రీ యుండెను. ఆమెకు ఆధ్యాత్మికత్వము అవేశించియుండెను. అప్పుడామె చాల కష్టము గలిగించు చుండె డిది. చివరకు మేము చాల కష్టముతో ఆమెను తిరిగి చర్చిలోనికిఁ దీసికొని వచ్చునట్లు భగవంతుఁడు మాకు శక్తి యొసఁగెను.

చేర: ముఖ్య విషయము ఇది. మీరు తెలిసికొనుటకుఁ జెప్పుచున్నాను. నా కొడుకు అతని కుమార్తెను వివాహమాడఁబోవుచున్నాఁడు. దానికి నేనొప్పుకొన్నాను. పిల్లగు ఆనందోల్లాసములతో నుండుట యలవాటయినది. ఆమె కోరికలన్నియు నెఱవేర్చి బరువం

తనయుు నా కొడుకు నెత్తిమీఁదఁ బడుట నాకిష్టముగాదు. ఆమె పాటుపడునదే అనియు నవయువతులలో నాపద్ధతి యిదొక్కటే యనియు నేనొప్పుకొందును.

(మేరీ. నికోలసులు ప్రవేశింతురు)

నికో: చేరమళనోవ్సుగారూ! మీరు కులాసాగా నున్నారా? మీ మనస్సు సరిగా నున్నదా? (జిరైసియముతో) క్షమింపుఁడు నాకు మీ పేరు తెలియదు. *

జిరై: ఏమి నీవు నా యాశీర్వాదము పొందుట కిష్టపడవా?

నికో: ఇష్టపడను.

జిరై: నా పేరు జిరైసియము. మీతోఁ గలిసికొనుట వల్ల నాకుఁ జాల సంతోషముగానున్నది.

(నౌకరు ప్రొద్దుటి భోజన సామాగ్రి, సారా తీసుకొని వచ్చుచున్నారు.)

జిరై: ఈ ఋతువు చాలా యందమైనది. ఇది పాడి పంటలకుఁ జాల మంచిది.

నికో: తమరు నా తప్పులు చెప్పి మంచి మార్గములోనికిఁ దీసికొని వచ్చుటకై అలెగ్జాండ్రా పిలిచిన మీఁదట వచ్చినారని నేనను

---

* జిరైసియము ఫాదిరీ యని నికోలసుకుఁ దెలియును. కాని పేరు తెలియదు. ఫాదిరీగా గాక మామూలు వ్యక్తిగా తనతో మాటాడుట ఇష్టము.

కొనుచున్నాను. మఱి యిది నిజమైనచో ఈ విషయములు ఆ విషయములు కట్టిపెట్టి తమ పని ప్రారంభించుఁడు. చర్చి బోధల మీఁద నాకు గౌరవము లేదు. ఎప్పుడో చర్చి బోధలను గౌరవించియుంటిని. కాని యణఁగి పోయిన హృదయము నుండి సత్యమును గ్రహించుటకుఁ బ్రయత్నము చేయుచుంటిని. తమరు సత్యమార్గమును జూపినచో సంతోషముతో దానిని స్వీకరింతును.

జిరై: బాగున్నది. నీవు చర్చి బోధలను విశ్వసింపక పోయినచో మఱి విశ్వసింప వలసిన విషయమింకేమున్నది?

నికో: ఈశ్వరుఁడు, బైబిలులో వ్రాయఁబడిన నియమములు.

జిరై: చర్చి యా నియమములనే నేరుమన్నదిగదా.

నికో: చర్చి యిట్లే చేసియున్నచో నేను దప్పక చర్చిమీఁద విశ్వాసము కలిగి యుండును. కాని దురదృష్టముచేత అది దానికి విరుద్ధమైన శిక్షణము నిచ్చుచున్నది.

జిరై: చర్చి విరుద్ధమైన శిక్షణ మిచ్చుటలేదు యేసు ప్రభువు స్వయముముగా దానిని స్థాపించెను. "మీకధికారమిచ్చితిని ఈ రాతి మీఁద నా చర్చిని గట్టుదును. గుహోద్యాగములు దానికి వ్యతిరేకముగా నధికారమీయవు" అని.

నికో: అ[illegible]ది యీ సంద[illegible]ములోఁ జెప్పఁబడనే లేదు. పోని యేసు ప్రభువు చర్చి స్థాపించెనని యనుకొం[illegible]చో అది మీ చర్చి యేయని ఒప్పుకొనుట యెట్లు?

జి రై: "ఇద్దరు ముగ్గురు నా పేరుతోఁ గలిసినచోట నేను నా వారిమధ్య నుందును." అని యతఁడు చెప్పెను

నికో: ఇది చెప్పలేదు. పైఁగా నిది ఏమియు నిరూపింపదు.

జి రై: ఎవఁడును ఎట్లును చర్చిని దిరస్కరింపలేఁదు. అది యొక్కటే ముక్తికి మార్గము.

నికో: నేనీసంగతులను ఒప్పుకొనననని యిదివరకే చెప్పియుంటిని. "వారి పనులవల్ల, వారి లాభమువల్ల వారి సంగతిని దెలిసికొనుము" అని బైబిలు చెప్పుచున్నది. ఒట్లు పెట్టుకొనుట, హత్య, శిక్ష వీనిని చర్చి యాశీర్వదించుచున్నదని నేను తెలిసికొన్నాను.

జి రై: ఈశ్వరుఁ డేయధికారముల నిచ్చెనో వానిని చర్చి పవిత్రముగాను, ఉచితముగాను స్థిరపఱచుచున్నది.

(స్టార్గాపా, ల్యూబా, లిసా, వానియా ఒక్కొక్కరే వచ్చి వారి మాటలు వినుచుందురు.)

నికో: "చంపవలదు" అని మాత్రమే బైబిలు చెప్పుటలేదు. 'కోపపడకుము" అనికూడ దాని యుపదేశమైయున్నది. "ఎప్పుడును ఒట్టు పెట్టుకొనకుము" అని బైబిలు చెప్పుచున్నది. బైబిలు చెప్పునదేమనఁగా.........

జి రై: క్షమింపుఁడు. భగవంతుని దగ్గర నిన్నొట్టు పెట్టింతును" అని పైఁట చెప్పినప్పుడు ఏసు ప్రభువే స్వయముగా ఒట్టును స్వీకరించి యున్నాఁడు.

నికో: మీరు చెప్పునదేమి! ఇది యసంగతము అసంబద్ధము గూడ.

జిరై: జనులు ఎక్కడ తప్పిపోదురేమోయని చర్చి ఏసు వార్తకు ఇష్టము వచ్చినట్లు అర్థము చెప్పుట కెవరికిని అధికారమిచ్చుట లేదు. పైగా స్వయముగా పిల్లల జాగ్రత్త తీసికొను తల్లివలె చర్చియే సువార్తలకు వ్యాఖ్యానము చేసిపెట్టును. కొంచెె మోపిక పట్టి వినుడు నన్నుఁ జెప్పనీయుఁడు. చర్చి తన పిల్లల పైని మోయలేనంత బరువెప్పుడును వేయదు. "అంద అను ప్రేమింపుఁడు, హత్య చేయకుఁడు, దొంగతనము చేయ కుఁడు. వ్యభిచారము చేయవలదు" అని యీ యాజ్ఞలను మాత్రమే పాలింపవలెనని చర్చి కోరుచున్నది.

నికో: ఆ అవును నన్నుఁజంపకుఁడు నేను ఇతరులనుండి దొంగిలించి పోగుచేసికొనిన దానిని నా దగ్గఱనుండి దొంగిలింప వలదు. మనము ఇతరులను దోచినాము వారి భూమిని బలవంతముగా దొంగిలించి తీసికొంటిమి ఇది సొంతము నైనపిదప "ఇంక నెవ్వరును దొంగిలింపరాదు" అను న్యాయశాస్త్రమును ప్రవేశ పెట్టితిమి. సరే యీ సంగతులన్నిటిని చర్చి యామోదించు చునే యున్నది.

జి: నీ వాక్కులలో పాషండమతము, ఆధ్యాత్మికాహంకారము వాట్యమాడుచున్నవి. మీ పాండిత్య ప్రకర్షను గొంచెము కట్టిపెట్టుఁడు.

నికో: ఇది గర్వము గాదు అహంకారమును గాదు. లోకులను దోచు కొని భూమిద్వారా వారిని దాస్యములోఁ జిక్కుపడునట్లు చేసి నేను చేయునది పాపమని తెలిసికొన్నప్పుడు ఈ స్థితిలో నేనేమి

చేయవలయునో తెలుపవలసినదని మాత్రమే యిప్పుడు మిమ్ము డుగుచున్నాను. నేనిప్పుడు భూమినంతయు నా యధికారము లోనే యుంచుకొని యాఁకలితోఁ జచ్చిపోవు లోకుల పరిశ్రమ వల్ల లాభము గడించుకొనుచు నుండమందురా లేక (సారా తెచ్చిన యా సేవకునిజూపి) ఏదో యొకలాగున దొంగిలించియో మోసమున లాగుకొనియో మా పూర్వులు సంపాదించిన భూమిని వారిది వారి కిచ్చివేయుమందురా?

జీ : చరిచికి భక్తుఁడైనవాఁడు ఉపయోగకరమైన దేదో చూచికొని చేయవలయును. మీకుఁ గుటుంబమున్నది పరివారమున్నది. పిల్లాజెల్లా యున్నారు. వారి యోగ్యత ననుసరించి వారిని. భరించి పోషింపవలయును. వారి విద్యాబుద్ధులను గూర్చి యేర్పాటు చేయవలసియున్నది

నికో : ఎందుకు?

జీ : ఎందుకా? ఈశ్వరుఁడు మిమ్ము ఆ స్థితిలో నుంచినాఁడు. మీరు దాతలుగను, ఉదార హృదయులుగను నుండుట కిష్ట పడినచో మీరు మీ యాదాయములోఁ గొంత బీదలకు దానము చేసి మీ యౌదార్యమును బ్రకటింపవచ్చును.

నికో : కాని మఱి యేసుప్రభువు నవయువకుఁడైన యా ధనికునితో "ధనికులు స్వర్గమునకు వెళ్ళలేరు" అనియు, "ధనికులు స్వర్గ మునకు వెళ్ళుటకంటె సూదిబెజ్జములోనుండి ఒంటెదూరి వెళ్లుట యెన్నోరెట్లు సులభమైనదని" అనియు నెందుకుఁ జెప్పెను?

జీ : నీవు సంపూర్ణత్వమును బొందఁగోరినచో నట్లు చేయుమని చెప్పి యుండెను.

నికో : అయితే నేను సంపూర్ణత్వము పొందఁ గోరుచున్నాను. "స్వర్గములోని నీ తండ్రివలె సంపూర్ణుఁడవగుము" అని బైబిలు చెప్పుచున్నది.

జి : అది యే సందర్భములోఁ జెప్పఁబడినదో కూడ మనము చూడవలసి యున్నది.

నికో : నేనిది తెలిసికొనుటకై ప్రయత్నము చేయుచున్నాను. పర్వతముమీఁద ఏసుప్రభువు చేసిన యుపదేశములోఁ జెప్పిన దంతయు స్పష్టముగాను తెలిసికొనఁదగినదిగాను ఉన్నది.

జి : ఆధ్యాత్మికాభిమాన మనఁగా నిదియే.

నికో : బుద్ధిమంతులకు అస్పష్టముగా నున్న సంగతి శిశువులకుఁగూడ స్పష్టముగా నుండునని యతఁడు చెప్పినపుడు ఇది యభిమాన మెట్లగును ?

జి : వినయముగలజనులకు స్పష్టముగను సుబోధకముగను నుండును గాని యహంకారులకు మాత్రము గాదు.

నికో : గర్వ మెవరికున్నది ? నేను మానవజాతిలోని యొక సామాన్య మనుష్యుఁడనని యనుకొనుచున్నాను కనుక నేను ఇతరులగు నా సోదరులతోపాటు శ్రమపడి నిరాడంబరముగాను నిష్కల్మషముగాను జీవితము గడపవలయునని నేను విశ్వసించు చున్నాను తామే అత్యంత పవిత్రులమని, భ్రాంతిలేనివారమని, సత్యమును నిలబెట్టువారమని యనుకొనుచు, ఏసుదేవుని వాక్యముల కిష్టమువచ్చినట్లు అర్థము తీయుచుండెడివారే గర్వభూయిష్ఠులో నేనే గర్వభూయిష్ఠుఁడనో మీరే చెప్పుఁడు.

జి : (కంగారుపడి) క్షమించుడుగారు. నీకోలసుగారూ! మనలో నెవరు సరియైనవారో తెల్పుటకు వాదప్రతివాదనములు జరపుటకు నేను రాలేదు. మిమ్ముల్నయి శెకరించి సంపూర్ణ శిక్షణము నిచ్చుటకును నేను రాలేదు. అలెగ్జాండ్రగారు పిలువంగా మీతో సంభాషించుటకు మాత్రమే వచ్చితిని. పైంగా మీరు ప్రతి విషయమును నాకంటె బాగుగా ఎఱుంగుదురు. కాంబట్టి మన మింక సంభాషణ కట్టిపెట్టుటయే మంచిది. భగవంతుని మొగముచూచి మీ యావేశమును తగ్గించుకొనెదరుగాక యని కోరుచున్నాను. మీరు తప్పుత్రోవలలోం బడిపోయి మిమ్ము లను మీరు పాడుచేసికొనుచున్నారు.

మేరీ : తమరు కొంచెం ఫలాహారము చేయుదురా?

జి : వలదు. (అలెగ్జాండ్రతో) మీకు నా ధన్యవాదములు.

(అలెగ్జాండ్రగూడ వెళ్ళిపోవును)

మేరీ : (పురోహితునితో) చెప్పుండు. మీ రేమందురు.

పురో : నా యుద్దేశము నికోలసుగారు చెప్పినదే నిజమని మఱి జిప్రెసియముగారు తన పక్షము నిలుపుకొనుట కే ప్రమాణమును జూపలేదు.

చిర : వారిని మాటాడనిచ్చినం గదా మఱి యుండెడి యెదుట ఆయన యీ విధముగా మొండివాదన చేయుట కిష్టపడలేదు ఆయన మర్యాద ననుసరించి వాదము ముగించినారు.

బో : ఇది పెద్దతనము గాదు. వినయ మంతకంటె గాదు. వారిదగ్గర చెప్పుటకేమైన లేనేలేదను సంగతి స్పష్టము.

చేర : ఆ నీవుగూడ నీకు సహజమైన మతి చాంచల్యమునుబట్టి నికో లసుగారితో ఏకమగుచున్నావు గదూ ? ఇటువంటి విషయము లలో నీకు విశ్వాసమే యున్నచో నీవు వివాహమే చేసికొనఁ గూడదు.

బో : సత్యమెప్పుడును సత్యమే మఱి నేను దానిని జెప్పకుండ నుండ లేను.

చేర : ఇతరులిట్లు చెప్పినఁ జెప్పనీ. కాని నీవుమాత్రము ఇటువంటి మాటలు చెప్పఁగూడదు.

బో : ఏమి. ఎందుకు ?

చేర : ఏమి, ఎందుకా ? మీరు దరిద్రులు. మఱి మీదగ్గఱ ఇచ్చుట కేమియులేదు. పోని, మాకీ గొడవంతయు నెందుకు. (వెళ్ళి పోవుచున్నది).

[మేరీ, నికోలసులు తక్క మిగిలిన వారందఱు వెళ్ళిపోవు చున్నారు]

నికో : (కూర్చుండి యాలోచించుచుండును. తిరిగి తన యుద్దేశమును గూర్చి నవ్వుకొనుచున్నాఁడు.) మేరీ ! ఏమిటి యిదంతయుఁ జేయుచున్నావు. అపమార్గములోఁ దిగిగెడి యా దురదృష్ట మనుష్యుని ఎందుకు బిలిపించితివి ? గందరగోళము చేసెడి యా స్త్రీయును, ఈ ఫాదరీయును అత్యంతము ఆంతరికమైన మన

జీవనములో నెందుకుఁ గలుగఁజేసికొను చున్నారు? మనము మన వ్యవహారములను స్వయంగాఁ బరిష్కరించుకొనలేమా?

మేరీ : మఱి మీరు పిల్లలను ముష్టివారిని జేయవలెనని యనుకొను చున్నారు. నేనేమిచేయుదును. దీనిని సహించి యూరుకొన లేకున్నాను. మీ మాటలు నా తలలోని కెక్కుటలేదు. నా కోసం ఏమియు నక్కరలేదని మీ రెఱుఁగుదురుగదా!

నికో : అవును. ఎఱుఁగుదును. నేను దీనిని విశ్వసించుచున్నాను. కాని మన దౌర్భాగ్యమువల్ల నీవు సత్యమును విశ్వసించుట లేదు. నీవు సత్యమును జూచుచున్నావు కాని దానిమీఁద విశ్వాస ముంచుటకు నీ మనస్సును సిద్ధపఱుప లేకపోవుచుంటివని నా నమ్మకము. సత్యముమీఁద నీకు విశ్వాసము లేదు. నామీఁదఁ గూడ నీకు విశ్వాసము లేదు. మఱి నీకు సంఘముమీఁద చేరమఖనోవ్సగారి మీఁద, వారినిబోలిన యితరులమీఁద విశ్వా సమున్నది.

మేరి : నేను మిమ్ములను విశ్వసించుచున్నాను. ఎప్పటినుండియో మిమ్ము విశ్వసించుచున్నాను. కాని మీరు పిల్లలను ముష్టి వారిని జేయఁదలఁచి యున్నప్పుడు....

నికో : దీని కర్థము నీవు నామీద విశ్వాసముంచుట లేదన్నమాట. నా హృదయములోఁగూడ ఇట్లే ద్వంద్వయుద్ధములు, అనుమానపుఁ దుపానులు లేవలేదని యనుకొంటివి గాబోలు. ఈ సందేహ ములు నాకును గలుగకపోలేదు. కాని చివరకు ఈ మార్గము నడువ వీలైనదనియే కాకుండ తప్పక నడచితీఱవలసినదనియు

బాలురకుఁగూడ నిది యావశ్యకమైనదనియు నాకు నిశ్చితమైనది. "పిల్లలను జూచియే కాని లేనిచో మిమ్ములను అనుసరించెడి దాననే" అని నీవు మాటిమాటికిఁ బలుకుచుంటివి. మనదగ్గర సంపదలేనిచో మన మీ యజాగ్రత్తతో నిప్పటివలెనే జీవితము గడపెడివారము అప్పుడు మనకుమాత్రముఁ గష్టము గలిగియుండును. కాని యిప్పుడో పిల్లలకుఁగూడ నీజీవితము నేర్పి వారికి హాని గలిగించుచున్నాము.

మేరీ : కాని మీ మాటలు నా తలలోని కెక్కనప్పుడు నేనేమి చేయఁగలను?

నికో : నేనుమాత్రము ఏమి చేయుదును? పెడత్రోవలలో నడచు నా మనుష్యుఁడెందుకుఁ బిలిపింపఁబడెనో నాకుఁ దెలియకపోలేదు. అలినా ఆ యుద్యోగినెందుకుఁ దీసికొని వచ్చినది? నా యాస్తియంతయు నీ కిచ్చివేయవలయునని నీవు గోరుచున్నావుగాదూ?* నేనట్లు చేయజాలను. నేను నిన్ను ఇరువది యేండ్లనుండి (మనము కలసి నివసించుచున్నప్పటినుండి) ప్రేమించుచుంటివని యెఱుఁగుదువుగదా! నేను నీ మంచి కోరుటచేతనే ఈ యాస్తి నీపేర వేయలేకపోతిని. ఒకవేళ ఇచ్చివేసినచో నేనెవరిదగ్గరనుండి తీసికొంటినో యా రైతులకే యిచ్చివేయుదును. మంచిది యుద్యోగిగూడ రానే వచ్చెనుగదా! పనియంతయు నిప్పుడే యగును

---

* సరిగా ఇట్లే టాల్‌స్టాయికి, ఆయన భార్యకును ఆస్తి విషయములోను, కాపీరైట్ల విషయములోను జరిగినది.

మేరీ : వద్దు. ఇది మహాఘోరము. ఈ కాఠిన్యమంతయు నెందుకు? అయితే ఇట్లు ఆ స్త్రీయుంచుకొనుట పాపమని మీరు తలచినచో మఱి యా యా స్త్రీనంతయు నా కప్పగించి వేయుఁడు. (ఏడ్చుచున్నది)

నికో : నీవేమి చెప్పుచుంటివో నీకుఁ దెలియుటలేదు. ఒకవేళ మన యా స్త్రీనంతయు నిచ్చివేసినచో నేను నీతోగూఁడ నుండలేను. నేను ఎక్కడికైనను వెళ్ళిపోవలసివచ్చును. నా పేరనుగాక పోయిన నీపేరను ఆ రైతుల రక్తము పీల్చఁబడును. మఱి వారికి జైలుకు వెళ్ళవలసిన స్థితి పట్టును. ఏమి నీకిది యిష్టమేనా?

మేరీ : మీరెంత కఠిన హృదయులు. ఏమి యిదేనా క్రైస్తవధర్మము. ఇది మహా కఠోరమైనది. ఎట్లు నన్నుంచుటకు మీరు ప్రయత్నించుచున్నారో యట్లు నేనుండలేక పోవుచున్నాను. నా పిల్లలకు లేకుండ నితరులకు ఆ స్త్రీయంతయు నిచ్చుచుండ నేనూరుకొనగలనా? ఇందుకోసము మీరు నన్ను వదలివేయవలెనని తలఁచుచున్నారు. మంచిది యట్లే చేయుఁడు. నేనిప్పుడు చూచుచున్నాను. మీరు నన్నుఁ బ్రేమించుట మానివేసితిరి. ఇది యెందుకోకూడఁ దెలిసికొనుచున్నాను.

నికో : సరే. మంచిదే. ఇదిగో నేను నాచేవ్రాలు చేసివేయుచున్నాను కాని నీవు నాచేత ఒక యసంభవమగు విషయము చేయించుచుంటివి. (బల్లదగ్గరకు వెళ్ళి కాగితములపై సంతకము చేయుచున్నాఁడు.) నీవు కోరినది నేను నేసితిని కాని నేనీ విధముగా జీవితము గడుపలేను.

(ఇది ద్వితీయాంకము)

బాలురకుఁగూడ నిది యావశ్యకమైనదనియు నాకు నిశ్చిత మైనది. "పిల్లలను జూచియే కాని లేనిచో మిమ్ములను అనుసరించెడి దాననే" అని నీవు మాటిమాటికిఁ బలుకుచుంటివి. మనదగ్గర సంపదలేనిచో మన మీ యజాగ్రత్తతో నిప్పటివలెనే జీవితము గడపెడివారము అప్పుడు మనకుమాత్రముఁ గష్టము గలిగియుండును. కాని యిప్పుడో పిల్లలకుఁగూడ నీజీవితము నేర్పి వారికి హాని గలిగించుచున్నాము.

మేరీ : కాని మీ మాటలు నా తలలోని కెక్కనప్పుడు నేనేమి చేయఁగలను ?

నికో : నేనుమాత్రము ఏమి చేయుదును ? పెడత్రోవలలో నడచు నా మనుష్యుఁడెందుకఁ బిలిపింపఁబడెనో నాకుఁ దెలియకపోలేదు. అలినా ఆ యుద్యోగినెందుకుఁ దీసికొని వచ్చినది ? నా యాస్తియంతయు నీ కిచ్చివేయవలయునని నీవు గోరుచున్నావుగాదూ ?* నేనట్లు చేయజాలను. నేను నిన్ను ఇరువది యేండ్లనుండి (మనము కలసి నివసించుచున్నప్పటినుండి) ప్రేమించుచుంటివని యెఱుఁగుదువుగదా ! నేను నీ మంచి కోరుటచేతనే ఈ యాస్తి నీపేర వేయలేకపోతిని. ఒకవేళ ఇచ్చివేసినచో నేనెవరిదగ్గరనుండి తీసికొంటినో యా రైతులకే యిచ్చివేయుదును. మంచిది యుద్యోగికూడ రానే వచ్చెను గదా ! పనియంతయు నిప్పుడే యగును

---

* సరిగా ఇట్లే టాల్‌స్టాయికి, ఆయన భార్యకును ఆస్తి విషయములోను, కాపీరైట్ల విషయములోను జరిగినది.

మేరీ : వద్దు. ఇది మహాఘోరము. ఈ కాఠిన్యమంతయు నెందుకు ? అయితే ఇట్లు ఆ స్త్రియుంచుకొనుట పాపమని మీరు తలచినచో మఱి యా యా స్త్రినంతయు నా కప్పగించి వేయుఁడు (ఏడ్చుచున్నది)

నికో : నీవేమి చెప్పుచుంటివో నీకుఁ దెలియుటలేదు. ఒక వేళ మన యా స్త్రినంతయు నీకిచ్చివేసినచో నేను నీతోఁగూడ నుండలేను. నేను ఎక్కడికైనను వెళ్ళిపోవలసివచ్చును. నా పేరనుగాక పోయిన నీ పేరను ఆ రైతుల రక్తము పీల్చఁబడును. మఱి వారికి జైలుకు వెళ్ళవలసిన స్థితి పట్టును. ఏమి నీకిది యిష్టమేనా ?

మేరీ : మీరెంత కఠిన హృదయులు. ఏమి యిదేనా క్రైస్తవధర్మము. ఇది మహా కఠోరమైనది. ఎట్లు నన్నుంచుటకు మీరు ప్రయత్నించుచున్నారో యట్లు నేనుండలేక పోవుచున్నాను. నా పిల్లలకు లేకుండ నితరులకు ఆ స్త్రియంతయు నిచ్చుచుండ నే నూరుకొనగలనా ? ఇందుకోసము మీరు నన్ను వదలివేయవలెనని తలఁచుచున్నారు. మంచిది యట్లే చేయుఁడు. నే నిప్పుడు చూచుచున్నాను. మీరు నన్నుఁ ప్రేమించుట మాని వేసితిరి. ఇది యెందుకోకూడఁ దెలిసికొనుచున్నాను.

నికో : సరే. మంచిదే. ఇదిగో నేను నాచేవ్రాలు చేసివేయుచున్నాను. కాని నీవు నాచేత ఒక యసంభవమగు విషయము చేయించుచుంటివి. (బల్లదగ్గరకు వెళ్ళి కాగితములపై సంతకము చేయుచున్నాఁడు ) నీవు కోరినది నేను చేసితిని కాని నేనీ విధముగా జీవితము గడుపలేను.

(ఇది ద్వితీయాంకము)

# తృతీయాంకము

## (మొదటి దృశ్యము)

[ఒక పెద్దగది. అందులో వడ్రముపనిముట్లు, ఒక బల్ల. దాని మీఁదఁ గాగితములు. ఒక వడ్రంగి, నికోలను ఒక బల్లదగ్గర పని చేయుచుందురు. బీరువా, అద్దము, బొమ్మలు గోడకు దగిలింపఁబడి యున్నవి. వాటి కెదురుగఁ గొన్ని బల్లలు గోడకు జారగిల వేయఁ బడినవి.]

నికో : (ఒక బల్లను చిత్రిక పట్టుచు) ఏమియిది బాగుగాలేదూ ?

వడ్ర : (చిత్రికగుల్ల చేతితోఁ బట్టుకొని) లేదండి; యిది యింకను గఱుకుగానే ఉన్నది. చిత్రికగుల్లను ఇట్లు పట్టుకొనండి.

నికో : చెప్పుటమాత్రము సులభమే. కాని యిదిమాత్రము నాకు నడచుటలేదు.

వడ్ర : కాని, బాబూ! వడ్రముపని నేర్చుకొనుట కెందుకింత శ్రమ. ప్రతి రోజునకారోజు వడ్రంగులు పెరిగిపోవుచున్నారు. ఇప్పుడు మా పొట్ట నింపుకొనుటే కష్టము పోవుచున్నది.

నికో : (తిరిగి పనిచేయుచుండును) సోమరితనపు జీవితము గడపుట నాకు సిగ్గుగానున్నది.

వ్రజ : తమస్థితి యిటువంటిది దేవుఁడు తమకు ఐశ్వర్యమిచ్చి నాఁడు.

నికో : ప్రస్తుత మిట్లే కనఁబడుచున్నది. ఆ యైశ్వర్యము ఈశ్వరుఁడిచ్చినాఁడనుమాట నేను నమ్మను. నా యభిప్రాయమిది-కొందఱు దానిని లాగుకొన్నారు. మా సోదరుల దగ్గరనుండి లాగుకొన్నారు.

వ్రజ : (ఆశ్చర్యముతో) ఇదేమిమాట బాబూ! కాని యిది యిట్లే యైనను తమ రీ పని చేయుటకేమియు నవసరములేదు.

నికో: అవసరము లేని వస్తువులతో నిండియున్న యొకయింటిలోనే యుండి కూడ, శ్రమపడి కూలినాలి చేసికొని యేదోకొంత యార్జింపఁ దలఁచుకొనుట నీ కాశ్చర్యముగానే యుండును.

వ : (నవ్వి) అబ్బే కాదండి. పెద్దయింటి మనుష్యులు ప్రతిపనిలోను నేర్పు పొందవలెనని కోరుచుందురని ఎవరెఱుఁగరు? అవును. ఇప్పుడు కొంచెము చిత్రికగుల్లను వేగనుగా నడపండి.

నికో: నీవు నా మాట నమ్మక పోవుటయే కాక నవ్వుచున్నావుకూడ. మొట్టమొదట ఇటువంటి జీవితములో నాకు సిగ్గు కలిగెడిది కాదు కాని యిప్పుడు ఏసుప్రభువు చేసిన యుపదేశముల మీఁద నమ్మకము గలిగిన పిదప నా కా పనిమాలిన జీవితము మీఁద సిగ్గు వేయుచున్నది. మనమందఱము మనుష్యులము పరస్పరము అన్నదమ్ములమని యాయన యుపదేశము

నికో: నేనిట్లే చేయఁదలఁచుకొన్నాను కాని యిట్లు చేయలేకపోతిని. ఆ యైశ్వర్యమంతయు నేను నా భార్యకిచ్చి కూర్చుంటిని.

వ : కాని యసలు మీరట్లు చేయుట యసంభవము. మీరు మొదటి నుండి భోగములతోఁ బెరిగినారు.

[తలుపు వెలుపలనుండి చప్పుడు "నాన్నగారూ! నేను లోనికి రావచ్చునా?]

నికో: రా. అమ్మాయీ! ఎప్పుడైనను నీవు రావచ్చును.

(ల్యూబా ప్రవేశించును)

ల్యూ: జేకబూ! సుఖముగా నున్నావా?

వ : అమ్మాయిగారూ! నమస్కారములండీ.

ల్యూ: నాన్నగారూ! బొరిసు పటాలము లోనికి వెళ్లెను. అక్కడకు వెళ్ళి ఏమి చెప్పునో ఏమి చేయునో తెలియుటలేదు నాకుఁ జాల భయము గలుగుచున్నది. మీరేమందురు?

నికో: మంచిది. నేనేమందును. అతని కెట్లుతోఁచునో యట్లె చేయును.

ల్యూ: ఇది చాల దుఃఖకరమైన సంగతి. ఆయన కొంతకాలము నిర్బంధసేవ* చేయవలసి యుండును. అక్కడకు వెళ్ళి తన సమస్త జీవితమును పాడుచేసికొనఁడు గదా యని భయముగా నున్నది.

నికో: అతఁడు నన్నుఁ జూచుటకు రాకపోవుటలోఁ జాల మంచిపనియే చేసెను. అతనికిఁ దెలిసిన సత్యముకంటెఁ గ్రొత్త సంగతిని నేను

* యూనివర్సిటీ గ్రాడ్యుయేటు కొంతకాలము పటాలములో నిర్బంధసేవ చేయవలయునని రష్యాలో నియమము గలదు.

చెప్పఁజాలనని యతనికిఁ దెలియును. అతనిదృష్టిలో నింతకంటె నీతి భ్రష్టము, నియమ రహితము, ఘాతుకము అయిన వృత్తి యింకొకటి లేదు. అతఁడు తనపదవికి రాజీనామా ఇచ్చుటలో కేవల మిదే కారణము కాదని నాతోఁ జెప్పెను. ఎందుచేత ననఁగా దాని యుద్దేశము హత్య చేయుటయేగాదా. పైఁగా ఒక మనుష్యుఁడు తన యజమాని యాజ్ఞను - అది యెంత కఠోరమైననుసరే, దయా విహీనమైనదైననుసరే, ఆత్మకు బుద్ధికి వివేకమునకు విరుద్ధమైనదైననుసరే మాఱు మాటాడకుండ ఊ అ అనకుండ నెఱవేర్చుటకు నిర్బంధింపఁబడుటకంటె నింక నింతకన్న భ్రష్టమైనది, నీచమైనది యింకొకటి లేదని యతనికిఁ దెలియును. బోరిసు ఇవన్నియు బాగుగా నెఱుఁగును.

ల్యూ: నాకిదే భయము. ఆతని కివన్నియుఁ దెలియును. ఎక్కడనైన ఏదైనఁ జేసివేయఁడుగదా.

నికో: దానికి వాని యాత్మయును వానిలోని పరమాత్మయును నిర్ణయము గావించును. బోరిసు నా దగ్గరకు వచ్చియున్నచో ఒక సలహా యిచ్చియుందును. "ఒక్కబుద్ధి మాత్రమే ప్రేరేపించునట్టి పని చేయకుము, అట్లు చేయుట కంటెఁ జెడ్డది యింకొకటి లేదు. నీ మనోవాక్కాయ కర్మలు ప్రోత్సహించి పూనుకొనునట్టి ఘనకార్యము చేయుటకుఁ జేయి చేసికొనుము. ఉదాహరణకు నన్నే తీసికొనుము. నేను ఏసుప్రభుని ఉపదేశముల ప్రకారము నడచుకొనుటకు తల్లిని, తండ్రిని, భార్యను

పిల్లలను అందఱను విడువఁదలఁచితిని. ఇల్లుకూడ విడిచిపెట్టితిని కాని పరిణామ మేమయినది? నేను తిరిగివచ్చి సుఖసంతోషము లతో పట్టములో మీతోపాటు ఉండ మొదలిడితిని. నా శక్తికి మించిన పని చేయఁదలఁచుటయే లజ్జాకరమైన యీ నిరర్థక దుస్థితికిఁ గారణము. నేను నిష్కపటముగా నుండి నా చేతు లతోఁ బనిచేసి జీవింపఁ గోరుచున్నాను. కాని నౌకరులు ద్వారపాలకులు ఉండెడి యీ స్థితిలో ఏదో యొకవిధమైన పరి శ్రమచేసికొనుటకూడ ఒకవిధమైన యాడంబరముగాఁ దోఁచుచు చున్నది. చూఁడు ఇంతవఱకు వడ్రంగి నన్నుఁ జూచి నవ్వు చునే వున్నాఁడు.

వ : నాకు నవ్వు రాదండి! తమరు నాకు జీతమీయుఁడు. త్రాగుట కిన్ని టీ నీళ్ళు పోయింపుఁడు. నేను మీఁకు గృతజ్ఞుఁడనై వుందును.

ల్యూ: బహుశా నేను అతని దగ్గరకు వెళ్ళివచ్చినచో బాగుండి యుండు ననుకొనుచున్నాను.

నికో: అమ్మాయీ! ఇది చూచుటకు నీకుఁ గష్టము భయము గలుగు చున్నదని తెలియుచున్నదమ్మా. అయినప్పటికిని ఇదియిట్లు జరుగదు. నీవు భయపడకు. ఈశ్వరుఁడంతయు మంచినే చేయును. పైకిఁ గష్టముగాఁ దోఁచునదియే వాస్తవములో ఎక్కువ సౌఖ్యము నిచ్చును. నీవీసంగతి జ్ఞాపకముంచుకో. ఈ మార్గమున సంచరించు మనుష్యుఁడు ఈ క్రింది రెండు సంగతులలోను ఏదోయొకదానిని ఎన్నుకొనవలసి వుండును.

ఒకటి దైవ పక్షము. రెండు అసుర పక్షము. ఈ రెండును ఒకొక్కప్పుడు సరిసమానముగాఁ దూఁగుచుండును. ఇటువంటి పరీక్షా సమయములోనే మనుష్యుఁడు మహత్త్వపూర్ణ మగు నిశ్చయమును జేసికొనవలసి యున్నాఁడు. అప్పుడు వ్రేలు కదపుట కూడ నత్యంత భయంకరముగాఁ దోఁచును. ఒక మనుష్యుఁడు రాళ్ళతోను ముండ్లతోను నిండిన బాటలో ఒక బరువైన మూటతోఁ బోవుచున్నాఁడనుకొనుము. అప్పుడు వాని కేమాత్రము చిన్నరాయి తగిలినను మూట పడిపోవుట కాళ్ళు చేతులు విఱుగఁ గొట్టుకొనుట సంభవించునుగదా. ఇట్లె యిప్పుడు అతని స్థితి ఉన్నది.

ల్యూ: అతఁడిన్ని కష్టములను గోరి తెచ్చుకొనుట యెందుకు?

నికో: ఎవరెట్లన్నను ఈ విషయ మిటువంటిదే. తల్లి ప్రసవ వేదన లేకుండ సంతానము కలుగదుగదా. ఆధ్యాత్మిక జీవనమునకుఁ గూడ నింతేస్థితి. నేను నీతో ఒక సంగతి చెప్పుచున్నాను. బోరిసు నిజమైన క్రైస్తవుఁడు. మఱి యిందుకే యాతఁడు స్వతంత్రుఁడు గూడ. ఇప్పుడు నీవు కూడ నతని వలెఁగాక పోయినను, అతని వలె నీశ్వరుని యందు విశ్వాస ముంచక పోయినను అతనిద్వారానైన ఈశ్వరునిపైని విశ్వాసముంచుట నేర్చుకొనుము.

[తలుపు దగ్గర చప్పుడు. వెలుపలనుండి మేరీ "నేను లోనికి రావచ్చునా?"]

నికో: ఆ. ఎప్పుడైనను సరే రావచ్చును.

ఏమిటి యీ రోజున బాగుగా స్వాగత మీయవలసివచ్చుచున్నది.
[మేరీ ప్రవేశించును.]

మేరీ: మన పురోహితుఁడు వాసిలీగారు వచ్చినారు. ఆయన బిషప్పు దగ్గఱకు వెళ్ళుచున్నారు మఱి యాయన రాజీనామా యిచ్చి వేసినారు.

నికో: ఇది యసంభవము.

మేరీ: ఆయన యిక్కడనే ఉన్నారు. ల్యూబా! వెళ్ళి వారిని దీసి కొనిరా. ఆయన మిమ్ములను గలిసికొనవలెనని యనుకొను చున్నారు. (ల్యూబా వెళ్ళుచున్నది.) నేను వచ్చుట కింకొక కారణమున్నది. నేను మీతో వానియా గుఱించి మాటాడుద మనుకొనుచున్నాను. వాఁడు తన పాఠమును గుర్తుంచుకొనుట లేదు. వాఁడీ సంవత్సరము ప్యాసగుసని యనుకొనను. మఱి నేనేదైనఁ జెప్పునప్పటికి వాఁడు నా మీఁదఁబడును.

నికో: మేరీ! మీరందఱు గడుపు జీవితమును నేను మెచ్చుకొనుట లేదని యెఱుఁగుదువు, పిల్లలకిప్పించు శిక్షణలో నాకు సాను భూతి కూడ లేదు. ఈరీతిగా పిల్లలు పాడయిపోవుచుండ నేను కన్నులతోఁ జూచుచు నూరకొనుచుంటినే యను నొక భయం కర సమస్య నా యెదుట నున్నది.

మేరీ: అయితే మీరింతకు తప్ప మఱియొక సంగతి నిశ్చయముగా చెప్పరాయెను. మీ యుద్దేశమేమి?

నికో: అదేమియు నేను జెప్పలేను. కాని యన్నిటికి ముందు ముఖ్యముగా మనలను నీచులను గావించెడి యీ భోగముల నుండి విడుదల పొందవలయునని మాత్రము తప్పక చెప్పఁగలను.

మేరీ: ఇందువల్ల వారు వ్యవసాయదారులై పోవుదురు. ఇదిమాత్రము నేనొప్పుకొనలేను.

నికో: అయినచో నన్నింక నడుగకుము. నీకు చెడ్డగాను దుఃఖకరముగాను దోఁచినచో నేనేమిచేయుదును. కాని నా మాటలు పూర్తిగా స్వాభావికములైనవి. తప్పనిసరికూడ.

[పురోహితుఁడు, ల్యూబా ప్రవేశింతురు. పురోహితుఁడు నికోలను ఒకరికొకరు నమస్కరించుకొందురు]

నికో: తమరు ఆ వ్యాపారమునుండి నీళ్ళు వదులుకొన్నారట. నిజమేనా?

వాసి: అవును. నేనింక సహించలేక పోతిని.

నికో: ఇది యింత త్వరగా జరుగునని నేననుకొనలేదు.

పురో: కాని నిజముగా నల్లె ఉండుట యసంభవమై పోయినది. ఈ యాహ్వానముఃపొంది యూరుకొనలేక పోయితిని. మేము లోకుల పాపస్వీకారములను వినవలసి వచ్చుచున్నది. మంత్రోపదేశములు చేయవలసి వచ్చుచున్నది. ఇది యంతయు నసత్యమని యొకమారు విశ్వాసము గలిగిన పిదప .....

నికో: అవును. అయితే తమరిప్పు డేమిచేయుదురు.

పురో: నేనిప్పుడు బిషప్పు దగ్గరకు వెళ్ళుచున్నాను. నాకు జిల్లాను నివాస స్థానము చేసి సాలెవేట్సు చరిచ్చికి నన్నుఁ బంపవలెనని యతఁడు తలఁచుచున్నట్లు తెలియుచున్నది. నేను మొదట మీకు దూరముగా నెక్కడనైనఁ బాటిపోవుటకు సాయము కోరవలయు ననుకొంటిని, కాని యిందులోఁ బిటికి తనము ప్రకటమగునని తర్వాత తలఁచితిని. సరేకాని నేను నాభార్య సంగతి చూడవలసియున్నది.

నికో: ఆమె యెక్కడ నున్నది ?

వాసి: ఆమె తన తండ్రిగారియింటికి వెళ్ళినది. మా యత్తగారువచ్చి నాకుమారుని గూడ తీసికొని వెళ్ళినారు. ఇందువల్ల నాకుఁ జాల దుఃఖముగా నున్నది. ...

[ఆగి కన్నీరు తుడుచుకొన యత్నించుచున్నాఁడు]

నికో: ఈశ్వరుఁడు మీకు సాయము చేయుఁగాక. ఏమి నేఁడు మాతో పాటు ఉండెదరా?

[ఆ గదిలోనికి జమీందారిణి చేరమళనోవ్నగారు పరుగెత్తి వచ్చెను]

చేర: ఇప్పుడక్కడ ఆ పనేమయినది. వాఁడాపని చేయుట కంగీకరించ లేదు. వానిని ఖైదులో వేసినారు. నేనక్కడకు వెళ్ళితిని కాని వారు నన్ను లోపలకు వెళ్ళనీయలేదు. నికోలసు! మీరక్కడకు వెళ్ళక తప్పదు.

జ్యా: ఏమి వారొప్పుకొనలేదా? మీకెట్లు తెలిసినది?

చేర: నేనక్కడనే యున్నాను. కౌన్సిలు మెంబరు నాకా సంగతి యంత చెప్పెను. బోరిసుగానికి వెళ్ళఁగానే "నేను నౌకరి చేయను. ఒట్టుపెట్టుకొనను" అని చెప్పివేసెను. చివరకు వాఁడు నికోలసు నేర్పిన పాఠమంతయు నప్పగించినాఁడు.

నికో: చేరమళనోవ్వుగారు! ఇవి నేర్పినంత మాత్రము వచ్చునవిగావు.

చేర: నాకిదంతయుఁ దెలియును. కాని యిది క్రైస్తవ ధర్మము మాత్రము గాదు. ఏమి గురువుగారు! మీ యభిప్రాయ మేమిటి?

వాసి: నేనిప్పుడు ఫాదిరినిగాను.

చేర: కాని సంగతి యంతయు నొకచే....... అవును. మీరుకూడ వారిలోఁ గలిసినారూ? మీకిది మంచిదే కావచ్చును. కాని నేనీస్థితిలో ఈ సంగతులన్నిటిని వదలిపెట్టలేను. లోకులను దుఃఖపెట్టి సర్వనాశనము చేయునటువంటిది యెంత దురదృష్ట కరమైన క్రైస్తవ ధర్మము. ఈ మీ క్రైస్తవధర్మమును అసహ్యా గించుకొనుచున్నాను మీకిందువల్ల పాడయిపోవునది యేమియు లేదు గనుక ఈ కులుకులు మీకు మంచి బాగుగానే ఉండ వచ్చును. కాని నా కొక్కడే కొడుకు. వానిని మీరు పాడు చేసినారు.

నికో: జమీందారిణిగారు! కొంచెము శాంతి పొందవమ్మా!

చేర: ఆ ఆ మీరు వాని జీవితమును పాడుచేసివేసినారు. వానిని రక్షింపవలసిన భారము మీ మీఁదనే యున్నది. వాఁడీ యసందర్భములైన సంగతులు విడిచిపెట్టునట్లు మీరే వెళ్ళి

బోధింపుఁడు. ఇవంతయు మీబోటి ధనవంతులకు యుక్తముగా వచ్చును. కాని మావంటి వారికి మాత్రము గాదు.

ల్యూ: (ఏడ్చుచు) నాన్నగారు! ఇప్పుడేమి చేయవలెను.

నికో: నేను వెళ్ళుచున్నాను. బహుశా నేనేదైనఁ జేయ[illegible]దున్న దేమో (కోటు తొడుగుకొనుచు)

చేర: వారు నన్ను లోనికి వెళ్ళనిచ్చుట లేదు. మనమిద్దఱము కలిసి వెళ్లుదము.

(నిష్క్రమింతురు.)

( రెం డ వ దృ శ్య ము )

[గవర్నమెంటు ఆఫీసు. గుమస్తా యొక బల్లదగ్గరఁ గూర్చుండి యుండును. ఒక సిపాయి యిటునటు తిరిగుచుండును. ఒక జనరలు తన సహోద్యోగితో వచ్చును. గుమస్తా లేచి నిలుచుండును సిపాయి సెల్యూటు చేయును.]

జన: కల్నలు గారేరి?

గు: అయ్యో! ఇప్పుడే వచ్చిన యా క్రొత్త సిపాయిని చూచుటకు వెళ్ళినారండి.

జన: మంచిది. వెళ్ళి వారిని దీసికొనిరా.

గు : చిత్తము.

జన: మఱి నీవు దేనికి నకలు తీయుచున్నావు. ఆ క్రొత్త సిపాయి స్టేటుమంటూ? 

గు : చిత్తము. అదేనండి. 

జన: ఏదీ యిట్లిమ్ము.

[గుమస్తా కాగితములు జనరలు చేతికిచ్చి వెళ్ళుచున్నాఁడు. జనరలు అవి తన యుద్యోగి చేతికిచ్చుచున్నాఁడు.]



జన: ఏదీ కొంచెము చదువుఁడు. చూతము.

ఉ : (చదువుచున్నాఁడు) "నన్ను మూఁడు ప్రశ్నలడిగినారు. 1. నేనెందుకు ఒట్టుకొనుటలేదో? 2. నేను గవర్నమెంటు వారి యాజ్ఞను ఏందుకుఁ జేయుటలేదో? 3. సైనికశాఖకు మాత్రమే గాక యున్నతోద్యోగులకుఁగూడ విరుద్ధముగాను ఎందుకు వ్రాసితినో? అని. మొదటి ప్రశ్నకు జవాబిది నేను ఏసుప్రభుని యుపదేశమును గౌరవించుచున్నాను. అందులో ఒట్టుపెట్టుకొనరాదని స్పష్టముగా నిషేధింపఁ బడియున్నది.

జన: తన యిష్టము వచ్చినట్లు అర్థాలు తీసి వాదించుచున్నాఁడే.

ఉ : (చదువుచున్నాఁడు) "ఎంతమాత్రము ఒట్టుపెట్టుకొనవద్దు. మీమాట అవునంటే అవును కాదంటే కాదు. అని ఉండవలెను. వీనిని మించునది పాపము నుండి పుట్టినది. అని సువార్తలో వ్రాయఁబడి ఉన్నది. సెంటుజేమ్సు (యాకోబు పత్రికలో)

ఏపిస్టలులో "నా సహోదరులారా! ముఖ్యమైన సంగతి యేద నఁగా ఆకాశము తోడనిగాని భూమి తోడనిగాని మఱి దేని తోడనిగాని యొట్టుపెట్టుకొనక మీరు తీర్పు పాలు గాకుండు నట్లు అవునంటే అవునన్నట్టును కాదంటే కాదన్నట్లును ఉండ వలెను" అని బైబిలులోనే మొదట స్పష్టముగా నొట్టుపెట్టు కొనరాదని ఉన్నది. నేను మనుష్యుల యాజ్ఞ ప్రకారము చేయుటకు ఒట్టుపెట్టుకొనలేను. క్రైస్తవుఁడనైన నేను నా యుద్దేశత ననుసరించి యెల్లపుడును ఈశ్వరుని యిచ్ఛమీఁదనే నడువవలసి ఉన్నది. మఱి యిచ్ఛ యెప్పుడును మనుష్యుని యిచ్ఛ కనుకూలముగా నుండదు,...

జన: వాదన చేయుచున్నాఁడే. నా యధికారము చూపినప్పుడు వీని సంగతి బాగుగా తెలియును.

ఉ: "గవర్నమెంటు అను పేరుతోఁ బిలువఁబడు మనుష్యుల యాజ్ఞలు చేయుట కంగీకరింపను. ఎందువలననఁగా . . .

జన: ఏమి ఎంత పొగరు.

ఉ: "ఎందువలననఁగా వారి యాజ్ఞలు దుష్టములైనవి. పాప మయము లైనవి. నేను సేనలోఁ జేరి సైనిక శిక్షణ పొంది మనుష్యులను హత్యచేయుటకు సిద్ధముగా నుండవలయునని వారి యాజ్ఞ. ఇది ప్రాత నిబంధనలోను గ్రొత్త నిబంధనలోను నిషేధింపఁ బడినను వారి యాజ్ఞ దానికి విరుద్ధముగా నున్నది. పైఁగా నిది నా యంతరాత్మకు విరుద్ధము. ఇంక మూఁడవ ప్రశ్నకు . . .

[కల్నలు గుమస్తాతోఁ గూడఁ బ్రవేశించును. జనరలు కర్నలు చేతితోఁ దన చేయి కలుపును.]

క: తమరు వాని స్టేటుమెంటును జదువుచున్నారా యేమి?

జన: వాని భాష క్షమింపరానిదిగా నున్నది. అ. సరే. ఏదీ చదువు.

ఉ: నేను న్యాయస్థానము ముందు ఇంత తీవ్రమైన శబ్దములు ప్రయోగించినందులకు జవాబిది. ఈశ్వర సేవ యను పేరుతో జరుగు మోసమును బహిరంగ పఱుప వలయునను నభిప్రాయముతో నేనా శబ్దముల నుపయోగించితిని. నేనీ యుద్దేశమును ఆమరణాంతము పాలింతును. మఱి యిందు కొఱకే . . .

జన: బాగు. ఈపాటి కింకఁ జాలు. ఇటువంటి యసందర్భపు ప్రేలాపనలను నాశనము చేసి తీరవలయును. లోకులలో ఇది వ్యాపింపకుండ వాఁడింకను ప్రేలకుండ మనము చేయవలెను. (కల్నలుతో) ఏమి మీరు వానితో మాటాడినారా?

క: నేనింత వఱకు వానితో మాటాడుచునే యున్నాను. ఇదిమంచి పని కాదని సిగ్గువచ్చునట్లు తెలిపి చూచితిని. దీనివల్ల వానికేమియు లాభము జరగదని కూడఁ జెప్పితిని. ఇంతే కాకుండా వాని బంధువుల గతి గూడ తెలిపితిని. అందుకతఁడు ఎంతో ఆవేదన పొందెను. కాని వాఁడు తన మాటమీఁదనే నిలఁబడి ఉన్నాఁడు.

జన: తమరు వానితో ఇంతగా మాటాడుట చాల విచారకరమైన సంగతి. మనము సైనికులము. మనకు వాదన కాదు చేయవలసినది. పని. (ఉద్యోగితో) వానిని తీసికొనిరా.

ఏపిసెలులో "నా సహోదరులారా! ముఖ్యమైన సంగతి యేదనగా ఆకాశము తోడనిగాని భూమి తోడనిగాని మఱి దేని తోడనిగాని యొట్టుపెట్టుకొనక మీరు తీర్పు పాలు గాకుండునట్లు అవునంటే అవునన్నట్టును కాదంటే కాదన్నట్లును ఉండవలెను" అని బైబిలులోనే మొదట స్పష్టముగా నొట్టుపెట్టుకొన రాదని ఉన్నది. నేను మనుష్యుల యాజ్ఞ ప్రకారము చేయుటకు ఒట్టుపెట్టుకొనలేను. క్రైస్తవుడనైన నేను నా యంతరాత్మ ననుసరించి యెల్లపుడును ఈశ్వరుని యిచ్ఛమీఁదనే నడువవలసి ఉన్నది. మఱి యిచ్ఛ యెప్పుడును మనుష్యుని యిచ్ఛ కనుకూలముగా నుండదు,...

జన: వాదన చేయుచున్నాఁడే. నా యధికారము చూపినప్పుడు వీని సంగతి బాగుగా తెలియును.

ఉ : "గవర్నమెంటు అను పేరుతోఁ బిలువఁబడు మనుష్యుల యాజ్ఞలు చేయుట కంగీకరింపను. ఎందువలననఁగా . . .

జన: ఏమి ఎంత పొగరు.

ఉ : "ఎందువలననఁగా వారి యాజ్ఞలు దుష్టములైనవి. పాపమయము లైనవి. నేను సేనలోఁ జేరి సైనిక శిక్షణ పొంది మనుష్యులను హత్యచేయుటకు సిద్ధముగా నుండవలయునని వారి యాజ్ఞ. ఇది ప్రాత నిబంధనలోను క్రొత్త నిబంధనలోను నిషేధింపఁ బడినను వారి యాజ్ఞ దానికి విరుద్ధముగా నున్నది. పైఁగా నిది నా యంతరాత్మకు విరుద్ధము. ఇంక మూఁడవ ప్రశ్నకు . . .

[కల్నలు గుమస్తాతోఁ గూడఁ బ్రవేశించును. జనరలు కర్నలు చేతితోఁ దన చేయి కలుపును.]

క: తమరు వాని స్టేటుమెంటును జదువుచున్నారా యేమి?

జన: వాని భాష క్షమింపరానిదిగా నున్నది. అ. సరే. ఏదీ చదువు.

ఉ: నేను న్యాయస్థానము ముందు ఇంత తీవ్రమైన శబ్దములు ప్రయోగించినందులకు జవాబిది. ఈశ్వరసేవ యను పేరుతో జరుగు మోసమును బహిరంగ పఱప వలయునను నభిప్రాయముతో నేనా శబ్దముల నుపయోగించితిని. నేనీ యుద్దేశమును ఆమరణాంతము పాలింతును. మఱి యిందు కొఱకే . . .

జన: బాగు. ఈపాంజికింకఁజాలు. ఇటువంటి యసంబద్ధపు ప్రేలాపనలను నాశనము చేసి తీరవలయును. లోకులలో ఇది వ్యాపింపకుండ వాఁడింకను ప్రేలకుండ మనము చేయవలెను. (కల్నలుతో) ఏమి మీరు వానితో మాటాడినారా?

క: నేనింత వఱకు వానితో మాటాడుచునే యున్నాను. ఇదిమంచి పని కాదని సిగ్గువచ్చునట్లు తెలిపి చూచితిని. దీనివల్ల వానికేమియు లాభము జరగదని కూడఁ జెప్పితిని. ఇంతే కాకుండా వాని నుంధువుల గతి గూడ తెలిపితిని. అందుకతఁడు ఎంతో ఆవేదన పొందెను. కాని వాఁడు తన మాటమీఁదనే నిలఁబడి ఉన్నాఁడు.

జన: తమరు వానితో ఇంతగా మాటాడుట చాల విచారకరమైన సంగతి. మనము సైనికులము. మనకు వాదన కాదు చేయవలసినది. పని. (ఉద్యోగితో) వానిని తీసికొనిరా.

[ఉద్యోగి గుమస్తాతో నిష్క్రమించును.]

జన: (కూర్చుండి) ఇదిగాదు కల్నలుగారూ! పద్ధతి. ఇటువంటి మనుష్యులతో ఇట్లు వ్యవహారము జరిపిన ఏమీ లాభము లేదు. కుళ్ళిపోయిన యవయవమును ఖండించివేయుటకు సంశయింపఁ గూడదు. తెగులుపట్టిన గొఱ్ఱె మందలో అంతట అంటురోగము ను వ్యాపింపఁజేయును. ఇటువంటి వ్యవహారములలో మర్యాద పనికిరాదు. వాఁడు జమీందారు కొడుకు. వానికి తల్లి, ప్రియురాలు ఉన్నారు. ఇవన్నియు మనకెందుకు? మన దగ్గఱ వాఁడొక సిపాయి యుంతే. మఱి మనము మన జారు చక్రవర్తి యధికారము నెఱవేర్చవలెను.

క: బహుశః మనము బోధించినందువల్ల వాఁడు దారిలోనికి వచ్చునని యనుకొన్నాను.

జ: బోధించినందువల్లనా? అబ్బే ఎన్నటికి రాఁడు దండము వల్లఁ గాని యిటువంటి వారు దారిలోనికి రారు. నాకిటువంటివారి యనుభవము చాల యున్నది. వాఁడు ఊరుపేరు లేని ఒక వస్తువని. ఒక నలుసని, బండి చక్రము క్రింద నలిగిపోవు రేణువని వాఁడు ఈ బండి నడకను ఆపలేఁడని వాని కనుభవమగు నట్లు చేయవలెను.

క: మంచిది. మనము ప్రయత్నించి చూతము.

జ: (విసుగుతో) ప్రయత్నించి చూడవలసిన దేమియు లేదు. నేను నలభై నాలుగేండ్లు జారుచక్రవర్తిగారి సేవలో గడిపితిని. నా ప్రాణములు సేవ కర్పించితిని. ఇప్పుడు అర్పించుచున్నాను. ఇప్పుడీకుఱ్ఱకుంక నాకు బోధించుటకు బయలుదేఱెనా. వాఁడే

ఫాదిరీ దగ్గఱనైన ఈ ధర్మోపన్యాసాలు ఇచ్చిన బాగుండును నా దగ్గఱ వాఁడొక సిపాయి. నామాట ప్రకారము చేయక పోయినచో వాఁడొక ఖైదీ.

[బోరిసు ప్రవేశించును. వానితోఁగూడ నిద్దఱు సిపాయిలుందురు. ఉద్యోగి గుమస్తా వెనుక వెనుక వచ్చుచుందురు.]

జన: (వ్రేలితోఁ జూపి) వీనినిక్కడ నిలుచుండఁ బెట్టుడు.

బో: నేనెక్కడను గూడ నిలుచుండ నవసరము లేదు. నాయిష్టము వచ్చినచోట నేను నిలుచుందును. లేనిచోఁ గూరుచుందును. నేను మీ యాజ్ఞ ప్రకారము నడువవలసిన పనిలేదు.

జన: నోరు మూయుము. ఎందుకు నడవవో చూచెదనులే. ఇదిగో ఇప్పుడే నడచునట్లు చేయుదును. చూడుఁడు.

బో: (ఒక పీఁటమీఁదఁ గూర్చుండును) మీరింత గట్టిగా నఱచుట ఎంత యనుచితము.

జన: వీనిని లేవఁదీసి నిలుచుండఁ బెట్టుడు.

[సిపాయిలు నిలుచుండఁ బెట్టుదురు.]

బో: ఆ అవును. ఇట్లు మీరు చేయఁగలరు. మీరు నన్నుఁ జంపఁ గలరు గూడ. కాని మీరు నన్నొప్పించలేరు.

జన: నోరు మూయుము. ఒకసారి చెప్పిన తెలియదూ. నేను జెప్పునదేమిటో వినుము.

బో: నేను వినఁదలఁచుకొనలేదు.

జన: వీఁడు పిచ్చివాఁడు. ఆసుపత్రికిఁ బంపి వీనిని పరీక్ష చేయింపవలెను.

క : వీనిని జెండరుమీసు గారి కార్యాలయమునకుఁ బంపుటకాజ్ఞ యయినది.

జన: మంచిది. అక్కడకే పంపవలెను. అయితే మఱి వీనికి సిపాయి దుస్తులు తొడిగి మఱి పంపుఁడు.

క : వీఁడు తొగుడుకొనుటలేదు. మొఁడిపట్టు పట్టుచున్నాఁడు.

జన: వీనిని బంధింపుఁడు (బోరీసుతో) నేను చెప్పుసంగతి వినవయ్యా. నీకెటువంటి గతి పట్టినను నాకు లెక్కలేదు. కొంచెము ఆలో చించి తెలిసికో. నీ మనచికోసమే చెప్పుచున్నాను. నీవు కొట్టులోఁ గుళ్ళుచుండుట తక్క మఱెవరికిఁ గొంచెము గూడ లాభము గలిగించలేవు. ఇంక ఇటువంటి మాటలు గట్టిపెట్టుము. నీవు కోపపడి మాటాడితివిగాన నాకును గోపము వచ్చినది. (బుజము మీద చేయివేసితట్టి) వెళ్లు. మఱి వెళ్ళి ప్రమాణము చేయుము. ఇటువంటి యసంగత వాక్యములను గట్టిపెట్టుము. (ఉద్యోగితో) ఏమి ఫాదిరీగారిక్కడ నున్నారా? (బోరిసుతో) ఏమి ఏమందువు. (బోరిసు మాటాడఁడు.) ఏమి జవాబు చెప్ప వేమి? నీవు నేను చెప్పినట్లు చేయుట మంచిది. నీవు కొరడాతో కట్టి విల్లుగఁగొట్టలేవు. అవన్నె లోపలఁబెట్టుకొని ఏదోవిధముగా కాలము గడుపుకొనుము. మేము నీపైని బలము ప్రయోగింప వలసిన పని యుండదు. ఏమి?

బో: నేను జెప్పవలసినది యిదివఱకే చెప్పితిని. నేనిపుడు చెప్పవలసిన దేమియు లేదు.

జన: చూడుఁడు, బైబిలులో ఇవి యన్నియు నున్నవని యందువుగదా యవి యన్నియు ఫాథెరిగారితో మాటాడిన పిదప నిర్ణయము

చేసికొనుము. నమస్కారము. జారుచక్రవర్తి సేవలోఁ జేరిన పిదప నిన్ను మెచ్చుకొందును. (ఉద్యోగితో) పాదిరీగారిని ఇట్లు పిలుచుకొనిరా.

( జనరలు నిష్క్రమించును. వెంటనే కల్నలు ఉద్యోగి వెళ్ళుదురు.)

బో : (గుమాస్తాతోను, సిపాయిలతోను) చూడుఁడు. వారు మోసగించుచున్నారో మిమ్మెట్లు. వారికి మిమ్ము మోసగించుచున్నట్లు తెలియను వారి మాట వినకుఁడు, మీ తుపాకులు పాఱవేసి, నౌకరి వదలి వెళ్ళిపోవుఁడు బహుశః వారు మిమ్ము కొరడాలతో గొట్టవచ్చును. ఈ దెబ్బలు తినుట ఈ మోసగాండ్ర నౌకరికంటె యెట్లయినను మంచిదే.

గు : బాగుగానే యున్నది, సేవ లేనిచోట పని జరుగుట యెట్లు ? ఇది మాత్రము అసంభవము.

బో : ఇది యాలోచించుట మన పని కాదు. ఈశ్వరుని యాజ్ఞ ఏదో మనచేత నేమి చేయింపఁ దలచినాఁడో యది యొక్కటే మనము చూడవలసిన పని.

1వ సి: బైబిలులో యీ సంగతిని గూర్చి యేమియు లేదు. ఇదంతయు వీరి కల్పనయే.

(గుమాస్తాతో జెండరమీ ఆఫీసర్ ప్రవేశించును )

జెం : ఏమి ? బోరిసు అను క్రొత్త సైనికుఁ డిక్కడ ఉన్నాఁడా ?

గు : అవునండి. ఇక్కడే యున్నాఁడు.

జెం : దయయుంచి యిక్లే తీసుకొనిరండు. (బోరిసును జూచి) ప్రమాణము చేయుటకు ఒప్పుకొనకుండనున్న జమీందారుగారి యబ్బాయిగారు బోరిసుగారు మీరేనా ?

బో : అవును. నేనే.

జెం ; (కూరుచుండి, బోరిసును గూరుచుండ సంజ్ఞ చేయును.) దయ యుంచి కూర్చుండుడు.

బో : మన సంభాషణ బొత్తిగా నిరుపయోగమని యనుకొనుచున్నాను.

జెం : నేను మాత్రమట్లు అనుకొనను అందులో మీ విషయములో నా మీరు సేనలో పనిచేయుటకు అంగీకరించక పోవుటచేత మీరు విప్లవకారులేమో యని సందేహముగా నున్నది. నేనీ సంగతి పరిశీలింపవలెనని యనుకొనుచున్నాను. ఇదే గనుక నిజమయిన మిమ్ము నౌకరినుండి తప్పించి, మీరు తిరుగుబాటు చేయు చున్నందువల్ల మీకు ఖయిదో, ద్వీపాంతరవాసమో యేర్పాటు చేయవలసి వచ్చును. మరి యిది నిజముకాని పక్షమున సైనిక శాఖా నిబంధన క్రింద మీరు నడవ వలసినదే. చూడుడు. నేను మీతో స్నేహదున్నట్లు సాపుగా మాటాడుచున్నాను. మీరు గూడ నా దగ్గర అట్లే యుందురని యాశించుచున్నాను.

బో : మొదట ఇటువంటి సైనిక వేషములతో నుండువారిని నమ్మ లేను. మరి మీ వ్యవహార మిటులున్నది. నేను మిమ్ము యెటుల గౌరవింపగలను ? మీ సంగతి చాలా యసభ్యముగా నున్నది.

గాని మీ ప్రశ్నలకు జవాబు చెప్పుటకు నిరాకరించను. మీరే మడుగ దలంచినారో యడుగుండు.

జెం : మొదట మీ పేరు, వృత్తి, మతము చెప్పుండు.

బో : మీ కిది యంతయుం దెలిసియే యున్నపుడు నేను జవాబీయ నవసరము లేదు. ఆ. ఆ. అవును. వానిలో ఒక్క ప్రశ్న మాత్రం ముఖ్యమైనది. నేను మూఢవిశ్వాసముగల క్రైస్తవుండను మాత్రము గాదు.

జెం : అయితే – మీ మత మేమిటి ?

బో : నేను దానికేమియుం బేరు పెట్టలేదు.

జెం : ఓహూ ! మళ్ళీ ఇదే....

బో : సరే మంచిది. యయితే కొండమీంద ఏసుప్రభువు చేసిన యుప దేశము ననుసరించిన క్రైస్తవ మతము.

జెం : వ్రాయుము (గుమాస్తా వ్రాయుచున్నాండు) తమకే జాతితో ఏ రాష్ట్రముతో సంబంధ మున్నది ?

బో : నా కెవరితోను సంబంధము లేదు. నేనొక మనుష్యుండను. కేవల మీశ్వర సేవకుండనని మాత్రమనుకొనుచున్నాను.

జెం : మీరు రష్యాదేశ పౌరులని యెందువలన అంగీకరింపరు ?

బో : నేనే దేశములను ఒప్పుకొనను.

జెం : ఒప్పుకొనక పోవుటలో మీ ఉద్దేశ్యమేమి ? ఏమి మీరు దానిని నాశనము చేయం దలచుచున్నారా ?

బో : విస్సందేహముగా. దానిని నేను నాశనము చేయఁదలఁచు చున్నాను. ఇందుకే ప్రయత్నించుచున్నాను.

జెం : (గుమాస్తాతో) దీనినిగూడ వ్రాయుము.

(బోరిసుతో)మీ ప్రయత్నము లెటువంటివి ?

బో : నేను మోసగాండ్రు, ధూర్తులు చేయు చెడ్డను బయటపెట్టి, సత్యప్రచారము చేయుదును. "వీరి మోసములోఁ జిక్కుకోన వద్దు" అని మీరు వచ్చినప్పటికీ ఈ సిఫాయిలకు బోధించు చున్నాను.

జెం : కాని బోధించుట గుట్టు బయటపెట్టుట ఇంతేనా, ఇంకేమైన నుపాయములలో జోక్యము గలుగఁ జేసికొనుటలో నిష్టము న్నదా ?

బో : లేదు. పైఁగా అన్ని విధములైన దౌర్జన్య కృత్యములు పాప ములని నా ఉద్దేశ్యము, మఱి కేవలము హింస, దౌర్జన్యము మాత్రమే గాదు. అన్ని విధములైన రహస్య కార్యములను, ధూర్తత్వములను...

జెం : దీనిని వ్రాయుము, మంచిది. మీరు ఎవరెవరి నెఱుఁగుదురో చెప్పుఁడు. తమకు ఆయివకెంకోతో పరిచయమున్నదా ?

బో : లేదు.

జెం : 'క్లిను'తోనో.

బో : పేరు విన్నానుగాని ఎప్పుడు అతనిని గలసికొనలేదు,

[ఫాదిరీ ప్రవేశించును ముసలివాఁడు మెడలో క్రాసు, చేతిలో బైబిలు ఉన్నవి. గుమాస్తా వాని దగ్గరకు వెళ్ళి ఆశీర్వాదము గైకొను చున్నాఁడు.]

జెం : మంచిది. ఇంతమాత్రము చాలు. మీరు అపాయకరమైన వారు గారని యనుకొనుచున్నాను. మరి మీరు శాసనవిభాగములోనికి రారు. మీరు శీఘ్రముగా విడుదల పొందుదురుగాక యని కోరు చున్నాను. మంచిది నమస్కారము.

(చేయిచేయి కలుపును.)

బో : మీతో నొకమాట చెప్పవలయునని యున్నది. క్షమింతురుగాక. నేను జెప్పకుండ నుండలేను. తమరు ఇట్టి దుష్టమైన, క్రూర మైన వృత్తిని ఎందుకు కోరుకొని తెచ్చుకొన్నారు? దీనిని మీరు విడిచిపెట్ట వలయునని సలహా యిచ్చుచున్నానూ.

జెం : (నవ్వుచు) తమ దయకు కృతజ్ఞుడను. ఈ విషయముతో మీ తో నేకీభవించను. నమస్కారము. (ఫాదిరీతో) ఫాదిరీగారూ! దయచేసి నా స్థానము మీరు అలంకరించుఁడు.

(గుమాస్తాతోఁగూడ నిష్క్రమించును.)

ఫా : క్రైస్తవ ధర్మమును పాలింపకుండ జారు చక్రవర్తికి మాతృ భూమికి సేపచేయ నిరాకరించుచు అధికారుల కెందుకింత కోపము గలిగించుచున్నావు?

బో : (నవ్వుచు) నేను క్రైస్తవునిగా నా కర్తవ్యమును పాలింపఁ దలఁచితినిగాన నేను సైనికుఁడను గాఁదలఁచుకొనలేదు.

ఫా : ఏమి, ఎందుకు కాదలఁచుకొనలేదు. "స్నేహితుని కొరకై తన ప్రాణము ఇచ్చివేయవలెను" అని మన మతగ్రంథములో వ్రాయబడి యున్నది గదా. ఇదే గదా నిజమైన క్రైస్తవ ధర్మము.

బో : ఆ. అవును. తన ప్రాణమును ఇచ్చివేయ వలెనేగాని ఇతరుల ప్రాణముల తీసివేయరాదు. మంచిది, ఇదే నేను చేయవలయు ననుకొనుచున్నాను. ప్రాణములను ఇచ్చివేయుటకుఁ గూడ స్థిరముగా నున్నాను.

ఫా : ఓ పడుచువాఁడా! నీవు చెప్పునది సరియైనది గాదు. జాన్ సిపాయీలతో నిట్లు చెప్పెను....

బో : (నవ్వుచు) దీనివలన "ఆ రోజులలో గూడ సిపాయిలు దోపిడి చేయుచుండిరని మాత్రము స్థిరమగుచున్నది. కనుకనే జాను వారినిట్లు చేయవలదని నిషేధించెను.

ఫా : సరే కాని నీవు ప్రమాణము ఎందుకు చేయవు?

బో : బైబిలులోఁ బ్రమాణము చేయవలదని నిషేధింపఁబడినట్లు మీకు తెలియునుగదా!

ఫా : అట్లే అది కాదు. ఒకసారి పైలటు ఏసుప్రభువును ఒట్టు పెట్టించి "నీవు నిజముగా ఏసుప్రభువువేనా?" అని యడిగెను. "ఆ. అవును. నేను ఏసుప్రభువునే" అని యతఁడు జవాబిచ్చెను.

ఇందువల్ల ప్రమాణము చేయుట నిషేధింపబడ లేదనుట స్పష్ట మగుట లేదూ !

బో: మీరు పెద్దవారై యుండికూడ నిటువంటి మాటలాడుటకు సిగ్గు వచ్చుటలేదా !

పా.: నేను చెప్పినదివిను. పట్టుపట్టకు. నీవును, నేనును ప్రపంచమును మార్చలేము. ప్రమాణముచేసి సుఖముగానుండు. పాపమనునది దేనిలో నున్నదో, దేనిలో లేదో ఆ సంగతి చర్చకే వదిలి పెట్టు.

బో: అది మీకు వదిలిపెట్టనా ? ఈ పాపభారమంత మోయుటకు మీకు భయము వేయుట లేదా ?

పా: ఏ పాపము ! చిన్నప్పటినుండి ధర్మముపైని శ్రద్ధ చూపుచునే యుంటిని. ముప్పయి యేండ్ల నుండి యీ పాదరీపని చేయుచున్నాను. ఇందువల్ల నన్నే పాపమూ అంటుకోదు.

బో: ఇంతమందిని మోసపుచ్చిన పాపము ఎవరి కంటుకొనును ! (సిపాయిలవైపు చూచి) పాప మీయమాయకుల కేమి తెలియదు గదా !

పా: ఓ యువకుడా ! నీవు, నేనుగూడ ఈ సంగతిని నిర్ణయింపలేము. మనకంటె పెద్దవారి యాజ్ఞ పాలించుట యొక్కటె మన పని.

బో: నన్ను ఒంటరిగా నుండనీయుఁడు. నిన్ను జూడఁగా నాకు దుఃఖము గలుగుచున్నది. ఈ జనరలు సభలో మీరున్నచో

మతిభ్రమియు బాధలేదుగాని. మెడలో క్రాసు ధరించి, బైబిలు పట్టుకొని ఏసుప్రభువు పేరు చాటుచు ఏసుప్రభువు యొక్క యుపదేశములకు విరుద్ధముగా నన్ను నడపఁదలఁచుచున్నారా? వెళ్లుఁడు (ఆవేశముతో) తొలఁగిపొండు. నా దగ్గఱనుండి వెడలిపొండు. సిపాయులారా! నే నెవరినిగూడఁ గలసికొన కుండ నన్నుఁ గొట్టులో బంధించి వేయుఁడు. నేనలసిపోతిని.

పా: సరే. అయితే నేను వెళ్ళుదును. నమస్కారము.

(కార్యదర్శి ప్రవేశించును.)

కార్యదర్శి: మంచిది.

పా: వానిది పెంకిపట్టు. పట్టిన పట్టు వీడుటలేదు.

కా: అయితే వాఁడు ప్రమాణము చేయుటకు, నౌకరి చేయుటకు ఒప్పుకొననేలేదా?

పా: వాఁడే విధముగాను ఒప్పుకోఁడు.

కా: అయితే వానిని ఇంక ఆసుపత్రికి పంపవలసియుండును.

పా: అయితే వాఁడు రోగియని యనవచ్చును. అవును. నిస్సంశయముగా. ఇదే మంచిది. లేనిచో వాని ననుసరించి యితరులు గూడ మోసపోవుదురు.

కా: వీనిని మెదడు పాడైపోయిన వారితోపాటు ఉంచి, చికిత్స చేయవలయునని యార్డరయినది.

పా: బాగున్నది. నమస్కారము. సెలవు.

(వెళ్ళిపోవును.)

కా : (బోరిసు దగ్గరకు వెళ్ళి) రండి. మిమ్ముఁ దీసికొనిపోవ నాకు ఆర్డరు...

బో : ఎక్కడకు ?

కా : తమరు శాంతముగా నుండి బాగుగా ఆలోచించుకొను శక్తి వచ్చువఱకు. మొదట ఆసుపత్రిలో.

బో : నేను ఆలోచింపవలసిన దంతయు ఇదివఱకే యాలోచించు కొన్నాను. కాని, రండు వెళ్ళుదము.

[నిష్క్రమింతురు.]

(ఇది రెండవ దృశ్యము)

( మూఁడవ దృశ్యము )

[ఆసుపత్రిలో ఒక గది. పెద్దడాక్టరు, చిన్నడాక్టరు [illegible]రు. ఒక ఉద్యోగి రోగిమంచము మీఁదఁ గూరు[illegible]డియుండును. వార్డరు పోలీసు దుస్తులతో నిలుచుండి యుండును.]

రోగి: మీరు నాకేమాత్రము సుఖము లేకుండ నన్నుఁ బాధుచేయు చున్నారని చెప్పుచున్నాను. నా కిదివఱకే చాలాసార్లు ఆరోగ్యము గలిగినది.

డాక్టరు: చూడండి. మీరావేశము పొందఁగూడదు. మీరు ఆసుపత్రి నుండి విడుదలగుటకు నేను సంతోషముతో అనుజ్ఞ యిచ్చి యుందును. కాని మీకు మిమ్ము స్వేచ్ఛగా వదలిపెట్టుట అపాయకరమని మీయందట మీరే యెఱుఁగుదురు గదా నాకు నమ్మకము గలిగినప్పుడు చూతములే!

రో: నేను మఱల త్రాగుడు మొదలుపెట్టుదునవి మీరనుకొనుచు న్నారు కాఁబోలు! అట్టే యింక త్రాగను. నేను పూర్తిగా యుపదేశము పొందితిని. ఇక్కడ గడుపురోజులు నాకు బాధా కరములుగా నున్నవి. (ఆవేశముతో) మీ కర్తవ్యమునకు విరుద్ధముగా మీరు ప్రవర్తించుచున్నారు. మీ కిదే బాగున్నది కాఁబోలు!

డా: మీరు స్వతంత్రులుగాన మీకు వాదనుచేయుట సులువు. పిచ్చి వారి మధ్య నిర్బంధముగానుంచు చున్నపుడు మేమేమి చేయ

గలము! (వార్డరుతో) మీరేమి చేయుచున్నారు. వెళ్లి పొండి ఇక్కడినుండి

డా: మీరు కొంచెము శాంతముగా నుండవలయునని ప్రార్థన.

రోగి: కాని తమరు నన్ను విడుదల చేయింపుడని మిమ్ము ప్రార్థించుచున్నాను. బ్రతిమాలుకొనుచున్నాను.

[అటుచుచు డాక్టరుమీదకి దుముకుచున్నాడు [illegible] వార్డర్లు పట్టుకొందురు. పోరాటమగును. పిదప వానిని [illegible] అవతలకు తీసుకొనిపోవుదురు.]

చిన్నడాక్టర్: ఇదిగో చూచితిరా రోగి ప్రారంభ[illegible]ది. ఇప్పుడు వాడు మీ మీదకుగూడ [illegible]కివచ్చును.

పె.డా: మత్తు ప్రభావము అది. కొంచెము అభివృద్ధి మాత్రము గలిగినది.

(కార్యదర్శి ప్రవేశించును)

కా: సుఖముగా నున్నారా?

పె.డా: నమస్కారము.

కా: నేను ఒక జమీందారుగారుగారి కుమారుని [illegible] అను తెలివి గల మనుష్యుని తమ [illegible] తీసుకొని వచ్చుచున్నాను. అతడు సేనలో చేరినాడు. కాని మతి [illegible]ణములవల్ల సైనిక సేవ చేయుటకొప్పుకో[illegible] లేదు. అందుకు [illegible] మీకు గారు మీ దగ్గఱకు పంపినారు. రాజకీయ కుట్రలతో సంబంధము

లేకపోవుటవల్ల మీ శాసనవిభాగములోనికి రాగలఁడని యాయ నన్నారు. ఫాదిరీగారు బోధించినారు గాని అది యంతయు వ్యర్థమై పోయినది.

పెద్దడాక్టరు : మఱి యటువైని మామూలు ప్రకారము వానిని ఇక్కడకు తీసుకొని రండు. ఇది యన్ని ఫిర్యాదులకు హైకోర్టు అని మీరు తలఁచుచున్నారు గాదుమరి! మంచిది- తీసుకొని రండు.

(చిన్నడాక్టరు నిష్క్రమించును.)

కా : వాఁడు ఉన్నతవిద్య పొందినవాఁడని వానికి ఒక ధనికురాలైన బాలికతో వివాహము కావలసి యున్నదని అనుకొనుచున్నారు ఇది చాలా వింత సంగతి. ఈ చోటు నిజముగా వానికి తగిన స్థలమని యనుకొనుచున్నాను.

పె.డా : అవును, వానికేదో పెంకిపిచ్చి పట్టియుండును,

(బోరిసును లోనికిఁ దీసికొని వచ్చుచున్నాఁడు.)

పె.డా : రండు. ఇట్లు రండు. దయయుంచి కూరుచుండుఁడు. మేము మీతోఁ గొంచెము మాటాడవలసి యున్నది.

(కార్యదర్శి వెళ్లును.)

బో : తమరు నన్నెక్కడనైన బంధింపవలసి యున్నచో దయయుంచి త్వరగా నన్ను బంధింపుఁడని కోరుచున్నాను. అప్పుడు నాకు కొంత విశ్రాంతియైనను దొరకఁగలదు,

పె.డా : క్షమింతురుగాక. మేము కొన్ని నియమములను పాటింప వలసియున్నది. ఏవో కొన్ని ప్రశ్నలు మాత్రమే యడుగుదును మీ శరీరంలోనున్న బాధ యేమిటి? మీకెట్లున్నది?

బో : నాకే రోగము లేదు నేను పూర్తిగా ఆరోగ్యముగానే యున్నాను.

పె.డా : కాని తమరు అందరివలె ప్రవర్తించుటలేదు.

బో : నేను నా యాత్మయొక్క యాజ్ఞ ననుసరించి నడుచుచున్నాను.

పె.డా : చూడండి. తమరు సేనలో పనిచేయుట కెందుకు అంగీకరించలేదు. ఏ కారణముచేత ఇట్లు చేయుచున్నారు.

బో : నేను క్రైస్తవుడను గాన నేను హత్యచేయలేను.

పె.డా ; కాని శత్రువుల నుండి మన దేశమును రక్షించుకొనుట ప్రతి మనుష్యుని కర్తవ్యము గదా! చెడ్డగా నడచి, సాంఘిక నియమముల నుల్లంఘించువారిని అణచుట యవసరము కాదామరి!

బో : ఇప్పుడెవరును మన దేశమును ఆక్రమించుట లేదే! ఈ ఖయిదులలోపడి బాధలు పొందువారి కంటె రాజోద్యోగులే ఎక్కువగా సాంఘిక నియమములను పాడుచేయుచున్నారు.

పె డా : అయితే తమ యుద్దేశమేమి?

బో : నా యుద్దేశమా? చెడ్డలన్నిటికి త్రాగుడే మూలము. దానిని స్వయముగా గవర్నమెంటు అమ్మించుచున్నది. అబద్ధమైన,

అన్యాయమైన మతమును గవర్నమెంటువారే ప్రచారము చేయుచున్నారు. నాచే చేయింపఁ దలచిన ఈ నైతిక దాస్యము లోకులను నీతీ భ్రష్టులను, పతితులను జేయు ఈ సైనిక దాస్యము గవర్నమెంటు వారి చేతులలోనే యున్నది

పె.డా: అయితే మీ యుద్దేశ్యములో గవర్నమెంటు పరిపాలన అనావశ్యక మన్నమాట.

బో: ఇది మాత్రము నాకుఁ దెలియదు. కాని యే విధమైన దుష్టత్వములోను బాల్గొనరాదను సంగతి మాత్రము బాగుగా తెలియును.

పె.డా: అయితే ప్రపంచము యొక్క స్థితి యేమగును? మనము దుష్టత్వముతోఁ బనిచేయుటకు కాదా మన కీశ్వరుఁడు బుద్ధి నిచ్చినది!

బో: సాంఘిక నియమములు హింసతో కాక మంచితనము (అహింస) తోనే [illegible]ంపవలయునని తెలిసికొనుటకే కూడ ఈశ్వరుఁడు మనకు బుద్ధియిచ్చి యున్నాఁడు. మరి యిందువల్లనే మను ష్యుఁడు ఏ విధమైన దుష్టత్వములో నైనను బాల్గొనుటకుఁ దిరస్కరించుట ఏ విధముగనైనను అపాయకరము కాదు.

పె.డా: మంచిది. ఏదె కొంచెము నన్ను పరీక్షచేయ నీయుఁడు. తమరు దయచేసి [illegible] యొక మాట పరుండఁగలరా?

(అ[illegible]ట్టుకొని) ఇక్కడ నొప్పిలేదు గదా?

బో: లేదు.

పె.డా : మరి ఇక్కడనో ?

బో : అబ్బే. లేదు.

పె.డా : కొంచెము గట్టిగా ఊపిరి తీయుండు ఇప్పుడు కొంచెము ఊపిరి సాపుగా విడువుండు. నాయనుధేయతను మన్నింపవలెను. (ఒక్క చేపు తీసుకొని నుదురు, ముక్కు కొలుచుచున్నాండు.) ఇప్పుడు దయయుంచి తమరు కన్నులు మూసి నడువుండు.

బో : ఇది యంతయుం జేయుటకు మీకు సిగ్గు గలుగుటలేదూ ?

పె.డా : తమ యభిప్రాయమేమి ?

బో : ఇది యంతయు అసంగతమైనది. నేను బాగుగ ఆరోగ్యము గలవాండనని, నేను వారి దుష్కర్మలలో నైక్యమగుట కంగీకరించక పోవుటచే నిక్కడకుం బంపబడితినని, పైంగా నేను జెప్పినదంతయు సత్యమగుటచే దానికి వారు జవాబుచెప్పలేక నేను పిచ్చివాండనని మిష పెట్టి లోపలను వంచించుచున్నారని మీకు తెలియునె తెలియునుగదా. ఇదంతా తెలిసికూడా మీరు యీ యసంగతమైన విషయములకు సహాయపడుచున్నారు. ఇది మిగుల అసహ్యకరము, సిగ్గుగాదా. ఇట్లు మీరు చేయంగూడదు.

పె.డా : అయితే తమరు సరిగా నడపందలంచుటలేదా ?

బో : లేదు నన్నేమి చేసినను మీ యిష్టము వచ్చినట్లు నిర్బంధింపుండు. కాని నేను స్వయముగా నేమియుం జేయను. (వేగముగా) నన్నొంటిగానుండ నీయుండు.

(డాక్టరు గంట ప్రయోగించును. ఇద్దరు వార్డర్లు వచ్చుచున్నారు.)

పె.డా: ఆవేశము చెందకుండు తమరు అలసినట్లున్నారు. మీరు మీ వార్డులోనికి వెళ్ళెదరా!

(చిన్న డాక్టరు ప్రవేశించును.)

చి.డా: ఈ చిన్న జమీందారును గలిసికొనుట కెవరో కొందఱు వచ్చుచున్నారు,

బో: వారెవరు!

చి.డా: వారు నికోలసుగారు, వారి కూఁతురును.

బో: వారిని జూచుట నాకెంతో ఇష్టము.

పె.డా: కలిసికొనుట కేమియుఁ గారణముండకపోదు. వారిని లోనికి బిలువుము. తమవారిని ఇక్కడనే చూడవచ్చును.

(పెద్దడాక్టరు నిష్క్రమించును. వెనుక వెనుకనే చిన్నడాక్టరు, వార్డర్లు వెళ్ళుచున్నారు నికోలసు ల్యూబా ప్రవేశింతురు. జమీందారిణి తలుపుదగ్గర నుండి తొంగిచూచి "మీరు నడువుఁడు. నేను తరువాత వచ్చెదను" అనుచున్నది.)

ల్యూ: (తిన్నగా బోరిసు దగ్గరకు వెళ్ళి వాని తలను తన చేతులతోఁ దడుముచు ముద్దు పెట్టుకొనుచున్నది.) ఓ యభాగ్యుఁడైన బోరిసూ!

బో : నీవు నా కోసము విచారింపకుము. నాకు చాలా యానందము గాను, కులాసాగాను ఉన్నది. మీరెటులున్నారు ! (నికోలసు చేయి ముద్దుపెట్టుకొను చున్నాఁడు.)

నికో : నేను నీకు ముఖ్యముగా నొక సంగతి చెప్పుటకు వచ్చితిని. అన్నిటికంటెు మొదటి సంగతి యిది. ఇటువంటి విషయములలో హద్దుమీరి ప్రవర్తించుట శక్తికొలఁది చేయకపోవుట కంటెఁ గూడఁ జాల చెడ్డది. ఈ విషయము నీవు బైబిలులో వ్రాయఁబడినట్లే నీవు ప్రవర్తింప వలెను. "నే నిది చెప్పుదును, ఇట్లు చేయుదును" అని యీా విధముగా మొదటి నుండి నిన్ను రక్షించుకొనుటకు ఆలోచింపకుము. ఒకవేళ వారు నిన్ను ఖయిదులో వేసినచో ఏమి మాట్లాడవలయునో, ఎట్లు ప్రవర్తింప వలయునో అని ముందుగా నీవాలోచింపకుము. ఏలయనఁగా ఇటువంటి సమయములో మాటాడునది నీవు గాదు. నీ స్వర్గీయ పితయొక్క యాత్మయే నీలోనుండి మాట్లాడును. నేను ఈ పని చేయుటకు బాగుగా ఆలోచించి, విమర్శించి నిశ్చయించుకొంటినను కారణముచే మాత్ర మేపనిని చేయకుము. ఎప్పుడు నీ యంతఃకరణము—నీ యాత్మ ఆ పని చేయుటకు ప్రోత్సాహ పఱచునో ఆ పని చేయకుండ నుండలేవని నీ కెప్పుడు విదితమగునో యప్పుడే యా పని చేయుము.

బో : నేనట్లే చేసితిని. నేను నౌకరీచేయ నిరాకరింతునని. యనుకొన్నయిన అనుకొనలేదు. కాని, యీా మోసములను. పోలీసుల కపట న్యాయములను అధికారుల నిరంకుశత్వమును జూచినప్పుడు నాకుతోఁచినది చెప్పకుండ నుండలేక పోతిని. మొద

నాకు పరమసుఖకారకమని గాని, మీరు అనెడు యెంతో సామాన్య విషయమై, ఆనందముతో నిండిపోయినదై యయిపోయినది.

(బ్యాకా నేలమీఁద గూలబడి యేడ్చుచున్నది.)

నికో: అన్నిటికంటె ముఖ్యమైన విషయమేమనఁగా, ప్రకాశకోపము, లోపల మున్నకోపము ఏ పనియును చేయవద్దు. ఈ మట్టుకు నేను సరిగా నున్నదున్నట్టు చెప్పుచున్నాను. ఒకవేళ నీవు ఇప్పుడు ప్రమాణము చేసి, నాకడకుఁ బ్రవేశించి నప్పటికిని నేను మొదటికంటెఁ దక్కువగాఁ గాదు. సరిగదా పైఁగా నెక్కువ ప్రేమతో, ఎక్కువ యాదరముతోఁ నిన్ను జూతును. బాహ్యజగత్తులో జరుగుచుండు మహత్త్వపూర్ణమైనది గాదు ఏది యాత్మలోపల జ్యోతిర్మయమై ప్రకాశించుచుండునో మహత్త్వమనఁగా దానిదే.

బో: నిస్సంశయముగా. అందువల్లనే యాత్మలో సంభవించినది బాహ్యజగత్తులోఁ దప్పక పరివర్తనము గలుగఁజేయును.

నికో: నేను జెప్పవలసినది నేను చెప్పితిని. నీ తల్లి వచ్చినది. ఆమె చాలా దుఃఖించుచున్నది. నీవు చేయఁగలిగినచో నామె చెప్పునది చేయుము. మంచిది. ఇదే నీకుఁ జెప్పఁదలఁచుకొన్న సంగతి.

(తెరలో రోదన ధ్వని. ఒక పిచ్చివాఁడు లోనికిఁ బ్రవేశించుచున్నాఁడు. వార్డరులు వానిని బట్టుకొని తీసుకొని పోవుచున్నారు.)

బ్యా: ఎంత భయంకరమైన స్థలము. నీవు యిక్కడే యుండవలసి వచ్చునా? (ఏడ్చుచున్నది.)

బో : నాకీ విషయమై భయము లేదు. నిజ మడిగినచో ఇప్పుడు నా కెందుకును గూడ భయమేమి లేదు కాని యీ విషయములో నీవేమనుకొందువో యని భయపడుచున్నాను. ఈ విషయములో నాకు సహాయము చేయుము. తప్పక నీవట్లు చేయుదువని నమ్ముచున్నాను.

ల్యూ: ఇదంతయు జూచుచు నే నానందింపఁగలనా ?

నికో : ఆనందింపలేము. ఆనందము గలుగుట యసంభవం. నేను స్వయముగా నానందింపలేను. ఈ విషయములో నాకు బాధగానే యున్నది, అయినను ఆ స్థానములో నే నుండుటకు నేను స్థిరముగా నున్నాను. దీనిలో దుఃఖమున్నప్పటికిని అందులో మంచి యున్నదని యనుకొనుచున్నాను.

ల్యూ: అది మంచిదే కావచ్చును. కాని వారు వీనిని ఎప్పుడు విడుదల చేయుదురో !

బో : ఈ సంగతి ఎవరు చెప్పగలరు ? నాకు భవిష్యత్తును గూర్చి యాలోచనే లేదు. వర్తమానమే ఎక్కువ సుఖదాయకమైనది. మఱి నీవు దానిని ఇంకను సుఖదాయకముగాఁ జేయఁగలవు...

(తల్లి జమిందారిణి ప్రవేశించును.)

చేర : నే నింక ఎక్కువసేపు ఉండలేను.

నికో : ఏమి మీరు వానికి బోధ చేసినారా ? వాఁడు ఒప్పుకొనెనా ? బోరిసూ ! నా బిడ్డా ! కొంచెము నావైపుచూఁడు. నా బాధ

నీవు తెలిసికొనలేవు. నా మీఁద దయచూపు. ముప్పై ఏండ్ల నుండి నీ కోసమే నేను జీవించుచున్నాను. నిన్నింత వానినిగా జేసితిని. నా యేర్పాటులన్ని ముగియుట తోడనే నీ విట్లు మమకారము లేకుండా అందఱను విడిచిపెట్టుచున్నావు. నీకు ఖయిదా? ఎంత యమర్యాద. ఓరీ వద్దురాబాబూ!

బో: అమ్మా! నా మాట కొంచెము విను.

చేర: (నికోలసుతో) మీరు వానికేమీ చెప్పరేమి? మీరే వానిని పాడుచేసితిరి. మీరే వీనికి బోధింపుఁడు. అవును. ఇదంతయు మీకు బాగుగానే యుండును. ల్యూబా! కొంచెము నీవు చెప్పి చూఁడు. వీనికి బోధించు.

ల్యూ: నేనేమియుఁ జెప్పలేక పోవుచుంటిని.

బో: విను. అమ్మా! బొత్తిగా అసంభవమైన సంగతులు గూడా ప్రపంచములో నున్నవని తెలుసుకో. నేను సైనిక దాస్యము చేయలేను.

చేర: నీవు చేయలేవని యనుకొనుచున్నావా? ఇదంతయు అసంగతము. అందఱు సైనిక సేవ చేసినవారే. ఇప్పుడు కూడఁ జేయుచున్నారు. నీవు, నికోలసు కలసి ఒక క్రైస్తవమతమును లేవదీసినారు. అది క్రైస్తవమతము కాదు. అందఱను దుఃఖములో ముంచునట్టి యా మతము పిశాచమతముగాదూ?

బో: సరిగా నిట్లే బైబిలులోఁ జెప్పఁబడినది.

చేర: బైబిలులో ఇదేమియు లేదు ఒకవేళ యున్నచో అది వట్టి మూర్ఖముతో నిండినదే అని అనవలయును. నా ప్రియమ్మయిన

బోరిసూ! నాపైని నీకు దయలేదూ! (కౌగలించుకొని యేడ్చుచున్నది) నా జీవితమంతయు దుఃఖమయమై పోయినది. నా జీవితములో ఒకచే యాశ, ఒకచే సుఖకిరణము మాత్ర మున్నది. నీవు దానిని నాశనము చేయుచున్నావు. బోరిసూ! నాపై దయచూపుము.

బో: అమ్మా! ఇది నాకుఁ జాలకష్టమైన సంగతి, అసహ్యామయినది గూడా. కాని నీకు తెలియఁజేయలేను,

చేర: చూఁడు. ఇప్పుడు తిరస్కరించకు. "నౌకరి చేయుదు"నని చెప్పి వేయుము.

నికో: చెప్పు. నీవు ఈ విషయము బాగుగా ఆలోచించుకో. తిరిగి నీవు తప్పక యీ విషయములో మరొకసారి యాలోచించుకో.

బో: కాని, అమ్మా! నీవు కూడ నామీఁద దయ చూపవలసియు న్నది. ఇది నాకుఁ గూడ అసహ్యాముగా నున్నది. (తెరలో తిరిగి రోదన ధ్వని.) నేను పిచ్చి యాసుపత్రిలో నున్నానని యెఱుఁగుదువా? నిజముగా ఎట్లయినఁ బిచ్చివాఁడనై పోదు నేమో యని భయము వేయుచున్నది.

(పెద్దడాక్టరు ప్రవేశించును.)

పె.డా: అమ్మా! ఇతనికి ఆంకను దుష్టస్థితి గలుగవచ్చును. మీ యబ్బాయి చాల ఆవేశము పొందిన స్థితిలో నున్నాడు. నేఁ డింక మీరు సెలవు చేసికొని వెళ్ళవలెను. మరల మీరు ల్యూ

ఆదివారములలో రావచ్చును. దయయుంచి పన్నెండు గంట లకుఁ బూర్వమే రండు.

చేర : మంచి సంగతే. మంచిది. నేను వెళ్ళుచున్నాను. బోరిసూ! నాపై దయయుంచి యీ విషయములో తిరిగి యాలోచించు నాపై దయయుంచు. తిరిగి లక్ష్మివారము నేను వచ్చునప్పటికి సంతోషవార్త వినిపించుటకు సిద్ధముగానుండు.

నికో : (బోరిసుతో చేయిగలిపి) ఈశ్వరుని సహాయంతో దీనిని తిరిగి ఆలోచించుకొనుము. నీకు రేపే మరణ మాసన్నమైనట్లు తలఁచుకొని యీ విషయమును తిరిగి ఆలోచించుకొని చూఁడుము. సత్యమును నిర్ణయించుకొనుట కిది యొక్కటే మార్గము. మంచిది. సెలవు.

బో : (ల్యూబాను సమీపించి) మరి నీవు నాకేమి చెప్పెదవు?

ల్యూ: నేను అబద్ధమాడలేను, నీవు స్వయముగా బాధ తెచ్చిపెట్టు కొని యితరులను ఎందుకు బాధపెట్టుచున్నావో నాకేమీ తెలి యుట లేదు. మరి నీకేమియు నచ్చచెప్పలేకుండ నున్నాను.

(ఏడ్చుచు నవతలకుఁ బోవుచున్నది. బోరిసు మిగిలిన వారం దఱు నిష్క్రమింతురు.)

బో : (ఒంటరిగా) ఆహా! అది యెంత గఠినమైనది. ఎంత కఠోరము. ఈశ్వరా! నాకు సహాయము చేయుము (ప్రార్థించు చున్నాఁడు.

(గౌను పట్టుకొని వార్డరులు వచ్చుచున్నారు.)

వార్డరు : దయయుంచి ఇవి ధరింపుఁడు.

(బోరిసు ఆ గౌను తొడుగుకొనును.)

(ఇది మూఁడవ దృశ్యము)

## చ తు ర్థాం క ము

### ( మొ ద టి దృ శ్య ము )

[ఒక సంవత్సరము పిదప మాస్కోలో నికోలసు గృహములో నృత్యము ప్రదర్శింప నేర్పాటు జరుగుచున్నది. పియోనాకు నాలుగు వైపుల్ల నౌకరులు పూలమొక్కల కుండీల నుంచుచున్నారు. మేరి పట్టుదుస్తులు ధరించి అలెగ్జాండ్రాతోఁ గూడ వచ్చుచున్నది.]

మే : విందా! కాదుకాదు. ఒక చిన్న నృత్యప్రదర్శనము. వారు చెప్పుచున్నట్లు ఒక విందు. మా పిల్లలు రంగస్థలములలోఁ బాల్గొన్నప్పటి నుండి యెక్కడనో యొకచోట నుండి నృత్యమున కాహ్వానములు వచ్చుచునే యున్నవి. ఆ యాహ్వానములకు బదులు వారిని గూడ నేను ఆహ్వానింప వలసి యున్నది గదా!

అలె : నికోలసు ఇందుకిష్టపడఁడని నా భయము.

మే : ఇందుకు నేనేమి చేయఁగలను ? (నౌకరుతో) అది యటుంచుము. (అలెగ్జాండ్రాతో) వారు సుఖముగా నుండఁగాను, వారి కెట్టి కష్టము గలుగకుండ నుండఁగాను జూచుట నాకెంతయో సంతోషమని ఈశ్వరుఁడే ఎరుగును. కాని వారిప్పుడిటువంటి విషయములలో అంతగాఁ గలుగఁ జేసికొనుటలేదు.

అలె : కాదు, కాదు. కేవలము తన మనస్సులోని సంగతి యిప్పుడా తఁడు వెనుక మోస్తరుగాఁ బ్రకటించుట లేదు. భోజనమైన పిదప అతఁడు తన గదిలోనికి వెళ్ళుచుండఁగా అతనిలో ప్రసన్నత సంతుష్టి కనిపించుట లేదు.

మే : నేనేమి చేయఁగలను. చివరి కెట్లయినను మనుష్యులు బ్రతకవలయును గదా. మరి మనమో మనుష్యుల మోస్తరుగా నుండవలయును. మాకు ఏడుగురు పిల్లలు, పోనీ ఇంటిలో నవ్వుకొనుటకు, ఆడుకొనుటకు, మనస్సు సంతోషపెట్టుకొనుటకు ఏమైనను ఏర్పాటులు లేకపోయిన పాపము వారు ఎట్లు ఉందురో భగవంతునికే తెలియవలయును.మంచిది. ఎట్లయినను ల్యూబాను గూర్చి యిప్పుడు నేను నిశ్చింతగాను, సంతోషముగాను ఉన్నాను,

అలె : ఏమి యంతయు నిశ్చయమైనదా ? ఆమె తన వివాహమును గూరిచ్చి ప్రస్తావించినదా ?

మే : ఆ. నిశ్చయమైనట్లే అనుకొనవలెను. అతఁడు దానితో మాటాడినాను మరి. ల్యూబా అంగీకరించినది.

అలె : ఇందువలన నికోలసుకు ఇంకను గొప్ప కష్టము గలుగును.

మే : ఆయన యంతయు ఎరుఁగుదురు. వారికి దాచిపెట్టినది ఏమియు లేదు.

అలె : అతఁడు వానినిష్ట పడఁడూ.

మే : (నౌకరుతో) పండ్లు అలమారులో పెట్టు. అలెగ్జాండ్రా ! ఎవరినిష్టపడరందువు. అలెగ్జాండర్ మాయికాలోవిచ్ నా ? ఆయన

అతని నెన్నఁడును ఇష్టపడ లేరు. ఏమనఁగా, అతఁడు వారికిఁ బ్రియమైన సిద్ధాంతములను ఖండించు ప్రజ్ఞ గలవాఁడు. మంచి వాఁడు. దయాస్వభావుఁడు. ప్రపంచ సంగతులన్నిటిని దెలిసిన వాఁడు. కాని పాపము బోరిసు సంగతి యేమయినదో. వానిని గూర్చి తలఁచుకొన్నపుడు నాకు నిద్రగూడ వచ్చుటలేదు. కల గనుచు నిద్రనుండి యులికిపడి లేచుచున్నాను, తెలియుట లేదు. పాపమతని సంగతి ఏమైనదో!

ఆలె: లిసా అతనిని చూచుటకు వెళ్ళినది. అతఁడిప్పుడు గూడ అలాగే యున్నాఁడు. బోరిసు చాలా చిక్కిపోయెనట. అతని ప్రాణమైనను బోవచ్చును. లేక అతని మెదడైనను పాడయిపోవచ్చు. నని డాక్టరులకు భయముగా నున్నదని యామె చెప్పుచున్నది.

మే: అయ్యో! పాపము. ఈయన యుపదేశములవల్లనే అతఁడు తన జీవితమును పాడుచేసుకొన్నాఁడు. జీవితమును పాడుచేసుకొన్నచో ఏమి లాభము? నేను దీనిని మెచ్చుకోను.

(పియోనా వాయించువారు ప్రవేశింతురు.)

మే: ఏమి మీరు పియోనా వాయించుటకు వచ్చితిరా?

పియోనా వాయించువారు: అవునండి.

మే: దయయుంచి కూర్చుండుఁడు. ఇంకను గొంచెము ఆలస్యమున్నది. కొంచెము టీ పుచ్చుకొందురా!

పియోనా వాయించువారు: వద్దు, క్షమించండి. (పియోనా దగ్గరకు వెళ్ళుదురు.)

మే : నాకు బోరిసు అన్న ఇష్టమే కాని వాఁడు ల్యూబాకుఁ దగిన వాఁడు కాఁడు. ఆయన మాటలు వినుచున్నపుడు ఇంక అసలే పనికిరాఁడు.

అలె : కాని, అతని విశ్వాసమును చూడఁగా చాలా ఆశ్చర్యముగా నున్నది. ఇప్పుఁడు వాఁడెటువంటి కష్టము లనుభవించు చున్నాఁడు. సైనికసేవచేయుటకు ఒప్పుకోనంతవరకు అక్కడే బంధింపఁబడుటో, మరియొక కొట్టులోవడవేయుటో జరుగునని అక్కడివారు చెప్పుచున్నారు. వాని నాలుకనుండి ఆ సమాధానం తప్ప ఇంకేమియు వచ్చుటలేదు. ఇట్టి స్థితిలోఁగూడ అతఁడు ప్రసన్నముగాను, ఆనందముగాను నున్నాఁడని లిసా చెప్పు చున్నది.

మే : కేవలము గుడ్డినమ్మకము ఇదిగో చూఁడు. అలెగ్జాండర్ మాయ కాలోనిచ్ వచ్చినాఁడు.

(మాయికలోనిచ్ ప్రవేశించును)

మా : నేను చాల ముందుగా వచ్చితిని గాఁబోలు.

(మేరీ అలెగ్జాండ్రా చేతులను ముద్దు పెట్టుకొనును)

మే: ముందుగా వచ్చుట మంచిదే యయినది.

మా : ల్యూబాఏది? గడచినది కూడఁదీయుటకై బాగుగా చాలసేపు నాట్యము చేయుటకామె నిశ్చయించుకొన్నది. మఱి నేను ఆమెకు సహాయము చేయుదునని మాట యిచ్చితిని.

మే: ఆమె ఆ యేర్పాటులలోనే మునిఁగి తేలుచున్నది.

మా : అయితే నేను వెళ్ళి ఆమెకు సాయపడనా ?

మే : తప్పక.

మా : వెళ్ళఁబోవు చున్నాఁడు. ఇంతలో ల్యూశా ప్రవేశించును. ఆమె చేతిలో కుర్చీదిండ్లు, రిబ్బను లున్నవి.)

లూ : ఓహో ! మీరు వచ్చినారా ? చాల మంచిది. ఇప్పుడు నాకు సాయపడవచ్చును. హాలులో ఇంకను మూఁడు దిండ్లు ఉన్నవి. వెళ్ళి వాటిని తీసికొని రండు.

మా : నేనిదిగో వెళ్లుచుంటిని. (వెళ్లును.)

మే : ల్యూశా ! అతిథులు రాఁబోవు చున్నారు. ఇటువంటి సమయములో స్నేహితులు ప్రశ్నలు వేయుదురు. నేను వారికిఁ దెలుప వచ్చునా ?

ల్యూ : వద్దు. అమ్మా. వద్దు. స్నేహితులు అడిగితే అడుగనిమ్మ. తండ్రిగారి కిది యిష్టము గాదు.

మే : వారికీపాటి కిది తెలిసియే యుండును. అదిగాక వారికి ఎప్పుడో యొకప్పుడు చెప్పవలసినదేగదా. నేఁడే ఈ విషయము సూచించుట మంచిదనుకొందును. ఇది కేవలమొక సుఖాంత మైన రహస్యము.

ల్యూ : వద్దు. వద్దు. అమ్మా. ఇట్లు చేయవద్దు. ఇఁదువల్ల ఆనంద భంగ మగును. ఈసంగతి ఇప్పుడేమీ తలపెట్టవద్దు.

మే : సరే నీ యిష్టము.

ల్యూ్యా : మంచిదే కాని, నాట్యము ముగిసిన తర్వాత సరిగా విందు ప్రారంభములో ... .... ...

అలెగ్జాండర్ మాయిలోవిచ్ (ప్రవేశించును.)

ల్యూ్యా : ఏమి అన్నియు తీసికొని వచ్చితిరా ?

మే : నేను వెళ్లి పిల్లలను జూచివత్తును.

(అలెగ్జాండ్రతోఁగూడ నిష్క్రమించును.)

అలె : (మూఁడు దిండ్లు తీసికొని వచ్చుచు వానిని గడ్డముతో సర్దుచు దారిలోఁ గొన్ని పడవేయుచున్నాఁడు) నీవు శ్రమపడకు ల్యూ్యాశా ! వానిని అట్లుండనిమ్ము. నేను వానిని ఎత్తి పట్టుకొని వత్తును నీవు పూలగుత్తులు చాల కట్టితివే. మంచిది. నేను ఈ రోజు బాగుగా నృత్యములో పాల్గొందును. వానియా ! ఇటురా :

వా : (పువ్వులు పూలగుత్తులు తీసికొని) ఇదిగో నేను అన్నిటిని తెచ్చుచున్నాను.

ల్యూ్యా : నేను, అలెగ్జాండరు, ఈరోజు ఒక పందెము వేసికొన్నాము. చూతము, ఎవరు గెలిచెదరో.

మా : నీవందలను ఎఱుఁగుదువు గనుక ఇది నీకు చాల సులువు. నేనో మొదట యువతులను మంచి తనము చేసికొనవలెనని కాఁబోలు నీ యుద్దేశము. పరుగెత్తుటకు ముందు నీవు నలభై యడుగులు ముందున్నావు.

వా : కాని నీవు పెండ్లికొడుకు కాఁబోవుచున్నావు. మఱి నేనో బాలుఁడను.

మా : కాదు అబ్బాయి. నేకింకను బెండ్లికొడుకు నగుట లేదు. నేను పిల్లవానికంటెఁ గూడ అధ్వాన్నమైన స్థితిలో నున్నాను.

ల్యూ : వానియా కొంచెము నాగదినుండి జిగురు సూది కత్తెర తీసికొనిరా. మఱేమి పాడు చేయకే.

వా : అన్ని బ్రద్దలు కొట్టి వేయుదును. (పరుగెత్తి పోవును)

మా : (ల్యూబా చేయి పట్టుకొని) ల్యూబా ! నేను ముద్దు పెట్టుకొనఁగలనా ? (ఆమె చేయి ముద్దుపెట్టుకొని) నేను చాల ధన్యుఁడను. కాని యిది చాలదు. నాట్య సమయములో మనము మాటాడుకొనుటకు సమయము దొరుకును. నా ప్రార్థనను నీవు మన్నించినట్లు నేను మా యింటికి టెలిగ్రాము పంపనా ?

ల్యూ : ఆ. ఈనాఁడు రాత్రి.

మా : ఇంకొకమాట అడగవలసి యున్నది. అది నికోలసు గారి కెట్లుండునో. ఏమి నీవు వారితోఁ జెప్పితివా ?

ల్యూ : లేదు. నేను వారితోఁ జెప్పలేదు. ఇప్పుడు చెప్పెదను, వారు అన్ని యింటి పనులను వలెనే దానిని గూడ ఉదాసీన భావముతో విందురు. " నీ యిష్టము వచ్చినట్లు చేయుము " అని మాత్రమే అందురు. ఇది వారి మనస్సునకు కష్టము గలిగించునను టలో సందేహము లేదు.

మా : అవును. నేను బోరిసును గాను గదా మఱి. నేనో మిగుల ఔదార్యవంతుఁడను.

ల్యూ : అవును. వారియందలి గౌరవము చేతనే ఇంతవఱకు మనస్సును అణఁచుకొని వారిని మోసగించుచు ఉన్నాను నాకు వారిమీఁద ప్రేమ తగ్గిపోయినందువల్లఁగాదు కాని నేను వారితో అబద్ధము చెప్పలేను. ఇట్లని వారే చెప్పుచుందురు. నేనావిధముగా జీవితము గడపవలెనని యనుకొనుచున్నాను.

మా : మఱి జీవిత మొక్కటే సత్యమైనది. ఆ అవును గాని బోరిసుగారి సంగతి యెట్లున్నది ?

ల్యూ : (ఆవేశముతో) నాయెదుట-అతని పేరు తేవలదు. నేను అతని మీఁద దోషము ఆరోపింపఁగోరు చున్నాను – పాపము అతఁడు కష్టములు తెచ్చిపెట్టుకొనుచున్న యీ సమయములో అతనిపై నింద మోపఁ గోరుచున్నాను. నేను అతనివిషయమై అపరాధురాల నగుటకోస మిది యంతయు అయినదని అనుకొనుచున్నాను. సరే నామనస్సులో వారిమీఁద ఒక విధమైన ప్రేమ యున్నదని మాత్రము ఎఱుఁగుదును. ఆ ప్రేమ మొదటి ప్రేమ కన్న ఎంతో ఎక్కువైనది. సత్యమైనది. ఇదివఱలో అతనిమీఁద చూపనిది.

మా : ల్యూబా ! ఇది నిజమేనా ?

ల్యూ : ఆ సత్యమైన ప్రేమతో నిన్ను ప్రేమించు చున్నానని నాచేతఁ జెప్పింపఁ దలఁచు చున్నావా ? నేనట్లు చెప్పను. నేను నిన్ను ప్రేమించు చున్నాను గాని ఆ ప్రేమ మఱియొక విధమైనది.

ఇది యాదర్శ ప్రేమ గాదు. వాస్తవముగా ఇదియు ఆదర్శ ప్రేమ గాదు అదియు ఆదర్శ ప్రేమగాదు. ఏవిధముగానైనను ఈ రెండిటి సమ్మేళనము జరిగిన అప్పుడే సత్యమైన ప్రేమ యొక్క యానందమును అనుభవింపఁ గలనని యనుకొందును.

మా : కాదు. కాదు. నాకు దొరికిన దానితో నేను సంతృప్తి పొందుదును. (ల్యూబా చేయి ముద్దుపెట్టుకొని) ల్యూబా !

ల్యూ : (అతనిని అవతలకు త్రోసి ) వలదు. శీఘ్రముగా ఈ ప్రసంగమును గట్టిపెట్ట వలెను. వారు వచ్చుచున్నారు.

(జమీందారిణి, టానియా, ఒక చిన్న బాలికయు ప్రవేశింతురు.)

ల్యూ : కూర్చుండుఁడు మాయమ్మ యిప్పుడే వచ్చెను.

జమీ : మేమే అందఱికంటె ముందు వచ్చితిమా ?

మా : ఎవరో ఒకరు ముందు రావలసిన వారేగదా.

(స్ట్యూపా జిగురు గుండుసూదులు దిండును పట్టుకొని వచ్చును.)

స్ట్యూ : నిన్న రాత్రి ఇటాలియను సినిమాలో మిమ్ముఁ దప్పకుండఁ గలిసికొందునని యనుకొంటిని.

టా : మేము పెద్దమ్మ గారి యింటికి వెళ్ళితిమి. అందుచే రాలేకపోయితిమి.

(విద్యార్థులు. స్త్రీలు, మేరీ, ఒక గణితజ్ఞురాలు (Countess) వత్తురు.)

గణి : ఏమండి. అయితే మేము నికోలసు గారిని గలిసికొనుటకు వీలుపడదా ?

మే : వీలు పడదు. వారు చదువుకొనుట మానివేసి మా సమావేశము
లలో పాల్గొనుట మానివేసిరి.

మా : మంచిది. ఇంక మొదలు పెట్టుఁడు.

(చప్పట్లు గొట్టుచున్నారు. నటకులు తమ స్థానములలో నిలుచుండి నృత్యము చేయుచుందురు.)

అతె : (మేరీ దగ్గరకువెళ్లి) అతఁడు చాల యుత్తేజితుడై యున్నాడు. అతఁడు బోరిసును గలిసికొనుటకు వెళ్లి తిరిగి యిక్కడికి వచ్చి చూచునప్పటికి ఇక్కడ ఈ సమావేశ మేర్పడి యున్నది. అతఁ డిప్పుడు వెళ్లిపోవలె ననుకొనుచున్నాఁడు. నేను అతని గుమ్మముఁ దగ్గరకు వెళ్లి చూడఁగా నతఁడు రైతుతో మాటాడుచుండఁగా చూచితిని.

మే : ఉహూ.

మా : ఓ స్త్రీలారా! సిద్ధముగా నుండండి. సజ్జనులారా! ముందుకు జరుగుఁడు.

అతె : " ఈ యింటిలో నుండుట యసంభవము " అని యతఁడు నిశ్చయించుకొన్నాఁడు. అతఁ డీ యిల్లు విడిచిపెట్టి వెళ్లిపోవుచున్నాడు.

మే : అయ్యయ్యో! ఇతఁ డెంత వేధించుకొని తినుచున్నాఁడు.

(నిష్క్రమించును.)

(ఇది మొదటిదృశ్యము)

( రెండవ దృశ్యము )

[ నికోలసుగది. సంగీతధ్వని దూరమునుండి వినఁబడు చుండును. నికోలసు ఓవరు కోటు ధరించి యుండును. బల్లమీఁద ఒక జాబును నికోలసు ఉంచుచుండును. రైతు చిరిగిన బట్టలు కట్టుకొని యతని దగ్గర నున్నాడు. ]

పి : తమరేమాత్రము విచారింపకుఁడు. మనము కాకేసియా ఒక కాని కూడ ఖరుచ్చిపెట్టకుండ వెళ్ళఁగలము. మఱి యక్కడకు వెళ్లిన పిదప నిశ్చయించుకొన వచ్చును.

నికో : తూలా వఱకు మనము రైలు మీఁద ప్రయాణము చేయుదము. తర్వాత అక్కడనుండి నడచి వెళ్ళుదము. మంచిదే, నేను సిద్ధముగా నున్నాను. (జాబు బల్లకు మధ్యఉంచి గుమ్మము దాఁక పోయి మేరీ నిలుచుండుట చూచును.) ఏమి, నీవిక్కడకెందుకు వచ్చితివి ?

మే : ఎందుకు వచ్చితినా ? పిడుగువంటి యీ నిష్ఠురత్వమును అరికట్టుటకు. మీరేమి చేయుచున్నారు. ఇల్లు విడచిపెట్టి ఎక్కడకు వెళ్లిపోవు చున్నారు.

నికో : నేనీ విధముగా నుండలేక పోవుట వల్ల బీభత్సమగు నీ పతిత జీవనమును సహింపలేకున్నాను.

మే : ఇది చాల విచార కరమైన విషయము. నా జీవనము – మీకు పిల్లలకు సేవ చేయించుటకై అర్పించి వేసిన – యీ జీవనము

ఒక్కమాటుగా మీకు బీభత్సము గాను పతిత మైనది గాను దోఁచుట మొదలు పెట్టినది. (పిట్రోవిచ్ను జూచి) పోనీ ఈతనినైన అవతలికిఁ బంపివేయుఁడు మన మాటలు ఇంకొకరు వినుట నా కిష్టము లేదు

పి : మీరు మాటాడు కొనుఁడు నేను వెళ్లిపోవు చున్నాను.

నికో : పిట్రోవిచ్ గారూ ! మీరు కొంచెము సేపు అరుగు మీఁద కూరుచ్చుండుఁడు. నేనిప్పుడే వచ్చెదను.

(పిట్రోవిచ్ నిష్క్రమించును.)

మే : మంచిది. మీకు ఇతనికి ఎట్లు సమ్మేళన మయినది. మీ భార్య కంటెఁ గూడ అతఁడు మీకెందుకు ప్రేమపాత్రు డయినాఁడు. ఇది నాకేమి తెలియుట లేదు. మఱి మీరు ఎక్కడకు వెళ్లిపోవు చున్నారు.

నికో : నేను నీకోసము ఒక జాబు వ్రాసియుంచితిని. నేను మాటాడ నిష్టపడుట లేదు. ఇది చివరకు కష్టమయి పోవుచున్నది, కాని నీవు శాంతముగా వినఁగోరినచో నేను శాంతముగా తెలుప యత్నింతును.

మే : నే నిదేమియుఁ దెలిసికొన లేను. మీకోసము నా సర్వస్వము అర్పించివేసిన మీభార్యను ఎందుకు ఈబాధలు పెట్టుట. ఆమెను చూచిన ఇంత యసహ్య మెందుకు ? పోనీ మీరే చెప్పుఁడు. నేనెప్పుడైనను విందులలోఁగాని నాట్యములలోఁ గాని పాల్గొన్నానేమో ఏదైన చెడ్డ సంగతి చేసితినేమో మీరే చెప్పుఁడు. నా సమస్త జీవితము కుటుంబముకొఱకే అర్పింపఁ బడినది. నేను

స్వయముగా పిల్లలకు పాలిచ్చుట, వారి పోషణ, వారి చదువు, ఇంటిపనులు మొదలైన పనులన్నియు నా నెత్తిపై నే వేసికొన్నాను. .... ....

నికో : (మాట కడ్డువచ్చి) కాని నేను జెప్పినట్లు నీవుండుట కిష్టపడ లేదు కనుక అదంతయు నీ నెత్తిపైఁ బడినది.

మే : కాని యిది మాత్రము పూర్తిగా అసంభవము. ఎవరినైన నడిగి చూడుము. నీవు తలచినట్లు నేను గూడ పిల్లలకు చదువు సంధ్యలు లేకుండఁ జేసి వారిని పాడుచేయలేను. ఇది నాకసంభవమైన సంగతి. పైఁగా చాకలి దానివలె బట్టలు స్వయముగా ఉతుగుకొనుచు వంట చేసికొనుచుమండుట నాకు చాల కష్టమైన విషయము.

నికో : ఇట్లు నేనెప్పుడును జెప్పలేదే.

మే : బాగున్నది. దాని యభిప్రాయము మాత్రము ఇదే. చూడండి. మీరు క్రీస్తు మతస్థులు. మీరు ఇతరులకు మంచి చేయవలెనని అందఱను ప్రేమించవలెనని బోధించు చున్నారు. కాని జన్మమంత మీ సేవలోనే గడపుచున్న యొక నిర్భాగ్యురాలైన స్త్రీని బాధించుట యెందుకు మఱి.

నికో : నేను నిన్నెట్లు బాధించు చున్నాను. నిన్ను నేను ప్రేమించు చున్నాను గదా. కాని ..... ...

మే : మీరు నన్ను విడిచిపెట్టి వెళ్లిపోవు చున్నారు. ఇది బాధించుట కాకపోయిన మఱియేమి ? ఇది విని లోకులు ఏమందురు ? నేను చెడ్డదానిననో లేక మీరు పిచ్చివారనో వారందురు.

నికో. మంచిది. నేనే పిచ్చివాఁడ ననుకో. కాని నేనీవిధముగా జీవితము గడపఁ జాలను.

మే : కాని యిందులో అంత భయానకమైన విషయ మేమున్నది? సంవత్సరములో ఒక్కమారు కేవలము ఒక్కమారు. ఏమనిన నీవు దాని నిష్టపడవని నా భయము. ఒక్క విందు ఇచ్చితిని. అదికూడ చాల చిన్నది. సామాన్యమైనది. దానిలోఁ గూడ కేవలము ఒకరిద్దఱ కంటె ఎక్కువ పిలువనే లేదు. అయినను నీకిష్టము లేక పోయినది. దానిని మీరు నాకు అగౌరవము చెడ్డపేరు తెచ్చునట్టి యపరాధముగా తలఁచుచున్నారు. మఱి కేవలము అగౌరవము మాత్రమే కాదు. నన్ను ప్రేమించక పోవుట అన్నిటికంటె మఱియు చెడ్డసంగతి. మీరు ఇతరులను ప్రేమించుచున్నారు. సమస్త ప్రపంచమును ప్రేమించుచున్నారు. చివరకు ఆ త్రాగుఁబోతు పిటోౌవిచ్‌ను గూడ ప్రేమించుచున్నారు. ప్రపంచము లోనివాళ్ల నీచేతఁ బ్రేమింపబడకుండ నిర్భాగ్యురాలినై చెడ్డదాననై యున్నదానను నేనొక్కతెనే. మీరు నన్నుఁ బ్రేమించినను సరే ప్రేమింపకపోయినను సరే కాని నేను మాత్రము మిమ్ము ఇప్పటికిని ప్రేమించుచునే యున్నాను. మిమ్ము విడిచి నేను జీవింపలేను. మీ రెంత పని చేయఁబోవుచున్నారు. నన్ను ఎందుకని విడిచిపెట్టుట.

(ఏడ్చును)

నికో. : కాని నీవు నా జీవనమును — నా ఆధ్యాత్మిక జీవనమును మాత్రము తెలిసికొనఁ గోరుట లేదు.

మే : నాకుఁ దెలిసికొనవలెననియే యున్నది, కాని తెలిసికొనలేకుండ నుంటిని. మీ క్రైస్తవ ధర్మము నన్నుఁ బిల్లలను అసహ్యముగా జూచుట నేర్పినదని యనుకొను చున్నాను. కాని యిట్లు ఎందు కగుచున్నదో నాకుఁ దెలియుట లేదు.

నికో : ఇతరులు మాత్రము దానిని దెలిసికొను చున్నారని నీ వెఱుఁ గుదువు గదా.

మే : ఎవరు ? నీవల్ల ధన లాభము పొందిన పిటోర్విచా ?

నికో : అతఁడు ఇతరులును గూడ టానియా వాసిలీ గారును. కాని ఎవ రైనను ఒకవేళ తెలిసికొనక పోయినను దీనికేమియు అడ్డు రాదు

మే : వాసిలీ గారు చేసిన పనికి పశ్చాత్తాప పడుచున్నారు. టానియా స్టూపాతోఁ గూడ నాట్యము చేయుచున్నది.

నికో : ఇది వినఁగా నాకుఁ జాల దుఃఖముగా గలుగుచున్నది. కాని యిందువల్ల పలుపు తెలుపుగా మాఱిపోదు. నేను నా జీవితమును మార్చివేయలేను. మేరీ ! నీకు నా యవసర మేమియు లేదు. నన్ను పోనిమ్ము. నీ జీవితములో పాలు పుచ్చుకొని అత్యావ శ్యకములు ప్రియములు అయిన యాయా సిద్ధాంతములను పమావేళ వలచుకొందమని ప్రయత్నించితిని. కాని యిది యసంభవమని యనుకొను చున్నాను. దీని వలనగా మనకు నీకును నాకును దుఃఖ కరము గానే యగుచున్నది. ఇందువల్ల విచా రమే కాకుండఁ జేయఁదలఁచిన పని కూడఁ జెడయిపోవు చున్నది. ప్రతి మనుష్యుఁడును ఎంతదాఁకనో తొందుకు ఈ

ఫెట్రోవిచ్ గూడ నేను మోసగాఁడననియు కబుర్లు మాత్రము చెప్పువాఁడననియు, ఏమియుఁ జేసి చూపువాఁడను గాననియు అనును నిష్కపటము గాను దరిద్రుఁడనుగాను ఉండవలయునని యుపదేశించు చున్నాను. కాని సుఖ భోగములలో మునిఁగి యున్నాను. నా యైశ్వర్య మంతయు నా భార్య పేర వ్రాసి వేసితినను నెపము నాయంత నేనే కలింపుచుకొనఁ దగియున్నది.

మే : అయితే మీభయము లోకు లీవిషయములో ఏమందురో యని యే గదా. నిజముగా ఈ లోకులు ఏమనుకొందురో అను భయమును ఈ యపవాదును తిరస్కరింపక పోయినచో మీరు అభివృద్ధి పొందలేరు.

నికో : నీకు సిగ్గు గలుగునట్లు మాటాడు లోకు లేమందురో అను భయము నాకేమాత్రము లేదు. కాని యీశ్వర కార్యమును జాడు చేయు చున్నానని మాత్రము నాకు భయముగా నున్నది.

మే : మనుష్యులకు విరుద్ధముగా నున్నమీ ఈశ్వరుఁడు తన యిచ్ఛను నెఱవేరుచ్చకొని తీరుననియే కదా మీరు చెప్పునది. కాని యిందు వల్ల ఏమియు ప్రయోజనము లేదు. నాచేత మీ రేమి చేయింప వలెనని కోరుచున్నారో చెప్పుఁడు.

నికో : నీకు జాలిసార్లు చెప్పియున్నాను.

మే : కాని నికోలసూ ! ఇది యసంభవమని మీకును తెలియును. కొంచెము ఆలోచించి చూడుఁడు తెలియును. ల్యూబాకు వివాహము కాఁబోవుచున్నది. వానిసూ విశ్వవిద్యాలయములో

జెరుటకు వెళ్లుచున్నాఁడు. మిసీ. కాతియాలు స్కూలులో నున్నారు. బాగున్నది. వీటి నన్నిటిని ఎట్లు మాన్పించఁగలను.

నికో : మంచిది సరే. అయితే నేనేమి చేయుదును.

మే : మీ రెప్పుడును మానవ కర్తవ్య మనునదే చేయుఁడు. ధైర్యము వహించే ప్రేమతోఁ గొంచెము వ్యవహరింపుఁడు. ఏమి ఇది మీకు మిగులఁ గష్టముగా నున్నదా ? బాగున్నది సరే. మాతో పాటు ఉండి మీరు చేయఁగలిగిన దేమో చేయుఁడు. అంతేకాని ఇల్లు వాకిలి వదిలిపెట్టి వెళ్ళకుఁడు. చెప్పుఁడు ఏ విషయము లోను మీకుఁ గలుగు దుఃఖము....

(పరుగెత్తుకొని వానియా ప్రవేశించును)

వా : అమ్మా ! వారు నిన్నుఁ బిలుచుచున్నారు.

మే : నేనిప్పుడు రాలేనని చెప్పు. వెళ్ళు వెళ్లు.

వా : త్వరగా రా. (పరుగెత్తుకొని పోవును.)

నికో : నీవు నా యాశయములను మెచ్చుకొనుట లేదు. వానిని దెలిసి కొన నీకిష్టము గూడ లేదు.

మే : నేను తెలిసికొనుట కిష్టపడక పోవుట గాదు కాని నేను వానిని దెలిసికొనలేక పోవుచున్నాను.

నికో : లేదు. నీవు తెలిసికొనుట లేదు. మఱి యిందువల్ల మన మొకరి నుండి యొకరము దూర మయిపోవు చున్నాము. నీవు నా హృదయములోని భావములను గుర్తింపుము. నీవు నా స్థితిలో

నుండి చూడుము. అప్పుడు నీ వన్నిటిని తెలిసికొనఁగలవు. ఒక పరిగతి చూడఁగా నిక్కడి జీవితము మిక్కిలి పతితమై యున్నది. నీ కీమాట చెడ్డగా తోఁచును. కాని యీ జీవితము యొక్క మూల కారణము బందిపోటు తనమును మించి పోయినది దానికి మారు పేరు పెట్టి పిలువలేను- మన జీవిత మంతయు బందిపోటు తనముగా నున్నది. మనము రైతులను మోసగించి దాచుకొని లాగుకొన్న భూమి మీఁద ఆధారపడి యున్నాము ఇంతే గాకుండ నిట్టి జీవనము మన పిల్లలను, అధఃపతితులను, చరిత్ర హీనులను జేసివైచు చున్నది. పిల్లలను చెడు త్రోవ లోనికిఁ బోనిచ్చువాఁడు మహా పాపీయని పెద్దలందురు. మెల్ల మెల్లఁగా పిల్లలు పాడయిపోవుట నా కన్నులార ప్రతిరోజు చూచు చున్నాను. వీరు బానిసలగుట నేను జూడలేను. ప్రతి విందు నా హృదయములో నొక్కొక్క గాయమును గలిగించు చున్నది.

మే : కాని యిదంతయు పూర్వము నుండి యున్నది గదా. ప్రపంచ ములో అన్నిచోట్ల ఇది జరుగుచునే యున్నదే.

నికో : కాని యిది నావల్లఁ గాదు లోకములోని వారందరము సోదరులము అని తెలిసికొన్నప్పటి నుండియు యీ వ్యర్థమైన ఖర్చు ఈ స్వార్థపరత్వము ఈ పిల్లల [illegible] నా హృదయములో ముల్లు వలె గుచ్చుకొను చున్నది.

మే : [illegible] నీ మనస్సులోని సంగతులు. ప్రతి మనుష్యుఁడు తన కిష్టము వచ్చినట్లు మాటలాడ[illegible] [illegible] గలఁడు.

నికో : నీవు తెలిసికొనుట లేదు. ఇది చాల భయంకరమైన విషయము. నేటి సంగతి వినుము. నేను ఈ రోజున హారిజనుల పేట లోనికి బోయి అక్కడ చూచితిని గదా. పాలు విడువని పిల్లవాడు ఆకలితో చనిపోయినాడు. చిక్కి శల్యమై పోయిన యొక ముసలితొక్కు భయంకరమైన రోగముతో భూమిమీఁదఁ బడియున్నాఁడు. వాని దగ్గర ఒక చిన్న పిల్ల పాపము ఒంటరిగాఁ బడియుండి యేడ్చుచున్నది. వారి దగ్గర తినుటకుఁ బట్టెడన్నము మందుకు కాని కూడ లేదు. వెలుపల రోడ్డు మీఁద ఆమె తల్లి చలితో వడఁకుచు ఒడలి మీఁదఁ దడిసిన బట్టను ఆర వేసికొనుచున్నది. ఆమె దగ్గర రెండవబట్ట కూడ లేదు పాపము. ఆమె యుండి యుండి దగ్గుతో ఉక్కిరి బిక్కిరి యయిపోవుచున్నది బహుశా ఆమెకు క్షయరోగము పట్టుకొని యుండును సరే యింక ఇంటికి వచ్చి చూడఁగా వీరు భోగ విలాసములలోఁ బడి మునిఁగి తేలుచున్నారు. మన వారి కిక్కడ నౌకరుల గుంపు ఏపని యైనను చేయుటకు సిద్ధముగానున్నది. మన సుఖముల కోసము ఇతరుల జోలి చూడనైన చూచుట లేదు. నేనిప్పుడే బోరిసును జూచుటకుఁ బోయితిని. తన సత్యము కోసము — తన ధర్మము కోసము — తన సర్వస్వము అర్పణ చేయుచున్నాడు బోరిసు. ఆ పరిశుద్ధమైన దృఢమైన యున్నతమైన ప్రతిజ్ఞ పూనిన యా బోరిసు అనేక విధముల కష్టము లనుభవించు చున్నాఁడు. ఆ ప్రతిజ్ఞ నుండి తప్పించుటకై గవర్నమెంటు తెలిసియుండి కూడ వాని మెడమీను తాడు చేయఁ దలఁచి యున్నది. వాని గుండె దుర్బలమైపోయినదని నే నెఱుఁగుదును. గవర్నమెంటునకుఁ గూడఁ దెలియును. కాని ఆ

గవర్నమెంటు అతనిని పిచ్చివారి నడుమ బడవేసినది. వానిని అనేక విధముల బాధించి వానికి కావేశము గలిగించుచున్నది. ఈ దృశ్యము చాల భయంకరమైనది. ఇంటికి వచ్చునప్పటికి తెలిసిన సంగతి యిది. కేవలము సత్యమును విడిచి పెట్టుటయే గాకుండ బైరాగా మనయింటిలో నందఱిలోను సత్యమును అవగాహనము చేసికొన్న యా మనుష్యుని - ప్రేమ ప్రదానము చేసి వివాహము చేసికొనదలచిన ఆమె యా యుత్తమునిగూడ బరిత్యజించి యొక వట్టి మోసగానిని వివాహమాడగోరుచున్నదట.

మే : ఇదేనా మీ క్రైస్తవ ధర్మము.

నికో : ఇది నా కుచితమైనది కాదనియు, నేను దోషిననియు తలచుచున్నాను. అయినను నీవు నా స్థితిలో నుండి చూడుమని మరల నదే చెప్పుచున్నాను. ఆమె సత్యము నుండి భ్రష్టురాలయినదనియే నా యుద్దేశము.

మే : "ఆమె సత్యమునుండి భ్రష్టురాలయినదని" మీ యుద్దేశ్యము. కాని లోకులందఱు "ఆమె భ్రమపోయినదని" యనుచున్నారు. చూచితిమి గదా, వాసిలీ గారు ఒకమారు బెదరిపోయినారు గాని తిరిగి చర్చికే వెళ్ళుట మొదలు పెట్టినారు.

నికో : ఇది యసంభవము.

మే : అయన లిసాకు వ్రాసినారు. ఆమె మీకు జాబు చూపును. ఇట్టి మార్పులు మిగుల అస్థిరముగానే యుండును. టానియా విషయములో ఇట్లే య్యయినది. నేను అతని మాట తలపెట్ట నిష్ట

పడను. మీ మాట విన్నచో లాభదాయకముగా నుండునని యతఁడు మీ మాటను గౌరవించు చున్నాఁడు.

నికో. (కోపముతో) మంచిది. సరే పోనిమ్ము. నేను జెప్పునది ఏమన సత్యము ఎన్నటికిని సత్యమే అని యిప్పుడు గూడ నమ్ము చున్నాను. ఇక్కడ నింటిలో సంగీతాలతో నృత్యములతో విందులతో వందలకొలఁది రూపాయలు వ్యర్థమై పోవుచున్నవి. అందులోఁ బాపము బీదలు తిండిలేక యాఁకలితోఁ జచ్చిపోవు చుండఁగా ఇట్లు ధనము మంచినీళ్ళవలెఁ బ్రవహింపఁ జేయు చున్నారు. ఇదంతయు నేను జూడలేను నామీఁద దయయుంచి నన్ను వెళ్లిపోనిమ్ము.

మే : కాని మీరు వెళ్ళునప్పుడు మీతో నేను గూడ వచ్చెదను. ఒక వేళ మీరు తీసికొని వెళ్ళక పోయిన యెడల మీరే బండిలో వెళ్లుదురో ఆ బండి క్రిందఁబడి చచ్చిపోవుదును. మిసీ కాతి యా అందలు గలిసి నూతిలో దిగనిండు. అయ్యో భగవంతుఁడా! ఓ ఏసుప్రభూ! ఎంత అనాయము. ఎంత అత్యాచారము.

(ఏడ్చు చున్నది)

నికో ; (గుమ్మము దగ్గరకు వెళ్ళి) పెటాశ్రిచ్ ! నీ వింటికిఁ బొమ్ము. నేను రాను. (భార్యతో) మంచిది. నేనిదే ఆగిపోయితిని. వెళ్ళను. (పై కోటు విప్పు చున్నాడు.)

మే : (మెడఁ గౌఁగిలించుకొని) మన మింక ఎంతోకాలము బ్రత కము. ఈ యిరవై యెనిమి దేండ్లు గలిసి మనము గడపిన కాలపు జీవిత సౌఖ్యమును బూడిదలో గలుపు కొనరాదు. నే

నింకెప్పుడును విందు లివ్వను. కాని నాకు మీ రిటువంటి శిక్ష ఎప్పుడును విధింప వలదు.

(వానియా కాలియా పరుగెత్తుకొని వత్తురు.)

వా :
కా : అమ్మా ! రా ! త్వరగా రా

మే : వచ్చుచున్నాను. ఇదిగో ఇప్పుడే వచ్చుచున్నాను. మంచిది. ఇప్పుడింక వెనుకటి సంగతులు మఱచి పోయి ఒకరి నొకరు క్షమించు కొనవలెను.

(కానియా వానియాలతో గూడ మేరీ నిష్క్రమించును.)

నికో : పిల్లవాఁడు, నియమము గల పిల్లవాఁడు. లేక చురుకైన పిల్ల కాదు చురుకైన యొక పిల్లవాఁడు. అవును నిజమే. ఈశ్వరా ! నేను నీ సేవకుఁడనై ఈ నీ పని పూర్తి చేయవలెనని నీవు కోరుట లేదని తెలియుచున్నది. " వీఁడు ఉపదేశములు చేయుటయే కాని పని చేయఁడు " అని వ్రేలుపెట్టి లోకులు నాకేసి చూపి చెప్పుదురు కాక యని నా కోరిక కాఁబోలు. మంచిది యట్లే కానిమ్ము. త్యాగము నమ్రత్వము ఆత్మ సమర్పణమును నీవు కోరుచున్నావని నే ననుకొంటిని. చివరకు నేనింత యెత్తు లేవఁ గలిగితిని.

(లిసా ప్రవేశించును.)

లిసా : క్షమింపుఁడు. నేను వాసిలీ గారి జాబును మీ దగ్గరకుఁ దీసికొని వచ్చితిని. అది నా పేర వచ్చినది కాని మీకుఁ గూడ వినిపింపు మని అందులో వ్రాయఁబడినది.

నికో : ఏమి ఇది సత్యమేనా ?

లిసా : అవును. ఏమి నేను చదువుదునా ?

నికో : ఆ. చదువు.

లిసా : (చదువు చున్నది.) " ఇది నికోలసు గారికిఁ జదివి వినిపింపుమని మిమ్ముఁ గోరుచున్నాను. అతనిచేత చరిచ్చెనుండి బెదరఁగొట్ట బడి యీ తప్పు చేసినందులకు నాకు మిక్కిలి విచారముగా నున్నది. కాని తిరిగి నేను చరిచ్చని గౌరవింపఁ దొడఁగితినని చెప్పుటకుఁ జాల సంతోష మగుచున్నది. మీరును నికోలసు బాబు గారును ఈ మార్గమునే యనుసరించెదరని నే నాశించు చున్నాను. దయతో నన్ను క్షమింపుఁడు. "

నికో : పాపము వానిని వారు చివరకు వేధించి వేధించి లొంగఁదీసి కొన్నారు.

లిసా : జమీందారిణి గారు ఇక్కడనే యున్నారని చెప్పుటకుఁ గూడ వచ్చితిని. ఆమె నాతో రెండవ యంతస్తు దాఁక మిక్కిలి యావేశముతోఁ బరుగెత్తుకొని వచ్చినది. మఱి మిమ్ముఁ గలిసి కొని తిరిగి వెళ్ళును ఆమె ఇప్పుడే బోరిసును గలిసికొని వచ్చి నది. ఆమెను మీ రిప్పుడు గలిసి కొనకుండుట మంచి దను కొందును. మిమ్మును గలిసి కొనినచో ఆమె కేమి లాభము గలుగును.

నికో : కాదు. వెళ్లి వారిని లోనికిఁ బంపు. ఇప్పుడు కష్టకాలము వచ్చి నట్లు తెలియు చున్నది.

లిసా : మంచిది. అయితే సరే నేను వెళ్లి పంపుదును. (వెళ్ళును.)

నికో : (ఒంటిగా) అవును నీ సేవ చేయుటయే ఈ జీవితమున కర్తమని చివరకుఁ దెలిసికొనఁ గల్గితిని. మఱి నన్నుఁ బరీక్షించుట కేదైన నొక కష్టము నాపైఁ బడవేసినప్పుడు దాని నేను సహింపఁ గల నని దానిని సహించుశక్తి నాలో నున్నదని నీవు తెలిసికొను చున్నావు. లేనిచో ఈ పరీక్ష జరుగదు. తండ్రీ ! నాకు సహాయ పడుము. నీ యిచ్ఛ నెరవేరుచుటకు నాకు సహాయ పడుము.

(జమీందారిణి ప్రవేశించును.)

జమీ : మీరు నన్ను లోనికిఁ బిలిచితిరా ? ఏమి నామీఁద ఇంత గౌర వము. మీకు నమస్కారములు. మిమ్ముఁ జూడఁగా అసహ్యము గలుగు చున్నది. మీరు తుచ్ఛులు.

నికో : అసలు సంగతి యేమి.

జమీ : ఏమున్నది. వారు వానిని శిక్షించుటకు ఖైదు లోనికిఁ దీసికొని వెళ్లుచున్నారు. దీని కంతయు కారణము మీరే.

నికో : చేరమఱనోవ్న గారూ ! మీరేమైనఁ జెప్పవలసి యున్నచోఁ జెప్పుఁడు. కాని మీరు కేవలము నన్ను నిందించుటకే వచ్చినచో మీకేకష్టము గలుగును. నాకు మీమీఁద హృదయపూర్వకమైన సానుభూతి గలదు. మిమ్ముఁ జూడఁగా నాకు జాలి కలుగు చున్న దే గాని మీరన్న మాటలకు నాకేమియు బాధ గలుగుట లేదు.

జమీ : ఆహా ! ఎంత దయ. ఎటువంటి యున్నతమైన క్రైస్తవ ధర్మము. నికోలసు గారూ ! మీరు నన్ను మోసగింపలేరు

ఇప్పుడు మాకు మీ సంగతంతయుఁ దెలిసి పోయినది. మీరు నా కొడుకును సర్వనాశనము చేసి ఎంత నిర్లక్ష్యముగా నున్నారు. విందులు నృత్య సభలు చేయించు చున్నారు. నా కొడుకును వివాహ చేసికొనఁ దలఁచిన నీ కూఁతురు ఈ వేళ ఇంకొకరిని వివాహం చేసికొనుటకు సిద్ధముగా నున్నది. దీనికేమో మీరు సమ్మతించు చున్నారు. కాని మీరు పరిశుద్ధమైన నిరాడంబర మైన జీవితము గడపవలెనని పైఁగా ప్రపంచమునకు బోధించుచు వడ్రంగి పనికి వెళ్ళుచున్నారు. ఈ మోసముల వల్ల ఈ మిషల వల్ల మీరు నాకెంత యసహ్యము గను తుచ్ఛముగను గనిపించు చున్నారు.

నికో : జమీందారిణి గారు ! ఇంత యాగ్రహ పడకుఁడు. మీరు వచ్చిన పనేమో చెప్పుఁడు. కేవలము నన్ను నిందించుట కొసము తిట్టుట కోసము మీరు వచ్చియుండరు.

జమీ : ఆ. ఇందు కోసము కూడాను, నా హృదయము మండుకొని పోవుచున్నది. దానిని ఏదో యొక విధముగా శాంతింపఁ జేయ వలెను. కాని నేను జెప్పఁదలఁచుకొన్నది యిది. వారు వానిని కోర్టు లోనికిఁ దీసికొని పోవుచున్నారు. ఇది నేను సహింపలేను. మీరే యిదంతయుఁ జేసినారు. మీరే. ఆ మీరే.

నికో : నేను గాదు. ఈపని చేయించినవాఁడు ఈశ్వరుఁడు. నీవిషయమై నాకెంత విచారముగా నున్నదో ఈశ్వరునికే తెలియును ఈశ్వరేచ్ఛకు అడ్డు పెట్టకు. ఈశ్వరుఁడు నిన్నుఁ బరీక్షింపఁ గోరుచున్నాడు. ఈ పరీక్షను వినయముతోను శాంతముతోను సహింపుము.

జమీ : నేను దానిని శాంతముగా నెట్లు సహింపఁగలను. నా సమస్త ప్రాణములు నా పిల్లవాని చేతిలో నున్నవి. మీరు వానిని నా దగ్గర నుండి లాగివేసి పాడుచేసి వైచినారు. నేను శాంతముగా నుండలేను. నేను మీదగ్గఱ కెందుకు వచ్చితినా ? మీరు నా కొడుకును పాడు చేసినారు. వానిని రక్షించవలసిన బాధ్యత మీ మీఁదనే యున్నది. ఆఖరుసారి యిది చెప్పుటకు వచ్చితిని. వెళ్ళండి వెళ్ళి వానికి బోధించి వానిని విడిపింపుఁడు. వెళ్ళండి. మీ యిష్టము గవర్నరు జనరలును గలిసికొని మాటాడినను సరే చక్రవర్తి గారిని గలిసికొని మాటాడినను సరే. ఇదంతయు మీపనే. మీరిట్లు చేయక పోయిన నేనేమి చేయుదునో నాకే తెలియుట లేదు. దీనికి జవాబు దారీ మీదే.

నికో : చెప్పు నేనేమి చేయుదును. మీరేమి చెప్పిన నది చేయుటకు సిద్ధముగా నున్నాను.

జమీ : నేను మరల రెట్టించి చెప్పుచున్నాను. మీరే వానిని రక్షింపవలెను. మీరట్లు చేయక పోయివచో జాగ్రత్త. సెలవు.

( వెళ్ళి పోవును )

(నికోలసు కుర్చీమీఁద పండుకొనును. నిశ్శబ్దము. తలుపు తెరవఁబడును. సంగీత ధ్వనులు వినఁబడును. పెద్దలు చిన్నలు జంటలు జంటలుగా నాట్యమాడుచు ప్రవేశింతురు. ల్యూబా ప్రవేశించును.)

ల్యూ : నాన్నగారూ ! ఇక్కడే యున్నారా ! లోనికి రండు.

ల్యూ : (నికోలసును జూచి) ఓహో ! నాన్న గారూ ! మీరు ఇక్కడే యున్నారా ? క్షమింపుఁడు.

నికో : (లేచి) మరేమియు భయము లేదు.

(నాట్యమాడువారు వెళ్లిపోదురు.)

నికో : వాసిలీ గారు వెనుకడుగు వేసినారు. బోరిసును నేను నాశనము గావించితిని. ల్యూబాకు పెండ్లి సిద్ధముగా నున్నది. నేనేమియుఁ దప్పు చేయుట లేదు గదా. నీపై విశ్వాస ముంచుటకే తప్పులు చేయుచుంటినా ? తండ్రీ ! నాకు సాయపడుము.

( ఇది రెండవ దృశ్యము )

# * పంచమాంకము

## (మొదటి దృశ్యము)

(ఖైదులో ఒకగది. ఖైదీలు కొందరు కూరుచుండియు కొందరు పరుండియు యుందురు. బోరిసు బైబిలు చదివి దాని యాశయము బోధించు చుండును.)

1 ఖై : ఏమండి బోరిసు గారూ ! తర్వాత చదువుఁడు.

---

* పాఠకుల దురదృష్ట వశమున మహాత్మ టాల్‌స్టాయి ఈ యంకమును పూర్తి చేయలేక పోయెను. కాని దృశ్యముల కనుగుణముగఁ గొన్ని సూచనలు చేసియుండెను అతఁడు వ్రాసిన సూచనల ననుసరించి యీ యంకమును సాహసముతోఁ బూర్తి చేసితిని.

అనువాదకుడు, చ. గ. శాస్త్రి.

2 ఖై : చదువు(డు బాబు చదువు(డు.

బో : " నీతి నిమిత్తము హింసింప( బడువారు ధన్యులు "

3 ఖై : అవును. నిజమేరా పాపము ఏమి చేసెనని మనతో పాటు ఈ ఖైదులో బాధలు.

4 ఖై : మనలో మాత్రము పాప మెందఱు లేరు తప్పు చేయకుండ ఈ ఖైదులో కష్టపడుచున్నవారు.

బో : (చదువు చున్నా(డు.) " పరలోక రాజ్యము వారిది. నా నిమిత్తము జనులు మిమ్ము నిందించి హింసించి మీమీ(ద అబద్ధముగా( జెడు మాటలు పలుకు నప్పుడు మీరు ధన్యులు. "

1 ఖై : పోనీ లెండు. ఎవరో మావంటి వారు హింసలు చేయుచున్నారన ఒప్పుకొన వచ్చును గాని గవర్నమెంటువారు కూడ ఇట్లు చేయుచున్నారేమి. నాకు మిమ్ము( జూడ(గా విచారముగానున్నది.

బో : నాసంగతి కేమిగాని లోకములో ఎందఱు సత్యముకై ఎట్టి కష్టముల పొలగుచున్నారో. ఏసు చేసిన బోధలు వేఱు ఈ ఫాదరీలు చెప్పునది వేఱు. పైగా క్రైస్తవ మతప్రచారము చేయుచున్నామని పాదిరీలు, ఆ మతమును రక్షించు చున్నామని గవర్నమెంటు వారును అందురు.

2 ఖై : నిజమేనండి బాబు.

3 ఖై : ఇంత తిండి దొరికిన మేము మాత్రము హింసలు ఎందుకు చేయుదుము బాబు.

బో : అవును. పాపము కడుపు కాలిపోవు చున్నప్పుడు మీరేమి చేయు దురు. అంతంత కష్టములు పడుచు మీరు ఓర్పు వహించి యుండుట కష్టము. అసలు ఇదంతయు ప్రభుత్వములోనే యున్నది. ప్రభుత్వము నిలుచుటకే యిదంతయును. "నరహత్య చేయవలదు. తన సహోదరుని మీఁదఁ గోపపడు ప్రతివాఁడు విమర్శకు లోనగును. మీ శత్రువులను ప్రేమింపుఁడు. మిమ్ము హింసించు వారి కొఱకు ప్రార్థన చేయుఁడు." అని స్పష్టముగా ఏసు ప్రభువు చెప్పి యుండఁగా ఆ శిక్షల కొఱకే ఆ హత్యాకాండలు జరపుట కొఱకే యీ సేనను ప్రభుత్వము పోషించు చున్నది. ఆ హింస ప్రతిహింసను గోరుచు గగ్గోలు వఱచు చున్నవి. హత్యలు మఱు మాటాడకుండ చేసెదమని న్యాయాన్యాయ విచారణ చేయకుండ పై యధికారి యాజ్ఞ లను మఱు మాటాడకుండ నెరవేర్చెదమని యంగీకరించుటకే యీ ప్రమాణములు చేయించుట మొదలైన ...

4 ఖై : అయితే మఱిచిపోయినాను ప్రమాణము చేయక పోయిన ఎట్లు బాబు. ఏసు ప్రభువు ప్రమాణము చేయరాదని చెప్పెనా ?

బో : అవును.

1 ఖై : ఏదీ బాబు అక్కడఁ గొంచెము చదువుఁడు.

బో . (పుట తిరుగవేసి చదువు చున్నాఁడు) " ఎంత మాత్రము ఒట్టు పెట్టుకొనవద్దు. ఆకాశము తోడనివద్దు అది దేవుని సింహాసనము. భూమి తోడనవద్దు. అది యాయన పాద పీఠము. యెరూషలేము తోడనవద్దు. అది మహారాజు పట్టణము ....

2 ఖై : (అడ్డువచ్చి శివ ఖైదీతో) అవును నిజమేరా· మఱి మన మెప్పుడును ఒట్లు పెట్టుకొనుట దానిని అతిక్రమించుట నిత్యకృత్యమైనది.

3 ఖై : మా బాగుగా చెప్పినాఁడురా ఆయన.

బో : మీకున్నంత మాత్రమైనను బుద్ధి లేదు ఆ ప్రభుత్వమునకు.

4 ఖై : తర్వాత చదువుఁడు బాబు.

బో : (చదువు చున్నాఁడు) నీ తల తోడని ఒట్టు పెట్టుకొన వద్దు. నీవు ఒక వెంట్రుకనైనను తెలుపుగాఁగాని నలుపుగాఁగాని చేయ లేవు. మీ మాట అవునంటే అవును కాదంటే కాదు . . .

(తెరలో ఏడ్పు ధ్వని) అయ్యో ! అయ్యో !

(ఒక మనుష్యుని గొరడాతోఁ గొట్టుచు లాగుకొని యిద్దరు పోలీసులు లోనికిఁ బ్రవేశింతురు )

1 పో : ఏమి యిప్పుడైనను బుద్ధి వచ్చినదా ?

మను : ఆ. రాకేమి ? ఆ బండరాముఁడు ఉండవలసినది. ఇప్పు డేమయి యుండునో (గింజుకొను చున్నాఁడు.)

2 పో : (కొరడాతోఁ గొట్టుచు ) ఏదీ మరల అను ఆ మాట. ఎంత చచ్చినను పులుపు చావలేదు.

ఇన్స : అట్లు ఒకటి రెండింటికి వాఁడు లొంగునా ? తగిలించు నాలుగు.

బో : ఏమి నాయనా ! వాని తప్పు వివరించి బోధించి మార్చవలెను గాని వానిని గొట్టినచో వాని బుద్ధి మాఱదు సరిగదా పైఁగా

తప్పు పెంచుచున్నను. "మీ శత్రువులను ప్రేమించుఁడు. మనుష్యుల యపరాధములను మీరు క్షమించిన యెడల ఆ పరలోకపు తండ్రియు మీ యపరాధములను క్షమించును. చెడుగును మంచి తో నెదుర్కొనవలెను. దుష్టుని ఎదిరింపక నిమ్నుఁ గుడి చెంప మీఁద గొట్టువాని వైపునకు నీ యెడమ చెంప గూడఁ ద్రిప్పుము." అని యేసు చేసిన బోధలు మీకుఁ దెలియవా ?

ఇన్స్పె: చాలుశే చెప్ప వచ్చితివా? నీ పిచ్చికి సాయము బోధనలుకూడ చేయుచున్నావూ ?

ఖైదీ: బాబూ యీాయన చెప్పిన దానిలో సత్యమున్నదండి.

ఇన్స్పె: ఉహూ. మీకుఁ గూడ ఎక్కించినాఁడా యీ పిచ్చి. (బోరిసును జూపి పోలీసులతో) ఒరే వీఁడు వీరి నందఱను గూడఁ బాడుచేయు చున్నాఁడు. వీనికిఁ గూడ నాలుగు తగిలించు.

(త్వరగా జమీందారిణి ప్రవేశించును.)

జమీ: ఇప్పటికైనను మీయమ్మ కష్టములు చూచి యైనను నీ యుద్దేశము మార్చుకో నాయనా ! నా కడుపు తరుగుకొని పోవు చున్నది. ఆ పాడు నికోలసు నీకెక్కడ దాపురించెనురా.

బో: (అశ్రుతతో) అయ్యో. అమ్మా ! ఇక్కడికిఁ గూడ ఎందుకు వచ్చితివమ్మా !

జమీ: నామాట విను నాయనా. వారు చెప్పినట్లు నామొగమైనను జూచి చేయరా ! ఎందుకు నన్నింత బాధలు పెట్టెదవు ?

ఇన్స్పె: ఇంకను చూతురేమి. వీరందఱను బాధ చేయుచున్న యీ బోరిసును నాల్గు వాయించక.

జమీ : (పోలీసులతో) నాయనలారా! మా అబ్బాయిని కొట్టకండి బాబు. కొట్టకండి.

ఇన్స్పె: ఈవిడ ఎవరురా. ఈమెను అవతలకు తీసికొనిపో.

జమి : నా కొడుకును నేను జూచుటకు వచ్చితిని. నాయనా తొందర పడకు.

పోలీ : వెళ్ళవమ్మా ఈయనను గొట్టకుండ దారిలోనికి రానే రాఁడు.

బో : అమ్మా వెళ్లు. వీరికి మర్యాద తెలియదు. అమ్మా వెళ్ళు. ఇక్కడ ఉండుట మంచిది కాదు

జమీ : నాయనా నా మాట ...

ఇన్స్పె: (అడ్డు వచ్చి) ఈమె తనంతటతాను వదలదురా. ఇంకను అవతలకు తీసికొని పోవరేమి.

(పోలీసులు బలవంతముగా జమీందారిణిని అవతలకుఁ దీసికొని పోదురు. జమీందారిణి ఏడ్చుచు నిష్క్రమించును )

ఇన్స్పె: ఏమి బోరిసూ; నీ కింకను బుద్ధి రాకుండుట సరిగదా వీరిని గూడఁ బాడుచేయుచున్నావా ?

బో : అయ్యా నాకు తెలిసిన సంగతి చెప్పక పోవుట ద్రోహము గాదా.

ఇన్స్పె: అబ్బా యింకను పొగరు తగ్గలేదు. ఇంకను కొరడా. దెబ్బలు తగుల లేదుగా మఱి.

బో : మీరు చేయు పని యంతే గదా. కొట్టుఁడు చీలుచుఁడు. మీ యిష్టము వచ్చినట్లు చేయుఁడు. నాకు దోఁచిన ధర్మము చేయుట చెప్పుట మానను.

(పోలీసులు ప్రవేశింతురు)

ఖై : అయ్యా ఈయన చాల మంచివారండి.

ఇన్స్పె : మీరు కూడఁ దిరుగుఁబాటు చేయుచున్నారే. (పోలీసులతో) వీనిని ఇంకను కొట్టరేమి. అట్లు చూచెదరేమి ?

పోలీ : (సంకోచముతో) ఏమయ్యా ! తిన్నగా ఉండరాదటయ్యా ! ఎందుకీ దెబ్బలు తినుట.

బో : మీపని మీరు చేసికొనుఁడు.

ఇన్స్పె : వానికేమి తగ్గినది యా పొగరు. కొట్టరేమి. (అని పోలీసుల మీఁద మండిపడును. పోలీసులు కొరడాలతో బోరిసును గొట్టు దురు.)

బో : (బాధతో) అబ్బా ! ఓ యీశ్వరా ! రక్షింపుము. నాకు ధైర్య మిమ్ము. పాప మీ యమాయకుల మన్నింపుము.

ఖై : ఒరే చూడలేమురా. పదండి భగవంతుని ప్రార్థించు కొందము. వేళ కూడ యైనది. (నిష్క్రమింతురు.)

ఇన్స్పె : వీనిని ఆమూల కొట్టులో పడవేయుఁడు. (నిష్క్రమించును)

(పోలీసులు బోరిసును గొట్టులోఁ బెట్టి తాళము వేసి నిష్క్రమింతురు.

బో : పాపము వీరు మేకలు. యజమాని యెట్లు చెప్పిన నట్లు చేయుటే వీరి పని. తండ్రీ ! ప్రపంచము గతి యింతేనా.

(మౌనము)

(తెర వ్రాలును.)

( ఇది మొదటి దృశ్యము )

(రెండవ దృశ్యము)

(జారు చక్రవర్తి సభ. పెద్ద హాలు. జారు చక్రవర్తి యెత్తైన వేదికపై వేయఁబడిన కుర్చీ మీఁదఁ గూర్చుండి యుండును. అతని ముందొక బల్ల. దాని పైన వన్నెల పట్టు వస్త్రము పఱువఁబడి యుండును. ఆ బల్లపైని ఒకవైపు కాగితములు కలము ఉండును, రెండవ వైపు సిగిరెట్టుల డబ్బా మూఁత తెఱువఁబడి యుండును. కొంచెము క్రిందుగా గుండ్రని బల్ల వేయఁబడి యుండును. దాని చుట్టు కుర్చీలు, వాటి పయిని మంత్రులు స్నేహితులు కూర్చుండి యుందురు. జారు చక్రవర్తి కిరు ప్రక్కల ఇద్దరు కత్తులతో నిలుచుండి యుందురు. జారు చక్రవర్తి చేతిలో సగము కాలిచ్చిన సిగరెట్టుండును అందఱు సిగరెట్టులు కాల్చుచుందురు బోరిసు ఒక యెత్తైన బోనులో నిలుచుండి యుండును.)

జా : వీఁడేనా ప్రమాణము చేయనివాఁడు.

ఇన్స్పె: చిత్తమండి. వీనిచే ప్రమాణము చేయించుటకు చాలాతంటాలు పడ్డాము. పాదిరీ గారిచేఁ జెప్పించితిమి. ఆఫీసరులు పరీక్షించి నారు. వైద్యులు పరీక్ష చేసి పిచ్చెక్కిందేమోనని పిచ్చాసుపత్రిలో – – –

జా ; సరే. తర్వాత.

ఇన్స్పె: వీని పిచ్చి తగ్గక పోవుటయే గాక మిగలిన వారికిఁ గూడఁ బిచ్చెక్కించి వీని వెఱ్ఱి వారికిఁ గూడఁ బట్టించు చున్నారు.

1 స : (సిగరెట్టు కాల్చుచు) హా హా హో బలే బాగున్నది. వీనికిట్లు గాదు ప్రాయశ్చిత్తము.

2 స : ఒళ్ళు అట్లు తేలునట్లు బహుమతి యివ్వవలెను. (నవ్వును.)

జా : అవును. అట్లు చేసిన చాల బాగుండును.

ఇన్స్పె: తమరది మాకు చెప్పవలెనా ? చిత్తము అదియు చేయుట యయినది. తాను పట్టుకొన్న కుందేటికి మూఁడే కాళ్ళని యనును. " నేను ప్రమాణము చేయను. నా యొడలు ఒలిపించినను సరే. " అని అదే మాట.

3 స : అవును. ఒడలు ఒలిపించ వలెను. ఒలిపించిన సరి ప్రమాణమే కాదు. ఏదైనను జేయును.

బో : (మాటాడఁడు.)

జా : (సిగరెట్టు కాల్చుచు) పోనీ వీనిని వదలిన – – –

ఇన్స్పె: అట్లు కాదండోయి. అట్లు చేసిన ఇంకను కుట్రలు పన్ని ప్రజా శాంతికి భంగము కలిగించును.

జా : (బోరిసుతో) ఏమయ్యా మాటాడ వేమి ? (ఏదో అడుగు మన్నట్లు గుమాస్తా వైపు చూచును.)

బో : బైబిలులో ఏసు ప్రభువు – – –

గు : బైబిలు గీబులు అట్లుంచవయ్యా. నీ మత మేమిటో ముందు చెప్పు.

బో : నాకు మతమేమియు లేదు.

జా : (అధికారముతో) చెప్పు.

ఇన్స్పె: చూచితిరా. ఎంత పొగరు.

బో : నా మతమా ? ఎన్ని సారులు చెప్పను. తంతు నడవ వద్దు మఱి. సరే ఏసు ప్రభువు పర్వతము మీఁద ఉపదేశించిన దాని ననుసరించి నాది క్రైస్తవ మతము.

1 స : అయితే మేము ఇంకొక రకపు క్రైస్తవులమా ?

బో . ఆ సంగతి నాకుఁ దెలియదు.

గు : నీ వెందుకు ప్రమాణము చేయవు ?

బో : ప్రమాణము చేయరాదని బైబిలులో నిషేధింపఁ బడినది గనుక.

జా : ఏమి వితండ వాదన. నీవు ప్రమాణము చేయుదువా ? చేయవా ?

బో : చేయను.అసలు నౌకరిచేయుటయే నాకిష్టములేదు. ఈ ప్రభుత్వము నకు ఒక నీతి నియమము లేదు. మతరక్షణమను పేరుతో ప్రభు

త్వము చేయు అధర్మ కృత్యములకు లెక్కయే లేదు. ఏసు ప్రభువు ప్రమాణము చేయవలదని ఉపదేశింపఁగా ప్రభుత్వము ప్రతివారి చేత ప్రమాణములు నిర్బంధించి చేయించుచున్నది. " నరహత్య చేయవలదు. నీ శత్రువును ద్వేషింపక ప్రేమింపుము. ద్వేషమును ద్వేషముతోఁ గాక ప్రేమతో ఎదుర్కొనుము. " అని ఏసు ప్రభువు బోధింపఁగా ఈ ప్రభుత్వము హత్యాకాండకై ఆయుధములను సిద్ధము చేయుచున్నది. శత్రువుల – – –

1 మం : (అడ్డగించి) చాలు నోరు మూయుము. ఈ ప్రేలాపన లీపాటికి చాలించు. ఇది పిచ్చాసుపత్రి గాదు నీ మాటలకు తాళము వేయుటకు. వీని మాటలలో విప్లవ బీజము లున్నవి,

ఇన్స్పె: నేను గూడ అనుకొనునది అదే.

1 స : అవును వీనికి యావజ్జీవ కఠిన శిక్ష వేయవలెను.

(త్వరగా జమీందారిణి పసుగెత్తుకొని కంగారుగా ప్రవేశించును. అందఱు ఆవైపు చూతురు.)

జమీ : ప్రభూ నా కొడుకును రక్షింపుఁడు.

జా : ఎవరురా అక్కడ, ఈమె నవతలకు పంపివేయుము.

నౌకరులు : (జమీందారిణిని అవతలగా నిలఁబెట్టుదురు. జమీందారిణి యేడ్చును.)

బో : ఇదేమమ్మా ! ఇక్కడికిఁగూడ వచ్చితివి ఇది రాజసభ కాదు. త్రాగుఁబోతుల సభ. చివరకు వారికైనను యుక్తాయుక్త విచేచన ముండును.

జా : (కోపముతో) నేనెవరినో తెలియునా ? తెలిసి మాటాడు.

బో : (శాంతముగా) తెలియును. నన్నింతకన్న మీరు చేయునది లేదు. మీ మూర్ఖత్వమునకుఁ జాల విచారముగా నున్నది.

సభ్యులు : హా హా హో (నవ్వుచు) ఇంకను బాగుగా విచారించు. గట్టిగా విచారించు.

(బోరిసు విడుదలను గోరుచు సంతకములు చేసిన విజ్ఞాపన పత్రముతో పౌరులు ప్రవేశించి జారు చక్రవర్తికి నమస్కరించి పత్రము సమర్పించురు.)

జా : (విసుగుతో) ఏమి టీగొడవంతయూ (గుమాస్తావైపు తిరిగి) చదువు

గు : (చదువు చున్నాఁడు) మహారాజ శ్రీశ్రీ . .

జా : (అడ్డగించి) అసలు విషయ మేమిటో చదువు.

గు : (చదువుచు) ఈ బోరిసు నిర్మల హృదయుఁడు. ఈతఁడు విప్లవకారుడుగాని పిచ్చివాఁడు గాని - - - -

జా : (చిరాకుతో) సరే. ఇంక చాలు. విషయము తెలిసినది. బోరిసులో తప్పేమియు లేదు. తప్పంతయు మనదే గదా.

పౌ : అదికాదండి ప్రభూ ! తమరు దయ యుంచి - -

జమీ : (విచార శూన్యయై చక్రవర్తివైపు చూచుచు నిలుచుండును.)

జా : దయయు లేదు గియయు లేదు. లాభము లేదు. మీరు వెళ్లుఁడు. నా దగ్గఱనే వీఁడు ఇంతగా మాటాడు చున్నాఁడు. ఇంక అవ

తల ఎంత పొగరుగా నున్నాఁడో. ఇది పొగరో పిచ్చియో కాక తప్పదు. (నౌకరులతో పౌరుల వైపు చూపి) వారిని పంపి వేయుఁడు.

(నౌకరులు పౌరులను బంపివేయుదురు. వారు నిరాశతో వెళ్ళి పోవుదురు.)

జా : మంత్రీ ! నీ యుద్దేశ మేమి ?

మ : ఇతనికి.

జమీ : ప్రభూ ! నాకు పుత్రభిక్ష పెట్టి కాపాడుఁడు బాబు. ఒకఁడే కొడుకు. ఆ నికోలసు నా కొడుకును ఇంతగా పాడుచేసి నాఁడు. రక్షింపుఁడు బాబు (ఏడ్చును)

జా : ఏమీటి ఈ గొడవంతయు. వీలు లేదు. (నౌకరులతో) వీనికి యావజ్జీవ శిక్ష వేసితిని. తీసికొని పొండు.

జమీ : (హా యని మూర్ఛిల్లును.)

బో : (అతని కన్నుల నుండి చెక్కిళ్ళపై రెండు కన్నీటి చుక్కలు పడును.)

జా : వీనిని ఇక్కడ నుండి తీసికొని పొండు. అబ్బా ! ఏమి గొడవరా యిదంతయు.

(నౌకరులు ఇద్దఱను వేఱు వేఱుగాఁ దీసికొని పోవుదురు.)

స : ఆహా ! ఎంత తమాషాగా నున్నది.

జా : ఇంక ఈపాటికి సభ చాలింతము.

(అందరు లేచెదరు. తెర వ్రాలును)

(ఇది రెండవ దృశ్యము)

(మూఁడవ దృశ్యము)

(నికోలను గృహము ముందు వాఁకిలి. మేరీ నిలఁబడి చూచు చుండును. డాక్టరు చేతి సంచితోఁ ద్వరగాఁ బ్రవేశించును.)

మే : ఏమండి యింత యాలస్యము చేసినారు. ఆయన శరీరములో ఏమియుఁ గులాసాగా లేదు.

డా : రాత్రి నిద్ర పట్టినదా ?

మే : రాత్రి యంతయు ఆయనకు ఏదో ఒకటే యాలోచన. దానితో నిద్ర పట్టనే లేదు. ఏదో పైకి అనుచునే యున్నారు. రాత్రి ఎనిమిదిన్నర గంటలకు మాత్రము కొంచెము కునుకు తీసినారు.

డా : టెంపరేచరు ఎంత యున్నది.

మే : ఇప్పుడే ట్ర్యాపా తీసెను. 104 డిగ్రీలున్నది

డా : దగ్గు ఎట్లున్నది

మే : అట్లే యున్నది. ఆయాసము కూడ తగ్గలేదు లోనికి దయ చేయుడు.

(నికోలసు మంచము మీఁదఁ బరుండి యుండును.)

డా : నికోలసు గారు ! నమస్కారము. ఎట్లున్నదండి.

నికో : (నొప్పితోఁ బ్రక్కకుఁ దిరిగి యాయాసముతో) నమస్కారము. నా శరీరములో అట్లే యున్నది.

డా : ఏది నాలుక. కొంచెము నాలుక చాపుఁడు.

నికో : ఎందుకండి యనవసరము.

మే : ఎప్పుడును ఒకటే మాట. మాకోసమైనను మీరు కొంచెము చాపుఁడు.

నికో : డాక్టరు గారూ ఎందుకీ శ్రమ. మీ చికిత్స వలన నాకేమియు నుపయోగించుట లేదు.

డా : మీరట్లు అధైర్య పడకుఁడు. పురుషప్రయత్నము చేసిచూతము.

మే : ఆ మందుపుచ్చుకొనుఁడు. (గ్లాసులో మందు పోసి త్రాగించఁ బోవును.)

నికో : (ఆపి) నాకు అధైర్యము లేనే లేదు. కాని నామనస్సులో నున్నది చెప్పుచున్నాను. ఎందుకీ మందులు. మృత్యువనఁగా నాకు భయము లేక పోవుటయే గాదు. దాని నొక వరముగాఁ గూడఁ దలఁచెదను.

మే : ఏమి మాటలండి, మందు పుచ్చుకొనుఁడు (అని కళ్ళవెంబడి నీళ్ళు తెచ్చుకొనును.)

నికో : అయితే సరే ఇట్లు తెమ్ము. నీ కోరిక మాత్రము ఎందుకుఁ జెల్లింపఁ గూడదు. (అని పుచ్చుకొని త్రాగును.)

డా : (మేరీతో) మరల రెండుసారులు మందిచ్చి తర్వాత ఎట్లున్నది కబురంపుఁడు. సెలవు. (నిష్క్రమించును.)

(టానియా స్ట్యూపాలు ప్రవేశింతురు.)

స్ట్యూ : నాన్న గారూ ! ఎట్లున్న దండి.

నికో : (ప్రేమతో) అబ్బాయి యిటురమ్ము.

(ల్యూబా మాయికాలోనిచ్‌లు ప్రవేశింతురు)

ల్యూ : నాన్నగారూ ! నమస్కారము లండి.

నికో : (మాయికలోనిచ్‌ను జూసి బోరిసును గుర్తు తెచ్చుకొని విచారముతో) కూరుచుండుమమ్మా.

మా : ఏమండి మామ గారూ ! మీ శరీరములో నెమ్మదిగా ఉన్నదా ?

నికో : (అసంతృప్తితో) ఊఁ.

ల్యూ : (సంకోచముతో) నేను క్షమింపరాని తప్పును చేసితిని. నా మనస్సులో బోరిసు ఒక దేవతగా ప్రకాశించు చున్నాఁడు.

నికో : అమ్మా ! జరిగిపోయిన సంగతులు ఎప్పుడు తలపెట్టకు. (ఆయాసపడుచు) మనము ఇఁకనైన ముందు చేయఁబోవు వాని విషయమై ధైర్యము వహింపుము.

మే : ఎక్కువ మాటాడ వలదని డాక్టరు గారు అన్నారు గాదటండి. మా తెలిరా ఆయాస మెక్కువగుచున్నది.

నికో : పోవు ప్రాణమును గట్టిపెట్టు వారు గాని నిలుచు ప్రాణమును బోఁగొట్టు వారును ఎవరు లేరు. (ఆయాస పడుచు) అసలు భగవంతుని మీఁద మనకు విశ్వాసము లేదు గదా. భగవంతుఁడు చేసిన నియమముల ప్రకారము నడువక మనము కల్పించుకొన్న వానినే భగవన్నిర్మితములుగాఁ దలఁచుచు బీదలను దోచుకొను చున్నాము. ధనికులు జమీందారులు వారి యాస్తులను ఇట్లే సంపాదించి రైతులను పిప్పి చేయుచున్నారు ...

(లిసా ప్రవేశించును.)

లిసా : ఎట్లున్నది బాబయ్యగారూ !

నికో : కూర్చుండుమమ్మా ! మీరందఱున్నారు. నాకెట్లున్నను సంతోషమే.

మ్యూటలి : నాన్నగారూ ! భూమి లాగుకొన్నాము, లాగుకొన్నాము అని యీ స్థితిలోఁ గూడ అనుచునే యున్నారు. మీ యిష్టము వచ్చినట్లు చేసి వేయుఁడు, మేమందఱము ఒప్పుకొందుము.

నికో : అబ్బాయీ ! నా మనస్సులోని బాధ చెప్పితిని. అది యంతయు మీ యమ్మపేర వ్రాసియిచ్చితిని. దానితో నాకేమాత్రము నిమిత్తము లేదు. నేను నిజము చెప్పకుండ నుండలేను.

మే : మన మందఱ మిక్కడ నున్నచో ఇట్లే మాటాడుచుందురు. దీనితో ఆయాస మెక్కువై నిద్ర పట్టదు. లిసా యిప్పుడే వచ్చినది. వారిద్దఱు ఒక్కటి. మనము కొంతసేపు దూరముగా వెళ్లుదము.

(లిసా తక్క మిగిలిన వారందఱు నిష్క్రమింతురు)

లిసా : బాబయ్యగారూ కొంత శాంతముగా నుండుడు.

నికో : అమ్మాయీ ఎట్లు శాంతముగా నుండ గలను వినుము నేను చేసినది సరియైనదో కాదో అని సందేహముగా నున్నది. నే నేపని లోను సఫలుడను గాలేదు. పాపము బోరిస్ బాధల కంతు లేకున్నది. వాసిలీ గారు వెనుకడుగు వేసినారు. నా దౌర్బల్యము పోలేదు. ఈశ్వరుడు నన్ను దన సేవకునిగా జేసికొనదలప లేదని యిందువల్ల బ్రకట మగుచున్నది. అతని దగ్గర సేవకులు చాలమంది గలరు. మఱి నేను దక్క మిగిలిన వారు అతని యిచ్ఛను నెఱవేర్చెదరు కాబోలు. ఈ సంగతులను దెలిసిన వానికే శాంతి లభించును.

లిసా : నిజమే. కాని యాచరించుట కష్టము.

నికో : అవును. కర్తవ్యమెప్పుడును గష్టముగానే యుండును. అందు కనియే యింత చెప్పుటయు అవసర మగుచున్నది. చెప్పిన చేయుచున్న వానిని పిచ్చివాడనుటయు ఇందువల్లనే (అయా సముతో) పాపమా బోరిసు సంగతి ...

లిసా : కొంచెము మీరు విశ్రమింపుడు నేనిప్పుడే వచ్చెదను.

(అని వెళ్ళిపోవును.)

నికో : (నిర్మల మనస్సుతో) ఓ యీశ్వరా నన్ను నీ సేవకునిగా గ్రహింపవా ? గ్రహింపవా ? అని ప్రార్థించు చుండును.

(జమీందారిణి తొందరగా బ్రవేశించును. చేతిలో ఒక పిస్తోలు ఉండును.)

జమీ : ప్రార్థించు కొనుము. నా కుమారుని నాశనము గావించిన హంతకుఁడవు. (అని కంగారుగా పిస్తోలు పేల్చి పాఱిపోవును. కాని గుఱి తప్పి చేతిని దూసికొని పోవును )

నికో : ఇప్పటికైన నీ పుత్రుని మహాత్మ్యమును దెలిసికొనలేకున్నావు. అమ్మా శాంతింపుము. పాపము కొడుకునకుఁ గలిగిన కష్టమును భరింపలేక పోయినది. నేనొక జాబు జారు చక్రవర్తికి వ్రాసి చూచెదను. (అని కాగితము కలము దీసికొని వ్రాయును.)

(వాసిలీ మిలిటరిసర్వీసును వదలిన కొందఱు నిజమైన క్రైస్తవులును ప్రవేశింతురు.)

వా : నికోలసు గారూ నమస్కారము. తిరిగి నా తప్పును నేను దెలిసికొంటిని. నా దోషమును నేను గ్రహించునట్లు భగవంతుఁడనుగ్రహించినాఁడు.

క్రైస్త : అవునండి. మతమును రక్షించు పేరుతో మత గురువులు స్వలాభ పరులై పవిత్రమగు బైబిలునకుఁ దమ యిష్టము వచ్చినట్లు అర్థము తీసి ఏసు ప్రభుని యాశయములను దెలిసికొనకుండఁ జేయుచున్నారు.

నికో : వాసిలీ గారూ ! ఇది నిజమని నేను నమ్మవచ్చునా ? వెనుక " మఱల చర్చికి పోవుచున్నాను " అని వ్రాసి తిరిగెదరా ?

వా : అవును. మానవ దౌర్బల్యముచే అట్లు చేసితిని. మీరు చెప్పిన దంతయు సత్యము.

నికో : (సంతోషముతో) మీవంటి వారు కొందఱైనను నేను జెప్పు దానిలో సత్యమున్నదని యనుచున్నందులకు సంతోషముగా నున్నది.

వా : ఇంకను సందేహమా ? మానవుఁడు తన దౌర్బల్యమును ధర్మ ములకారోపించి తన చేఁతలను సమర్థించుకొనుటకు యత్నించు నని యిప్పటికి అనుభవము వలనఁ దెలిసినది.

క్రైస్తు : అవునండి. వాసిలీగారు చెప్పినది చాల వాస్తవమైనది. పండితులును ధనికులును వినశ్వరములైన తాత్కాలికి భోగము లందలి యాశచేతను సోమరితనము చేతను సత్యమును లోక మునకు మఱుగు పఱచి మహోపకారమును చేయుచున్నారు.

నికో : అవును. మనము చదువుదానికి చెప్పుదానికి చేయుదానికి విరో ధము ఉండరాదు కార్యరూపముగా నయినప్పుడు గాని దానికి ఫలితము లేదు. దీని కంతయు మూలము మన చదువు లెక్కు వయి యుపదేశము లెక్కువై ఆచరణము తక్కువైనప్పుడు ఈ యనర్థము సంభవించును.

వా : అవునండి " శాస్త్రాణ్యధీత్యాపి భవంతి మూర్ఖాః యస్తు క్రియావాన్ పురుషః సవిద్వాన్ సుచింతితం చౌషధ మాతు రాణాం ననామ మాత్రేణ కరోత్యరోగం " శాస్త్రములను చదివి కూడ మూర్ఖులగుచున్నారు ఎవఁడైతే ఆచరించునో వాఁడే పండితుఁడు. బాగుగా రోగులకై పరిశీలింపఁ బడినను ఆ మందు పేరు జపించినంత మాత్రముచేత రోగము లేనివా నిగా ఆ మందు పేరు చేయునా " అని శాస్త్రము లుద్ఘోషించు చున్నను మనవారికి వానివైపు దృష్టియే లేదు.

నికో : అవును. నిజము. ఇప్పుడు నా జీవితమున కర్థము తెలిసినది. ఇంక నేను సంతోషముతోఁ జనిపోఁ గలను. (ఆయాసపడును)



వా : ఈ ప్రభుత్వము గూడఁ గొంత కారణమని చెప్పవలయును.

నికో : అవును. తప్పకుండ. ఇదిగో పాపము బోరిసు తన సర్వస్వమును సత్యము కోసము సమర్పించినాఁడు. (ఆయాసముతో) ఇదిగో జారు చక్రవర్తికి జాబు వ్రాసితిని.



క్రైస్తు : ఏదీ చదువుఁడు వాసిలీ గారూ.



వా : (చదువు చున్నాఁడు) "ప్రియ సోదరా. నీ పాలన మెటులున్నను నీవు నాతోడి మనుజుఁడ వైనందుకు నీవు నాకు సోదరుఁడవు కాకపోవు. నీవు ప్రభువువని చెప్పకొనుచు నీ బాధ్యతను గుర్తింప నేరకున్నావు. బైబిలు హత్య చేయవలదని శాసించు చున్నను. ఆ హత్యా కాండకై సేన నుంచి దానిని పోషించు చున్నావు. ప్రమాణము దానిలో నిషేధింపఁబడినను సైనికులచేఁ బ్రమాణములు చేయించుచు "బైబిలు లోని ధర్మము నవలంబించు బోరిసు వంటి సజ్జనుల జీవితములను నాశనము చేయించు చున్నావు." (చదువుట ఆపి) నికోలసు గారూ ! మీరు-నిజమైన దైవ భక్తులు. (మరల చదువు చున్నాఁడు) ఏసుప్రభువు పడఁగొట్టిన గుడులను మరల నిర్మించు చున్నావు. మనుజులను సర్వ నాశనము చేయు మద్యము నల్లమందు గంజాయి మొదలగు దుష్ట వస్తువులకు బహిరంగముగా విక్రయింప లైసెన్సు లిచ్చుచున్నావు. ఇవి యనుచితములని నీ యంతరాత్మ బోధించు చున్నను నీ ప్రభుత్వము నీయధికా

నీవు నిరంకశముగా పాలుటకై యిట్లు చేయుచున్నావు. ఇంక నేను వ్రాయఁజాలను ఇప్పటికైన ఆ సజ్జనుఁడగు బోరిసును విడిచి పెట్టుము. నీకు భగవంతుఁడు మంచి బుద్ధిని ప్రసాదించి నిన్ను నీ ప్రజలను రక్షించుఁగాక.

ఇట్లు
నీ ప్రియ సోదరుఁడు
నికోలసు.

[illegible] : ఇది సత్యమైన క్రైస్తవ ధర్మము.

నికో [మిగుల వాయాసముతో] నాయన లారా మృత్యు ముఖమును చొచ్చుటకు ముందు మన తండ్రి యగు ఆ పరమేశ్వరునిఁ బ్రార్థింపనిండు.

[అందఱు మౌనముతో భగవంతునిఁ బ్రార్థించు చుందురు]

తెర వ్రాలును.

సమాప్తము.

ఇది

టాల్ స్టాయ్ చే రచింపఁబడి చర్ల గణపతి శాస్త్రిచే అనువదింపఁబడిన 'చీఁకటిలో జ్యోతి' అను నాటకమున పంచమాంకము పర్వము సమాప్తము.

